శ్రీరస్తు

# నరసింహకారికావృత్తి

(భావప్రకాశికాఖ్యాంధ్రవ్యాఖ్యాసహితము)







చోడవరము

వైదికగ్రంథనిలయము

౧౯౨౨

శ్రీరస్తు

# నరసింహకారికావృత్తి

నృసింహపండితవిరచితము

శ్రీపాద వేంకటరమణదైవజ్ఞశర్మ విరచితమగు

## భావప్రకాశిక

అను ఆంధ్రవ్యాఖ్యతో ఒప్పుచున్నది

మొదటికూర్పు

రాయవరము

శ్రీ మేరీముద్రాక్షరశాలయందు మల్లిడి సత్తిరెడ్డిగారిచే ముద్రింపఁబడి

చోడవరము సంవలి వైదికగ్రంధనిలయము వారిచే

ప్రకటింపఁబడినది

౧౯౩౩

 వెల రు ౧—౧—౦

## ప్రకటింపబడిన గ్రంథములు

# బొప్పనభట్టీయము

ఇయ్యాదిశాస్త్రగ్రంథములలో అత్యుత్తమమైనగ్రంథము. అపూర్వములగు విషయములు ఇందు ప్రమాణముగా నిరూపింపబడినవి నరసింహాకారికావృత్తికి ఇది సహకారిగానుండును. రు ౧—౮—౦

నరసింహాకారికావృత్తి ౧—౧౦—౦

గౌతమీపుష్కరప్రతికల్పము. ౦—౪—౦

వలయువారు —

శ్రీపాద వేంకటరమణదైవజ్ఞశర్మగారు
వైదికగ్రంథనిలయము
చోడవరము
రామచంద్రపురము పోష్టు
గోదావరిజిల్లా.

అన్నివ్రాయవలెను.



శ్రీరస్తు

ఆంధ్రతాత్పర్యసహితా

# నరసింహకారికావృత్తి

అను

## ఆపస్తంబ సూత్రార్థసారసంగ్రహము

### మంగళాచరణము

వందేకుందశశాంకశంఖ ధవళం పద్మాక్షసూత్రాన్వితం।
విద్యాపుస్తకసంయుతంచ వరదం వాగీశ్వరం వాక్ప్రదం।
విశ్వేశంశశిమండలాంతరగతం శ్వేతార విందాసనం।
వేదాద్యాగమ రాశిరూప మమలంసద్వాజి వక్త్రంహరిం: ౧॥
ప్రణమ్య జగతామీశం సర్వమంగళ కారణం
సర్వజ్ఞం సర్వదాధ్యేయం సర్వశాంతికరం హరిం ౨॥
నమోలక్ష్మీనృసింహాభ్యాంస్థితాభ్యాం మన్మనోంబుజే
అహోబల నివాసిభ్యాం మనోవాక్కాయకర్మభిః ౩॥
ఆచార్యవర్యంభగవంతమాపస్తంబంప్రణమ్యాపిచభాష్యకారాన్
నృసింహనామ్నాక్రియతేభిరామాశ్రీకారికావృత్తిరసంశయైషా ౪॥
గర్భీకృతార్థానిచహేతుగర్భితాన్యన్యాపదేశార్థయుతానిసంత్యథ
సంధిగ్ధసంకోచితగూఢయుక్తిమంత్రాణిసంశోధ్యవివిచ్యచోచ్యతే ౫॥
ఆపస్తంబేనయత్ప్రోక్తం గృహ్యస్యస్మార్తకర్మణి
తస్యప్రయోగ వృత్త్యాఖ్యం కరిష్యేసారసంగ్రహం ౬॥

### అథశబ్దార్థము.

ఆదౌశ్రౌతాని కర్మాణి సర్వాణ్యుక్త్వాతతః పరం
స్మార్తకర్మాణి వక్ష్యామీత్యథశబ్దం ప్రయుక్తవాన్ ౭॥

ఆపస్తంబుఁడు మొదట శ్రౌతకర్మలు చెప్పెను; కావున స్మార్తకర్మలు చెప్పునపుడు
అథకర్మాణ్యాచారాద్యాని గృహ్యంతే' అనుచో అథశబ్దమును ప్రయోగించినాఁడు

## హవిర్యజ్ఞములు

అగ్నిహోత్రం దర్శపూర్ణమాసా వాగ్రయణంతథా
చాతుర్మాస్యానిచ తతోనిరూఢ పశుబంధకః ౮॥
సౌత్రామణిః పిండపితృయజ్ఞ సంస్థాభిధానకాః
ఏతేసప్తహవిర్యజ్ఞా ఆధానానంతరేరితాః ౯॥

అగ్నిహోత్రము, దర్శపూర్ణమాసములు, ఆగ్రయణము, చాతుర్మాస్యలు, నిరూఢ పశుబంధము, సౌత్రామణి, పిండపితృయజ్ఞము, అని హవిర్యజ్ఞములు ఏడు. ఇవి ఆధానానంతరమున చేయతగినవి.

## సోమయజ్ఞములు

అగ్నిష్టోమస్తతోత్యగ్నిష్టోమ ఉక్థ్యశ్చషోడశీ
వాజపేయోతిరాత్రోప్తోర్యామో యజ్ఞాశ్చసౌమికాః ౧౦॥

అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, ఉక్థ్యము, షోడశి, వాజపేయము, అతిరాత్రము అప్తోర్యామము, అని సోమయజ్ఞములు ఏడు—

ఏతానన్యాంశ్చహోమాన్యజ్ఞసంబంధాంశ్చయనాదికాన్
సర్వానుక్త్వాథ కర్మాణ్యాచారాద్యాని ప్రభృత్యతః ౧౧॥
వివాహాదీని కర్మాణి తాన్యుచ్యంతే ఖిలానిచ॥
వివాహానంతరే చాయ మనుష్ఠాన క్రమస్స్మృతః ౧౨॥

పూర్వోక్తంబులు అగుఅనేకయజ్ఞములను యజ్ఞసంబంధములగు చయనాదులను చెప్పిన పిదప వివాహాదులగు సమస్తస్మార్తకర్మలు చెప్పబడుచున్నవి. వివాహానంతరము చేయబడు కర్మక్రమము చెప్పబడుచున్నది.

## పాకయజ్ఞములు

ఔపాసనం వైశ్వదేవం సాయం ప్రాతశ్చసంతతం
స్థాలీపాకోహ్యాదక్షిణ్యాః కార్యః పర్వణి పర్వణి ౧౩॥
మాసిశ్రాద్ధం మాసిమాసి కృష్ణపక్షే పరాహ్ణకే
మాఘేకృష్ణేష్టకా శ్రాద్ధమష్టమ్యాంనవమేహ్నిచ ౧౪॥
మాసిశ్రాద్ధాష్టకాశ్రాద్ధే కార్యేపితరిచేన్మృతే
వర్షేవర్షే సర్పబలిశ్శ్రావణ్యాం కార్యఏవహి ౧౫॥

సకృత్పర్వణ్యుదగయనే త్వీశాన బలిరిష్యతే
సప్తైతే పాకయజ్ఞాస్యుస్స్మార్తసంస్థా ఇతిస్మృతాః ౧౬॥

ఔపాసన వైశ్వదేవము ప్రతిదినమును సాయంప్రాతః కాలములయందు చేయ్య వలెను. ప్రతిపర్వమునందు దక్షిణాభావము అగు స్థాలీపాకమును చేయవలెను. ప్రతిమాసకృష్ణపక్షాపరాహ్ణ కాలంబున మాసిశ్రాద్ధమును, మాఘకృష్ణపక్షమున అష్టమినాఁడుగాని నవమినాఁడు గాని అష్టకాశ్రాద్ధమును చేయవలెను. మాసిశ్రాద్ధాష్టకాశ్రాద్ధములు జీవత్పితరుడు చేయకూడదు. ప్రతిసంవత్సరమున శ్రావణమాసమున సర్పబలియు, ఉత్తరాయణమున నొకపర్వమున నీశానబలియు, కర్తవ్యములు. ఈశానబలియొక పర్యాయమే చేయవలెను. ఔపాసనము, వైశ్వదేవము, స్థాలీపాకము, మాసిశ్రాద్ధము, అష్టకాశ్రాద్ధము సర్పబలి, ఈశానబలి, అను నేడును, పాకయజ్ఞములు అనియు స్మార్తసంస్థలు అనియు చెప్పబడుచున్నవి.

పంచదశకర్మలు

గర్భాధానం పుంసువనం సీమంతోన్నయనం తతః
జాతనామాన్నచౌలాని మౌంజీవ్రత చతుష్టయం ౧౭॥
గోదానస్నానముద్వాహ ఇతి పంచదశస్మృతాః

గర్భాధానము, పుంసువనము, సీమంతము, జాతకర్మ నామకరణము, అన్నప్రాశనము చౌలము, ఉపనయనము, వేదవ్రతచతుష్టయము, గోదానము, స్నాతకము, వివాహము అని స్మార్తకర్మలు పదునైదు—

ఉత్తరాయణాది నిర్ణయము

అథోదగయనం నామషణ్మాసా మకరాదయః ౧౮॥
దక్షిణాయనమిత్యాహుః షణ్మాసాః కర్కటాదయః
పూర్వపక్షశ్శుక్లపక్షస్త్వహః పుణ్యాహనామతు ౧౯॥
ప్రాతస్సంగవమధ్యాహ్నపరాహ్ణస్సాయమిత్యమీ
పంచకాలాభవంత్యహ్నితేష్వాద్యాస్త్రయ ఉత్తమాః ౨౦

మకరసంక్రమణ ప్రభృతి ఆఱుమాసములు ఉత్తరాయణమనియు, కర్కటకసంక్రమణ ప్రభృతి ఆఱుమాసములు దక్షిణాయణమనియు, వ్యవహరింపఁబడుచున్నవి. పూర్వపక్షమనగా శుక్లపక్షమనియు, అహః అనపుణ్యాహమనియు అర్థము. ప్రాతః కాలము, సంగవకాలము, మధ్యాహ్నకాలము, అపరాహ్ణ కాలము, సాయంకాలము

అనివగటియందైదు కాలములు గలవు. అయైదుకాలములయందును ప్రాతస్సంగవమధ్యాహ్న కాలములు ఉత్తమములు—

## వివాహాదులకు సాధారణకాలము

ఉదగ్గతేర్కే-త్రివిధాశ్చ కాలా భవంతితత్రోత్తమమధ్యహీనాః
ఉపాయనేథప్రథమేవివాహేకాలానిషిద్ధోత్తమమధ్యమాసు ॥ ౨౧॥

ఉత్తరాయణమునందు ఉత్తమ, మధ్యమ అధమములను మూడుకాలములు కలవు. ఉపనయనము, ప్రథమవివాహము, మొదలగు కర్మలకు, ఉత్తమమధ్యమాధమ కాలములు ఉన్నవి.

నిషిద్ధశ్శైశిరామాసా పరిహార్యోత్తమంచహి
నైదాఘమిత్యథోద్వాహః కర్తవ్యః కుసుమాకరే ౨౨॥
ముఖ్యోథజ్యేష్ఠమాసేతు మధ్యమోథోపనాయనే

మాఘఫాల్గునములు ఆషాఢము వివాహమునకు నిషిద్ధములు. కుసుమాకరంబులగుచైత్రవైశాఖములు ఉత్తమములు. జ్యేష్ఠము మధ్యమము

వసంతే బ్రాహ్మణముపనయీతేతిహి సూత్రతః ౨౩॥
ముఖ్యోవసంతోనుక్తత్వాన్మధ్యమా జ్యేష్ఠశైశిరా

వసంతే బ్రాహ్మణ ముపనయీత॥ అప-ధ-సూ౧-౧-౧౯ అను సూత్రమువలన వసంతఋతువు బ్రాహ్మణులకుఉపనయనమునకు ఉత్తమము. జ్యేష్ఠ మాఘఫాల్గునములు మధ్యమములు

పౌషాదిమేర్కే-మకరంగతేతథాషాఢాంతిమేర్కే-సతికర్కటంగతే
మాసౌచతౌసత్యపిచోత్తరాయణేనింద్యావివాహోపనయాదికర్మసు

పౌషశుక్ల ప్రతిపత్తునాడు మకరసంక్రమణమైనను ఆషాఢకృష్ణామావాస్యనాడు దక్షిణాయన ప్రవేశమైనను పౌషాషాఢములు వివాహోపనయనాది కర్మలయందు నింద్యములు

శుక్లః పక్షోముఖ్యఆపౌర్ణమాస్యాజ్యోతిర్విద్భిశ్చోదితః కృష్ణపక్షః
మధ్యేష్టమ్యాశ్శుభయోర్ముఖ్యఊర్ధ్వంచాధోహానిత్రీణ్యముఖ్యానినాన్యాః ౨౪॥

వివాహాదులయందు పూర్ణిమవరకు శుక్లమును, పిదప అష్టమివరకు కృష్ణపక్షమును ముఖ్యములుఅని జ్యోతిర్విదులు చెప్పుచున్నారు. బహుళాష్టమీ ప్రభృతి మూడు దినములు మధ్యమములు. అటుపిమ్మట నింద్యములు.

శుక్లాంత్యకృష్ణాదిమపంచవాసరాశ్శ్రేష్ఠాద్వయోర్మధ్యమపంచమధ్యమా

శుక్లాదికృష్ణాంతిమపంచవాసరాశ్శుభేషుసర్వేషుభవంతినిందితాః ౨౬॥

శుక్ల ఏకాదశి మొదలు కృష్ణపంచమివఱకు సర్వశుభములకు ఉత్తమము. బహుళషష్ఠి ప్రభృతి బహుళదశమీపర్యంతము శుక్లషష్ఠీ ప్రభృతి శుక్లదశమీపర్యంతము మధ్యమము. కృష్ణఏకాదశి ప్రభృతి శుక్లపంచమివఱకు అధమము—

సీమంతోద్వాహాఖ్యమౌంజీషుకాలోముఖ్యః ప్రాతస్సంగవోమధ్యమోహ్నః

ఊర్ధ్వంకాలోమంగళేష్వేవనేష్టస్సర్వారాత్రిర్జ్యోతిషోక్తావివాహే ౨౭॥

సీమంతము, వివాహము, ఉపనయనము మొదలగు శుభకర్మలయందు ప్రాతస్సంగవమధ్యాహ్నకాలములు ఉత్తమములు. అపరాహ్ణసాయంకాలములు నింద్యములు. రాత్రిఅంతయు వివాహమునకు యోగ్యమని జ్యోతిశ్శాస్త్రమునందు చెప్పబడినది.

గోదానచౌలావుపనాయనాదిమోద్వాహ[illegible]మావర్తనముత్తరాయణే

శుక్లేచపక్షేశుభవాసరేతిధౌకార్యాణిపూర్వాహ్ణికకాలఉత్తమే ౨౮॥

గోదానము-చౌలము-ఉపనయనము ప్రథమవివాహము, స్నాతకము ఉత్తరాయణమునందు శుక్లపక్షంబున శుభతిథివాసరమందు పూర్వాహ్ణకాలమున చేయవలెను.

శ్రౌతస్మార్తాగ్న్యర్థముద్వాహకర్మగర్భాధానాదీనిసర్వర్తుషుస్యుః

నిమిత్తాపేక్షాణినైమిత్తికానీత్యస్యార్థస్తూదాహృతస్పష్టమేవం ౨౯॥

శ్రౌతస్మార్తాగ్నులనిమిత్తము ఐన వివాహము, గర్భాధానము మొదలగుకర్మలు నిమిత్తాపేక్షంబులగుటం జేసి సర్వర్తువులయందు చేయవచ్చును. ఇట్లు "నిమిత్తాపేక్షాణీనైమిత్తికాని" (ఆప-గృ-సూ- అనుసూత్రమున కర్థము స్పష్టముగా చెప్పబడినది —

శుభకర్మాణి కార్యాణి సదాయజ్ఞోపవీతినా 30

ప్రదక్షిణం యథాస్యాత్తుతథా కుర్యాత్స్వకర్మవిత్

యజ్ఞోపవీతియై కర్మవేత్తయగునతడు ప్రదక్షిణముగా సర్వశుభకర్మలను చేయవలెను

ప్రారంభసమాప్తి దిఙ్నిర్ణయము

స్వస్యవాగ్నేరుదక్ప్రాగ్వాదిశ్యుపక్రమ్యతేక్రియా 3౧॥

తస్యాందిశ్యపవర్గస్స్యాత్సర్వేషు శుభకర్మసు

తనకుగాని, అగ్నికిగాని, ప్రాగ్దిక్కునందు గాని, ఉత్తరదిక్కునందుగాని, ప్రారంభించి, ఆదిక్కులయందేక్రియను పరిసమాప్తి సేయవలెను.—

మాసిశ్రాద్ధంపిత్రియంతత్ప్రసవ్యంస్యాత్ప్రాచీనావీతినాకృష్ణపక్షే

మాఘమాస్యేవాష్టకాకృష్ణపక్షే కర్తవ్యాతద్దక్షిణాదిక్సమాప్తిః

పితృకర్మయగు మాసిశ్రాద్ధము అష్టకాశ్రాద్ధము, ప్రాచీనావీతియైదక్షిణదిక్కునందు ప్రారంభించి దక్షిణదిక్సమాప్తిగా అప్రదక్షిణముగా జేయవలెను.

### స్థండిలకరణకాలము

జాతచౌలాది హోమేషు సంకల్పానంతరంద్విజైః ౩౩॥

ప్రాదేశపరిమాణంతు కార్యంస్థండిలకల్పనం

జాతకర్మ, చౌలము మొదలగు కర్మలయందు ఆయాహోమసంకల్పానంతరము ప్రాదేశప్రమాణంబగు స్థండిలమును చేయవలెను.

తిస్రస్తిస్రస్తత్ర రేఖాః ప్రాగగ్రాశ్చోదగగ్రకాః ౩౪

తృణేనసమిధావాపి లిఖిత్వాద్భిరవ్రోక్ష్యచ

లౌకికారణిజాతం వాశ్రోత్రియాద్వాహృతం గృహాత్ ౩౫

అగ్నిం తత్రప్రతిష్ఠాప్య కార్యం ప్రజ్వలనాదికం

ఆస్థండిలమున తృణముచేగాని, సమిధచేగాని ప్రాగగ్రములుగా మూడు రేఖలను ఉత్తరాగ్రములుగా మూడురేఖలను, లిఖించి, ఉదకముచే నుత్తానహస్తుడై ప్రోక్షించి లౌకికాగ్నిని గాని మంథితాగ్నినిగాని శ్రోత్రియగృహానీతాగ్నిని గాని ఆస్థండిలమునందు ప్రతిష్ఠించి ప్రజ్వలనాదికమును చేయవలెను.

### ఔపాసనాగ్నియందు కర్తవ్యకర్మలు

స్యుః పుంసువన సీమంతపార్వణాదీనియాన్యపి ౩౬

ధార్యాగ్నౌతానికార్యాణీత్యగ్నిమిధ్వేతిచోక్తవాన్

అగ్నినిర్ణయ ఏవాత్ర వర్ణ్యతే సర్వకర్మసు ౩౭

పుంసువనాదికర్మ ధార్యాగ్నియందు చేయవలెనని తెలియుటకై "అగ్నిమిధ్వా అని ఆయాకర్మములయందు చెప్పియున్నాడు. అందువలన సర్వకర్మలయందును అగ్ని నిర్ణయము తెలుపబడుచున్నది.—

స్మార్తాగ్నౌపాకయజ్ఞాగ్రయణసువనసీమంతవాస్తుప్రవేశకర్మాణ్యా

ధానాత్ఫలం యత్సప్రశతిగృహాపతిం కర్మణా శ్శాంతికాదేః

మాతాపిత్రోస్స్వపిత్రోః ప్రతిశరదిసపిండీక్రియాయాంచపత్న్యా,

కార్యాణి స్వస్వపిత్రోస్సహజ విషయఔపాసనేలౌకికేవా ౩౮

పాకయజ్ఞములు, ఆగ్రయణనము, పుంసువనము, సీమంతము, వాస్తుకర్మదుష్ట జననర జో

దర్శనాదికాంతులు, మాతాపితరుల ఆబ్దికములు మాతాపితామహాదుల ప్రత్యా బ్దికములు, భార్యాసపిండీకరణము, ఔపాసనాగ్నియందు చేయవలెను. తనసోదరుల యొక్కయు, తండ్రిసోదరులయొక్కయు, ప్రత్యాబ్దికములు, ఔపాసనాగ్నియందైనను లౌకికాగ్నియందైనను చేయవచ్చును.

ప్రతిపద్యుక్తధర్మేషు కార్యస్త్వౌపాసనానలే

అపరాహ్ణే సపిండ పితృయజ్ఞ శ్రౌతాతిదేశతః ౩౯

పాడ్యమితోగూడిన అమావాస్యనాడు అపరాహ్ణకాలంబునపిండపితృయజ్ఞము శ్రౌతాతిదేశమువలన ఔపాసనాగ్నియందే చేయవలెను.

లౌకికాగ్నియందుకర్తవ్యకర్మలు

జాతకర్మాది కార్యాణి వివాహాంతాని యానిచ

కామ్యవ్రతోద్యాపనాని కార్యాణ్యగ్నౌచ లౌకికే ౪౦

జాతకర్మ మొదలు వివాహాంతములగు కర్మలును, కామ్యవ్రతోద్యాపనములను లౌకికాగ్నియందు చేయవలెను.

సభార్యస్య వివాహస్య లౌకికాగ్ని ర్విధీయతే

ద్విభార్యాగ్న్యోశ్చ సంసర్గం కుర్యాత్సూత్రాంతరేరితాత్ ౪౧

పత్నియుండగా వానికి ద్వితీయ వివాహము లౌకికాగ్నియందు చేయవలెను. సూత్రాంతరమందు చెప్పబడుటవలన ద్విభార్యాగ్ని సంసర్గము చేయవలెను.

సర్వాధానీచాహితాగ్నిర్మృతాహే దర్శ ఏవ వా హోమమవర్జం చ కుర్యాత్

శ్రాద్ధం హోమాదుత్తరం కార్యమేవేత్యాహ శ్రౌతే ధూర్తభాష్యమునా రే ౪౨

సర్వాధానియగు ఆహితాగ్ని, ప్రత్యాబ్దికమందును, దర్శయందును, హోమము చేయనక్కరలేదు. అగ్నౌకరణము గాక మిగిలిన శ్రాద్ధమును చేయవలెనని ధూర్తభాష్యమునందు వ్రాయబడియున్నది.

యజ్ఞైస్సార్థం వైశ్వదేవస్తు కార్యఏవేత్యుక్తో లౌకికాగ్నౌ చ తేన

ప్రాప్తే శ్రాద్ధే చాహితాగ్నిః ప్రవాసే కుర్యాత్సర్వం హోమవర్జం యథోక్తం

సర్వాధానియగు ఆహితాగ్ని పంచమహాయజ్ఞములు, వైశ్వదేవము, లౌకికాగ్నియందు చేయవలెను. ప్రవాసమందున్న ఆహితాగ్ని ప్రత్యాబ్దిక శ్రాద్ధమును అగ్నౌకరణరహితముగా చేయవలెను.

బ్రహ్మజ్ఞానాత్మాగ్ని మతాం ప్రవాసే గృహేషుచాగ్నౌ నసతి విద్యమానే
హోమా మోనవహ్నేః ప్రతినిధ్యభావాన్స్మృతేహ్నికర్తవ్య ఇహాగ్ని మధ్యః

బ్రహ్మవేత్తలగు ఆహితాగ్నులు ప్రవాసమందున్నప్పుడు గృహమందగ్ని యున్ననూ అగ్ని ప్రతినిధ్యభావము వలన ప్రత్యాబ్దిక శ్రాద్ధమునందు అగ్నౌకరణమును చేయకూడదు

ఔపాసనేపచనే వావ్యవస్థితో వికల్ప ఉక్తోత్రన తుల్యకల్పః
సర్వాహితాగ్నిర్విధురోపి లౌకికేవహన్యాచకుర్వీత హి వైశ్వదేవకం రగి

ఔపాసనాగ్ని యందైనను, లేక పచనాగ్నియందైనను చేయవలయునని వికల్పము చెప్పబడినది తుల్యకల్పము చెప్పబడలేదు. సర్వాహితాగ్నియు విధురుడును లౌకికాగ్నియందు వైశ్వదేవమును చేయవలెను.

అనుపనీతునకు శ్రాద్ధాధికారనిర్ణయము

స్యాల్లౌకికేగ్నౌ విధురానుపేతైః పితుస్సదాగ్నౌకరణంచ కార్యం
హోమం వినాభర్తృ మృతేహ్ని పత్న్యా శ్రాద్ధంచకర్తవ్యమిహాపిపిత్రోః

విధురుడు, అనుపనీతుడు, తండ్రి ప్రత్యాబ్దిక శ్రాద్ధమునందు అగ్నౌకరణమును లౌకికాగ్నియందు చేయవలెను. శ్రాద్ధకర్త్రియగు పత్ని భర్తృశ్రాద్ధమును, పితృశ్రాద్ధమును అగ్నౌకరణరహితముగా జేయవలెను.

శ్రాద్ధాధికారీ భవతీత్యనుపేతోపి పుత్రకః
ఉక్తః సుదర్శనాచార్యైర్మను గౌతమశాసనాత్ ౧౭

మనుగౌతమ శాసనమువలన అనుపనీతుడగు పుత్రుడు శ్రాద్ధాధికారి యని సుదర్శనాచార్యుడు తనభాష్యమందు వ్రాసియున్నాడు.

త్రయోదశాగ్నౌకరణ మంత్రానన్యాంశ్చ వాచయేత్
తేనైవ చాగ్నౌకరణం కారయేల్లౌకికానలే ౧౮
ఏతావానగ్ని మిథ్యేతి సూత్రస్యార్థ ఉదాహృతః

పదమూడు అగ్నౌకరణ మంత్రములను, ఇతరమంత్రములను, చెప్పుచు అనుపనీతుడు లౌకికాగ్నియందు అగ్నౌకరణమును చేయవలయును. ఇట్లని "అగ్ని మిథ్యా యనుసూత్రార్థము చెప్పబడినది.

పరిస్తరణము

ప్రజ్వాల్యాగ్నిమి మంధ్యాత్వాలంకృత్వైవపరిస్తరేత్ ౧౯

ప్రజ్వాలనముజేసిధ్యానముఅయినపిమ్మటఅలంకరించిపరిస్తరణము
లుచేయవలెను.

ప్రాక్ప్రత్యగాస్తీర్ణకుశోదగగ్రాస్తనుమ్మలయోశ్చపరిదక్షిణాస్యుస్యాః
తదగ్రయోరుత్తరతోహ్యధస్తాత్పరిస్తరేయుః క్రమశఃపురోగ్రాః
ప్రాక్పశ్చిమ దిక్కులయందు వేయబడు పరిస్తరణములు ఉత్తరాగ్రములుగాను ద
క్షిణోత్తరదిశలయందు వేయబడు పరిస్తరణములు ప్రాగగ్రములుగాను ఉండవలెను.
దక్షిణపరిస్తరణము ప్రాక్పశ్చిమపరిస్తరణముల పైనియును ఉత్తరపరిస్తరణము ప్రాక్పశ్చి
మ పరిస్తరణముల క్రిందునను వేయవలెను.

## పాత్రాసాదనము

ప్రాగ్దక్షిణా ప్రత్యగుదక్క్రమేణ పరిస్తృతేగ్నౌ సతిదక్షిణస్యాం
బ్రహ్మాసనార్థంతతఉత్తరస్యాంపాత్రప్రయోగార్థమిమాను
పూర్వ్యాత్ ౫౧
ప్రాగాది క్రమముగా నాలుగుదిశలయందు పరిస్తరణములను వేసినపిమ్మట అగ్నికి
దక్షిణభాగంబున బ్రహ్మాసనము కొఱకును అగ్నికినుత్తరభాగంబున పాత్రప్రయోగము
కొఱకును దర్భలను వేయవలెను.

పాత్రప్రయోగాచరణంపవిత్రయోస్సంస్కారఇత్యాద్యథపాత్రసేచనాత్
తచ్చాఖిలందర్శకపూర్ణమాసవత్తూష్ణీంచకర్తవ్యమితీహచోక్తవాన్
పాత్రప్రయోగము, పవిత్రసంస్కారము, ప్రోక్షణీసంస్కారము, దర్శపూర్ణమాస
ములయందువలె మంత్రరహితముగాజేయవలెను. అనిఆచార్యుడు చెప్పియున్నాడు.
దైవేపిత్ర్యేచోత్తరేణాగ్నిమేవదర్భాంస్సంస్తీర్యైవతేషుప్రయుంజ్యాత్
పాత్రాణ్యేవానుక్రమేణైకపంక్త్యాప్రాగగ్రాణ్యాసాదయేచ్ఛ్రౌతవద్ధి॥
దైవకర్మలయందు, పితృకర్మలయందు, అగ్నికినుత్తరభాగంబున దర్భలను వేసి, ఆద
ర్భలయందు ఏకపఙ్క్తిగాను ప్రాగగ్రములుగాను దర్వ్యాదిపాత్రములను శ్రౌతమునందు
వలె ఆనుపూర్వికముగా నాసాదింపవలెను.

కల్యాణేష్వేవ్రోదగంతానితేషాంనైవత్రేధాసాదనంపంక్తిషుస్యాత్
దర్వ్యాజ్యాదిప్రోక్షణీ పూర్ణపాత్రేద్వంద్వంస్యంచేధ్మస్రుచౌచా
నుపూర్వ్యాత్ ౫౨

పాత్రేధ్మత్వాదక్షిణోదక్కరాభ్యామాజ్యస్థాలీమృణ్మయీయాత్ర కార్యా॥

వివాహాది శుభకర్మలయందే ఉత్తగసమాప్తిగా పాత్రాసాదనము చేయవలెను. దర్వ్యాదిపాత్రములు మూడుపఙ్త్తులయందాసాదింపఁగూడదు. దర్వ్యాజ్యస్థాలులను, ప్రోక్షణపూర్ణపాత్రములను, ఇధ్మస్రువములను, వామదక్షిణ హస్తములచే రెండేసిరెండేసి పాత్రములను గ్రహించి క్రమముగా అధోబిలములుగా ఉంపవలెను. మృణ్మయపాత్రను ఆజ్యస్థాలిగా నుంపవలెను.

స్రువాదులకు వృక్షనిర్ణయము.

స్రుక్పాలాశీఖాదిరశ్చస్రువస్స్యాద్వైకంకతాశ్వథ్యశ్చప్రోక్షపూర్ణేపా
త్రేపాలాశ్యశ్చశమ్యాఃపరిధ్యాఘారేధ్మాస్స్యుఃఖాదిరావాస్రువాద్యాః
నోచేత్సర్వాస్యేవవాయజ్ఞియానిపిత్ర్యేకర్మణ్యేకమేకంప్రయుంజ్యాత్ ౧౯.

మోదుగ-చంద్రకఱ్ఱలచే స్రుక్కును, వైకంకతి (పుల్లవెలగ) కఱ్ఱచే స్రువమును, రావికఱ్ఱచే ప్రోక్షణ పూర్ణపాత్రములను చేయింపవలెను. శమ్యలు, పరిధులు, ఆఘారసమిధలు, ఇధ్మము, పాలాశవృక్షసంబంధమైనవిగా ఎఱుంగునది. స్రువము మొదలగు పాత్రలన్నిటిని చంద్రకఱ్ఱచేతనే చేయింపవచ్చును. అట్లుగాదేని యజ్ఞియావృక్షపర్ణములనే స్రువాదులనుగా గ్రహింపవచ్చును. పితృకర్మలయందొక్కొక పాత్రనే ఉంచవలెను

ఇధ్మాదుల ప్రమాణము

పాలాశః ఖాదిరోవా స్యాదిధ్మః పంచదశస్మృతః
ఇతిబోధాయనః ప్రాహాఘారౌ ప్రాదేశసంమితౌ ౨౦॥

మోదుగుసమిధలుగాని చంద్రసమిధలుగాని ఇధ్మమున కుపయోగింపవచ్చును. పదునైదుసమిధలు ఇధ్మముఅగును. అనిబోధాయనమహర్షి చెప్పియున్నాడు. ఆఘారసమిధలు ప్రాదేశ (లొడితెడు) ప్రమాణముగలవిగానుండవలెను.

ద్విప్రాదేశోథవేదిధ్మస్త్రిప్రాదేశస్తుమధ్యమః
స్థవిష్ఠోదక్షిణార్థ్యస్స్యాత్త్రిరనామిక ఇష్యతే ౨౧॥
త్రిర్మధ్యమశ్చోత్తరార్థ్యః పరిధీనాం ప్రమాణకం

ఇధ్మము ప్రాదేశద్వయ ప్రమాణముగాను, మధ్యమపరిధి ప్రాదేశ త్రయప్రమాణముగాను, దక్షిణపరిధి అనామికాంగుష్ఠవితతిత్రయ ప్రమాణముగాను, ఉత్తరపరిధిమధ్యమాంగుష్ఠవితతిత్రయ ప్రమాణముగానుండవలెను.

సంఖ్యావింశతిధాప్రోక్తా నైకవింశతిధాక్వచిత్ ౨౨॥

ఇధ్మము, పరిధులు, ఆఘారసమిధులు, కలిసి ఇరువదియొండవలెను. ఇరువదియొకటి యుండగూడదు.

ఏకాదశ్యా వా స్రువో వేతి కేచిత్ప్రాహుస్సకృత్సమాజ్యహోమేషు చాలం
ఏకం పాత్రం చేత్కథం ద్వంద్వసిద్ధిః ప్రాప్తా పాత్రాసాదనే ప్రాప్తకాలే ॥౬౦॥

సమస్తాజ్య హోమములయందును ఒక స్రుక్కుగాని ఒక స్రువముగాని ప్రయోగించిన చాలునని కొందరు చెప్పుచున్నారు. అట్లుఅయినచో పాత్రాసాదనకాలమునందు ద్వంద్వసిద్ధి ఎట్లువచ్చును—

కిం త్వైంద్రాఘారాజ్యభాగప్రధానా
స్విష్టోమాస్స్యుర్ద్వేధా హోమాస్స్రువాద్యాః
ఇత్యేవోక్తం యాజ్ఞికైశ్శిష్టవృద్ధైః
పారంపర్యాచారతోనుక్తసూత్రాత్ ॥౬౧॥

ఇంతియేకాక ఐంద్రాఘారము, ఆజ్యభాగములు, ప్రధానహోమములు, స్రుక్కుచేతను, ఇతరహోమములన్నియు స్రువముచేతను చేయవలసినవని సూత్రానుక్తమైనను పారంపర్యాచారసిద్ధమని శిష్టులు వృద్ధులు అగు యాజ్ఞికులు చెప్పుచున్నారు—

తస్మాదేతౌ స్రుక్స్రువౌ సాదనాహౌ
ప్రాప్తద్వంద్వావాప్తయే హోమసిద్ధ్యై

పూర్వోక్తకారణమువలన ద్వంద్వసిద్ధికొఱకును హోమసిద్ధికొఱకును స్రుక్స్రువముల రెండింటిని పాత్రాసాదనకాలమునందుంచక తీరదు.

ద్వేవకార్యేనా ద్వౌ స్రువౌ వేతి కేచి-
త్ప్రాహుస్స్థాలీపాకకర్మాదిషు స్తః ॥౬౨॥

స్థాలీపాకాదిచరుహోమప్రధానకర్మలయందు రెండుస్రుక్కులుగాని రెండుస్రువములు గాని ఆసాదించిన చాలునని మఱికొందఱు చెప్పుచున్నారు.

ఆజ్యగ్రహణసామర్థ్యం న దర్వ్యాస్సంభవత్యేవ
హవిర్ధారణసామర్థ్యం స్రువస్యతు న సిధ్యతి ॥౬౩॥

ఆజ్యమును గ్రహించుటకు స్రుక్కునకును హవిస్సును ధరించుటకు స్రువమునకును సామర్థ్యము లేదు.

తస్మాద్దర్వ్యాశ్శక్త్యభావాద్గ్రహీతుం

మాజ్యంహవ్యంధర్తుమేవస్రువస్య
స్థైర్యాభావాద్ద్వేస్రుచౌద్వౌస్రువౌవా
నార్హాఃకింతుస్రుక్స్రువౌసాదనీయౌ ౬౪॥

ఈకారణమువలన, ఆజ్యమును గ్రహించుటకు దర్వికి శక్తిలేకపోటచేసియు, హవిస్సును ధరించుటకు స్రువమునకు స్థైర్యాభావమువలనను, రెండుస్రుక్కులుగాని, రెండుస్రువములుగాని ఆసాదించుటకు అర్హములుగావు. కాబట్టి స్రుక్స్రువములను రెండింటిని ఆసాదించవలెను.

పవిత్ర సంస్కారము

సాగ్రౌస్థౌల్యాయామసామ్యావగర్భౌ
దర్భౌద్వౌప్రాదేశమాత్రౌపవిత్రే
కాష్ఠంవాంతర్ధాయభిత్వోదకైస్త్రి
స్సంమృజ్యాప్సుప్రోక్షణ్యాంవిధాయ ౬౫॥

సాగ్రములు, సమానస్థూలదైర్ఘ్యములు, అగర్భములు, అగు రెండుదర్భలను పవిత్రములనుగా జేసి, తృణమునుగాని, సమిధనుగాని, అంతర్ధానము (కప్పు) గాజేసి ప్రాదేశప్రమాణములనుగా ఛేదించి, ఉదకోపస్పర్శనమును జేసి, ఉదకములచే ముమ్మారు ఆ పవిత్రములను తుడిచి, ప్రోక్షణపాత్రమునందుంచవలెను.

ప్రోక్షణపాత్రాదిసంస్కారము

యత్రాస్తేసాప్రోక్షణీతత్రతస్యామానీయాపశ్చోదగగ్రే పవిత్రే
హస్తోత్తానాంగుష్ఠవిన్యసికాభ్యాంనానాధృత్వా ప్రాక్త్రిరుత్పూ
యతాభ్యాం ౬౬

పాత్రాణ్యుత్తానానికృత్వేధ్మబంధంవిస్రస్యత్రిః ప్రోక్ష్యతత్పూర్ణపాత్రంఆ
దాయైవాధావరేణాగ్నిమిత్యాద్యూర్ధ్వంకుర్యాత్తద్యథాసూత్రముక్తం

పాత్రాసాదనకాలమునందు ఎచ్చట ప్రోక్షణపాత్రము ఉంచబడినదో అచ్చటనుండగనే ప్రోక్షణ పాత్రమునందు ఉదకమునుంచి, ఉపరితలము (అరచేయిపయికి ఉండులాగున) లగు అంగుష్ఠానామికలచే పవిత్రములను వేఱుగా గ్రహించి ప్రోక్షణపాత్రోదకమును తూర్పుగా ముమ్మారు ఉత్పవనము జేసి (ప్రాక్త్రిరుత్పూయ) దర్వ్యాదిపాత్రములను ఉపరిబిలములనుగా జేసి, ఇధ్మబంధమును విప్పి, ప్రోక్షణపాత్రస్థోదకముచే దర్వ్యాదిపాత్రములను ముమ్మారు ప్రోక్షించి, పూర్ణపాత్రమును గ్రహించి (అపరే

ణాగ్నింపవిత్రాంతర్హితే॥ ఆప-గృ-సూ ౧-౭౦॥ అను సూత్రోక్త ప్రకారముగా పూర్ణపాత్రాజ్యస్థాలీసంస్కారమును చేయవలెను. ప్రాతుణపాత్రసంస్కారము అగ్ని పశ్చిమభాగంబున చేయఁగూడదు.

## పునరాహారశబ్దార్థము

ప్రాచీమారభ్యప్రతీచీంచనీత్వాభూయః ప్రాచీంప్రాప్యతూత్పూ యుతా

భ్యాం। ఏతత్కేచిద్వైపరీత్యంవదంతిశిష్టాసేచ్ఛంత్యత్రపశ్చాత్సమాప్తిం॥

పునరాహారశబ్దార్థతాత్పర్యంసముదీరితం

తతః పవిత్రేప్రహృత్యాగ్నౌతతః పరం॥

తూర్పునుండి పశ్చిమముగా త్రోసి, తిరిగి, పడమటనుండి తూర్పుగా త్రోయుట పునరాహార మనబడును. ఈపునరాహారమును పశ్చిమసమాప్తి (పశ్చిమమున ప్రారంభించి తూర్పుగా త్రోసి తిరిగి పశ్చిమముగా త్రోయుట) గాఁగొందఱు చెప్పుచున్నారు. పశ్చిమసమాప్తి శిష్టసమ్మతముగాదు. ఇట్లు పునరాహారశబ్దార్థతాత్పర్యముచెప్పబడినది. అనంతరము పవిత్రములను అగ్నియందుంచవలెను.

## స్రుక్స్రువసంస్కారము

దర్వ్యాపర్ణేనాంజలినాస్రుక్స్రువాభ్యాంస్రువేణవా

యేషుకర్మసుజైయేనజుహోతితదిహాచరేత్ ౨౦

ఏకర్మలయందువేనిచే హోమముజేయుదురో వానికే సంస్కారము జేయవలెను

స్రువందర్భైస్సహాదాయదక్షిణేనకరేణచ

స్రుచంవామేన యుగపత్కూర్మాగ్రేగ్నౌప్రతాప్యచ ౨౧

దర్భైస్సంమృజ్యహిపునః ప్రతితప్యహ్యాప్రోక్ష్యచ

నిధాయేత్యేతదంతంహికర్మసూత్రోదితంత్విదం ౨౨

స్రువమును, దర్భలను, దక్షిణహస్తముచే గ్రహించి, వామహస్తముచే స్రుక్కునుపట్టుకొని, అగ్నియందొక్కమారేకాచి, దర్భలచేతుడిచి, తిరిగికాచి, ఉదకమున్ప్రోక్షించి, క్రిందనుంచవలెను. అనునంతవరకు గలకర్మసూత్రమునందు చెప్పబడియున్నది.

స్రువమగ్రైకంతరతఇత్యాద్యన్యేవదంతిహి

తచ్ఛ్రౌతపక్షస్తత్రైవకర్తవ్యోనాన్యకర్మణి ౨3

అత్రోతిదేశాభావాచ్చవికల్పాభావతోపిచ

వంతరిప శ్చోక్తమంత్రములు. ఉపదేశపరిధానములనియు జయాదులు సర్వపరిధానములనియు చెప్పబడుచున్నవి.

తైత్తిరీయాఖ్యశాఖాయాంపఠ్యంతేరాష్ట్రభృతాంయథా
తథైవప్రోచ్యాచార్యహోతవ్యాఆపస్తంబానుసారిభిః ౧౬

"ఋతాషాట్" ఇత్యాది రాష్ట్రభృత్తులు తైత్తిరీయ శాఖయందెట్లు పఠింపబడినవో అట్లే ఆపస్తంబానుసారులు చెప్పి హోమముచేయవలెను.

కేషుచిత్కర్మసువ్యస్తా ఏతేవాపి కేషుచిత్
హోతవ్యా ఇతిశంసంతి కేచిత్పండితమానినః ౧౭
తస్యమూలం నపశ్యామోయస్మింత్సూత్రేవిధీయతే
తత్కర్మతత్రకర్తవ్యం తత్తత్సూత్రానుసారిభిః ౧౮

కొన్నికర్మలయందీరాష్ట్రభృత్తులు విడదీసిచెప్పవలెననియు, కొన్నికర్మలయందు కలిపియే చెప్పవలెననియు, పండితంమన్యులగు కొందఱు చెప్పుచున్నారు. కొన్నికర్మలయందు వ్యస్తములుగాను, కొన్నికర్మలయందు సమస్తములుగాను, చెప్పవలెనని ఏసూత్రమునందు విధింపబడినదో అట్టిమూలసూత్రము కనపడదు. కించ, తత్తత్సూత్రానుసారులు తత్తత్సూత్రోక్తక్రమముగా కర్మలు చేయవలెను, గాని ఇతరసూత్రానుసారముగా చేయగూడదు.

ఆజ్యభాగములకు అపవర్గదిఙ్నిర్ణయము

ఆజ్యభాగౌదక్షిణాపవర్గౌకుర్వంతియాజ్ఞికాః
తస్యోదగపవర్గోక్తిర్దృష్టాగృహ్యేఆశ్వలాయనే ౧౯

ఆజ్యభాగలను దక్షిణసమాప్తిగా యాజ్ఞికులు చేయుచున్నారు, ఆశ్వలాయనగృహ్యసూత్రమునందు ఆయాజ్యభాగలకు ఉత్తరసమాప్తి చెప్పబడినది.

ప్రత్యఙ్ముఖస్యాసీనస్యపురుషస్యాక్షిణీయథా
దక్షిణంచాక్ష్యుత్తరంస్యాదుత్తరంచాక్షిదక్షిణం ౨౦
భవత్యేవంహితత్స్మాదుదక్సంస్థైవలభ్యతే
స్రువేణాజ్యంగృహీత్వైవస్రుచింసంపూర్యహావయేత్ ౨౧

పశ్చిమాభిముఖముగా నాసీనుడగు పురుషుని కుడికన్ను ఉత్తరదిక్కునను ఎడమకన్ను దక్షిణదిక్కునను, ఉండును. కనుక ఉత్తరసమాప్తి సిద్ధించుచున్నది. స్రువముచే నాజ్యమును గ్రహించి స్రుక్కునందు పూరించిహోమము చేయవలెను.

ఇది ఆశ్వలాయనవిషయము. ఆపస్తంబులు దక్షిణసమాప్తిగానే చేయవలెను. తదర్థము అస్మన్మాద్రితబొప్పనభట్టీయము చూడవలెను.

ఆజ్యచరుహోమములయందు అంగప్రధాననిర్ణయము

సూత్రోక్తేష్వఖిలాజ్యహోమచరుహోమేషు ప్రధానం తతో
ప్యగ్నిస్విష్టకృతం తథైవ తదుభయం వ్యక్తం వివిచ్యోచ్యతే
యాస్త్వాజ్యాహుతయః క్రియాస్వభిహితాస్తాస్తు ప్రధానాస్స్మృతా
స్తాశ్చరభ్యజయాదయోపి విహృతాస్తాః ప్రధానం స్మృతం ౯౨

సూత్రోక్తంబులగు సమస్తాజ్య హోమములయందును, చరుహోమములయందును, ప్రధానమనియు, అగ్నిస్విష్టకృత్తనియు, చెప్పబడియున్నవి. ఆరెండింటిని నేను స్ఫుటముగా వివేచన జేసి చెప్పుచున్నాను. కర్మలయందు చెప్పబడిన ఆజ్యాహుతులు, జయాదులు ప్రధానములని చెప్పబడుచున్నవి.

యాసౌవిష్టకృతీమితిహ్యుపజుహోతీత్యాజ్యహోమేష్వసా
కర్తవ్య స్త్వయదస్యకర్మణ ఇతి హ్యగ్నిస్విష్టకృచ్చాంతిమే
స్థాలీపాకవిధిష్వహోఽగ్నిధనదాద్యైర్దేవతానామభి
ర్మంత్రైరృగ్భిరథో యజుర్భిరపి తైర్హోమః ప్రధానం స్మృతం

«సౌవిష్టకృతీమిత్యుపజుహోతి» ఆప-గృ-సూ «అని ఆజ్యహోమముల యందు చెప్పబడిన స్విష్టకృద్ధోమము «యదస్యకర్మణ» యను మంత్రముచే జయాద్యంతమందు చేయవలెను. స్థాలీపాకవిధులయందు అగ్నిధనదాదినామములచేతను, మంత్రములచేతను, ఋక్కులచేతను. యజుస్సులచేతను, చేయబడుహోమము ప్రధానమని చెప్పబడుచున్నది.

అగ్నిస్విష్టకృదంతరేణవచనాదగ్న్యాదయో దేవతా
అగ్నిస్విష్టకృద్ద్వితీయ ఇతి సూత్రార్థాత్తతస్స్విష్టకృత్
జ్ఞాతాజ్ఞాతకృతాద్యఘాపహమనాజ్ఞాతాదివిష్ణ్వంతకం
ప్రాయశ్చిత్తముదాహృతం హి చరుహోమేష్వాజ్యహోమేషు చ

«అగ్నిగ్ం స్విష్టకృతంచాంతరేణ» ఆశ-గృ-౭-౨౧ అనుసూత్రమువలన అగ్న్యాదిదేవతలును «అగ్నిస్విష్టకృద్ద్వితీయః» ఆప-గృ-౭-౭ అను సూత్రార్థమువలన అగ్నిస్విష్టకృత్తును సిద్ధించుచున్నవి. ఆజ్యహోమ చరుహోమములయందు జ్ఞానాజ్ఞానకృతదోషాపహంబును అనాజ్ఞాతాది విష్ణ్వంతకమును, అగు ప్రాయశ్చిత్తము చెప్పబడినది

ఆపన్నమున్నిష్వచతుర్దిశంశిరశ్చోద్వాసయే బ్రాహ్మణమాత్రదక్షిణాం॥

స్విష్టకృదనంతరము పూర్వపరిషేచనము వలెనే యుత్తరపరిషేచనమును జేసి, పూర్ణపాత్రమునందు మట్టల నుంచి యాసనకమును నాలుగుదిక్కుల యందును, తనశిరమ్మునందును, చల్లి అనంతరము బ్రాహ్మణునకు దక్షిణనిచ్చి, ఉద్వాసనచేయవలెను.

ఆపదయందు అగ్నిహోత్రకవిధి.

ఈశానసర్పబలిపార్వణాష్టకా స్వధర్మదర్భస్మృతచర్వసంభవే
సంకటే సతిహి కర్మసిద్ధయే హ్యగ్నిహోత్రకవిధిర్విధీయతే॥౧౦౦

ఈశానబలి, సర్పబలి, ప్రతిపత్స్థాలీపాకము, అష్టకాశ్రాద్ధము, వీనియందు ఇధ్మము, దర్భలు, ఘృతము, చరువు, సంభవము గాక ఆపద సంభవించినయెడల కర్మభంగము కాకుండునట్లు తత్కర్మసిద్ధికొఱకు అగ్నిహోత్రకవిధి చెప్పబడుచున్నది.

అగ్నిహోత్రవిషయే యవాగుకాతండులాదధిపయోఘృతాదికం
ద్రవ్యమేకమిహకాలఆగతే హ్యగ్నిహోత్రకవిధౌతదేవతు॥౧౦౧॥

యవాగు [గంజి కలకఱకు] తండులదధిక్షీరఘృతాది ద్రవ్యములయందు సంభవముగు ద్రవ్యముచే అగ్నిహోత్రిననుయజుగునఫుడు అగ్నిహోత్రము చేసినరీతిగా అగ్నిహోత్రక విధియందుకూడ పూర్వోక్తద్రవ్యంబులలో నొక దానిచే హోమముచేయవచ్చును.

కేచిదేషుపరుషొ వకార్యమిత్యాహురాపదనుపాగతేసతి
ద్విర్జుహోతిభక్షమార్ష్టి భక్ష్యముత్సృప్యచాచమనఏవానేస్మృతే

ఆపద రానప్పుడు ఈకర్మలయందు చరుహోమమునే చేయవలయునని కొందఱు చెప్పుచున్నారు. "ద్విర్జుహోతిద్విర్నిమార్ష్టి" ఆప-శ్రౌ-౬-౧౧॥ ఇత్యాది శ్రౌతధర్మములు యీఅగ్నిహోత్రకవిధియందు సిద్ధించుచున్నవి.

ఆమేనవాస్యాచ్చరుణాప్రధానత స్తత్స్విష్టకృత్ప్రాశనభక్షణేభ్యః
పర్యాప్తద్రవ్యంపరిపూర్యవహ్నిః పశ్చాత్సదర్భేష్వధసాదయిత్వా॥౧౦౩॥

ఆమమును గాని, చరువును గాని, ప్రధానహోమ స్విష్టకృద్ధోమప్రాశన భక్షణములకు సరిపోవునట్లు స్రుక్కునందు గ్రహించి అపరేణాగ్నిగా నాసాదింపబడిన దర్భలయందుంచవలెను.

ప్రధానహోమాబహులమంత్రభేదాస్తథాపిచేత్త్రక్కమశోజపిత్వా
ఏకాహుతింతాంజుహుయాత్ప్రధానంతల్లేపకంబహిర్గాషిచౌషధీభ్యః॥

నిమృజ్య చ స్విష్టకృతం చ శేషాద్ధుత్వా ప్రశస్యేన పునశ్చ లేపం
ఆదాయ తద్దక్షిణతశ్చ భూమ్యాం పితృభ్య ఏవాత్ర నిమృజ్య చాథ ॥౧౧౫॥
యజ్ఞోపవీత్యం భ ఉపస్పృశేచ్చాంగుళ్యా గృహీత్వాస్య చ లేపమేతత్
శుద్ధ్యర్థమాచమ్య పునర్గృహీత్వా ప్రాశ్యాప్సురాచమ్య తథోదగాస్యః ॥
అపృశ్యచోత్సృష్యచ సర్వశేషం తం భక్షయిత్వా నితరాం చ లేహ్య
ఆచమ్య దర్వీం సుదృఢైస్సుచంతాం ప్రక్షాళయేచ్చేష విధిస్సమాప్తః

బహుమంత్రశేషములుగల ప్రధాన హోమమంత్రములను క్రమముగా జపించి, సర్వప్రాయశ్చిత్తాహుతుల స్థానమందు ఒక ఆహుతిని జేసి, దర్వీలేపమును పితృల నుద్దేశించి దర్భలయందు నిమార్జనము జేసి అనంతరము అవశిష్టద్రవ్యముచే స్విష్టకృద్ధోమము జేసి ప్రాచీనావీతియై తిరిగి లేపమును గ్రహించి, పితృదేవతల నుద్దేశించి అగ్నికి దక్షిణభాగంబున ఆలేపమునుంచవలెను, అనంతరము యజ్ఞోపవీతియై ఉదకోపస్పర్శనము జేసి, అంగుళిచే లేపమును గ్రహించి శుద్ధ్యర్థమై ఆచమనము జేయవలెను, తిరిగి లేపమును గ్రహించి ప్రాశనజేసి, ఆచమనము జేసి, ఉత్తరాభిముఖుడై తిరిగివచ్చి సర్వశేషమును భక్షించి, దర్విని బాగుగ నాస్వాదించి, ఆచమనము జేయవలెను. అనంతరము దర్విని బాగుగ ప్రక్షాళనము జేయవలెను. ఇట్లు, అగ్నిహోత్రక విధిసమాప్తము చేయబడినది. అగ్నిహోత్రిక విధియందు పరిస్తరణపర్యవసంస్కారోపస్తరణాదులు లేవని బొప్పనభట్టీయ వ్యాఖ్యానమునందు వ్రాయబడి యున్నది.

## వివాహ మాసములు

ఆచార్యస్సర్వఋతవో వివాహస్యేతి చోక్తవాన్
తస్యార్థో౽వివిధశ్చేతి ప్రాహుః సూత్రార్థవేదినః ॥౧౧౬॥

"సర్వ ఋతవో వివాహస్య", ఆప—గృ (సర్వఋతువులయందు వివాహము జేయవచ్చును.) అను ఆచార్యవచనమునకు అర్థము బహువిధములు గలదని సూత్రార్థవేదులు చెప్పుచున్నారు.

సౌమ్యాయనేస్యాత్ప్రథమో వివాహః కార్యస్సమావర్తనపూర్వకో హి
తత్స్నానమాహుః ఖలు చోదగర్కే వివాహపూర్వేహ్ని కార్యమేవ ॥

స్నాతకపూర్వకమగు ప్రథమ వివాహము ఉత్తరాయణమున జేయవలెను. ఆస్నాతకము వివాహపూర్వదినంబున జేయతగినది.

సూత్రస్మృతిజ్యోతిషశాస్త్రసంమతం కార్యం సమావర్తనముత్తరాయణే

తస్మాత్సమావర్తనపూర్వకోద్వాహః కార్యః ఖలూక్తోనతుదక్షిణాయనే॥

స్నాతకము ఉత్తరాయణమునందు జేయఁగవలెనని గృహ్య సూత్రములయందు ధర్మశాస్త్రములయందు జ్యోతిష శాస్త్రమునందు చెప్పబడియున్నది. ఆకారణమువలన స్నాతక పూర్వకపరిణయము వివాహము దక్షిణాయనమునందు చేయఁగూడదు.

విధురవివాహకాలము

పత్నీవిహీనస్యవివాహకర్మ సర్వేషుమాసేష్వపి ధేయమేవ
అనగ్నికోనాశ్రమికోనతిష్ఠేత్ దినంవేతిచసార్వకాలం ॥౧౧౧॥

ద్విజుడు అగ్నిలేనివాఁడై నాలుగు ఆశ్రమములయందు నేదియైననొక ఆశ్రమము లేనివాఁడై ఒకరోజు అయినను ఉండకూడదు గనుక కళత్రవియోగమును బొందినయతఁడు సర్వమాసములయందును ద్వితీయవివాహము జేసికొనవచ్చును.

మృతభార్యస్యచోద్వాహః కార్యస్సర్వేషుమాసేషు
నకాలనియమోనాస్త్రిసంప్రోక్తోయాజ్ఞవల్క్యవాన్॥౧౧౨॥

కళత్రవియోగము బొందినయతఁడు సర్వఋతువులయందు ద్వితీయవివాహము జేసికొనవచ్చుననియు కాలనియమము లేదనియు యాజ్ఞవల్క్యులు చెప్పియున్నారు.

దాహయిత్వాగ్నిహోత్రేణస్త్రియంవృత్తవతీంపతిః
ఆహరేద్విధివద్దారానగ్నీంశ్చైవావిలంబయన్ ॥౧౧౩॥

మృతిబొందిన భార్యను అగ్నిచేదహించి కాలహరణము జేయక యథావిధిగా వివాహమును జేసికొని అగ్నులను సంపాదింపవలెను.

భార్యాయైపూర్వమారిణ్యైదత్వాగ్నీనంత్యకర్మణి
పునర్దారక్రియాంకుర్యాత్పునరాధానమేవచ ॥౧౧౪॥

ముందు గామరణించిన భార్యను అగ్నులచే దహించి తిరిగి వివాహము జేసికొని పునరాధానము చేయవలెను.

తథైవానాశ్రమేవాసఇత్యుక్తముపపాతకే
తస్మాత్సపిండనాదూర్ధ్వంవిధురోద్వాహఈరితః ॥౧౧౫॥

ఏఆశ్రమము లేకుండనుండుట గూడ పాపమని ఉపపాతకముల యందు చెప్పబడియున్నది. ఆకారణమువలన సపిండనానంతరము విధురుడు వివాహము జేసికొనవచ్చును.

అనాశ్రమీనతిష్ఠేతదినమేకమపిద్విజః
ఆశ్రమాదాశ్రమంగచ్ఛేదన్యథాపతితోభవేత్ ॥౧౧౬

చేసి ఆ రెండును వారములయందును శుభకార్యములు చేయగూడదు.

సర్వాణీత్యాదిసూత్రేషు ప్రతీయేరన్నిదంవచః
అనుక్రమేణ ప్రత్యేకమభిసంబధ్యతే తతః ॥ ౧౨౯ ।

“ఆవృతశ్చాస్త్రీభ్యః ప్రతీయేరన్„ ఆప—గృ—౭—౧౯॥ అనుక్రమము వలన “ప్రతీయేరన్„ అను పదము “సర్వాణి పుణ్యోక్తాని నక్షత్రాణి„ ఆప—గృ—౨-౧౩, ఇత్యాది సూత్రత్రయమునందు ప్రత్యేకము గా సంబంధించుచున్నది.

హస్తస్స్వాతీ రేవతీమిత్రపిత్ర్యబ్రాహ్మీమ్మూలసౌమ్యమ్యభంచోత్తరాశ్చ
తారాయోగ్యావాసరాస్సూర్యదర్నాథ్వాలగ్నంజ్యోతిశ్శాస్త్రవిద్భిర్య
థోక్తం ॥ ౧౩౦

హస్త, స్వాతి, రేవతి, అనూరాధ, మఖ, రోహిణి, మూల, మృగశిర, ఉత్తరాత్రయము, శుభవారములు, పూర్వాహ్ణము, జ్యోతిశ్శాస్త్ర విదుక్తలగ్నము, శుభములయందు యోగ్యములు.

గర్భాదానాద్యాసు సర్వక్రియాసు తిథ్యృక్షాద్యాలగ్నపర్యంతకాశ్చ
శస్తాః పుణ్యోక్తానిసర్వాణి చేతినక్షత్రాణీత్యస్య సూత్రార్థ ఉక్తః ।

గర్భాదానము మొదలగు సమస్త శుభకర్మలయందు శుభకరంబులగు తిథివార నక్షత్ర లగ్నములు పరిగ్రహింపవలెను. ఇట్లు “సర్వాణి పుణ్యాని నక్షత్రాణి„ ఆప గృ—౨—౧౩ అను సూత్రార్థమున చెప్పబడినది.

అధీతవేదో గురుణానుమంత్రితో గృహాశ్రమాకాంక్ష్యథ వోత్త
రాయణే । దివాసపూర్వత్ర సకర్మకృత్స్వయం నాందీముఖ
శ్రాద్ధకృదుక్తలక్షణా । ౧౩౨ ।

అధీతవేదుడు, గుర్వనుజ్ఞాతుడు, గృహస్థాశ్రమాకాంక్షియు నగు బ్రహ్మచారి ఉత్తరాయణమున, శుభదినంబున, పూర్వాహ్ణమునందు, స్నాతకమును జేసికొని నాందీశ్రాద్ధమును చేయవలెను.

దాతుర్గృహే యస్య హి కన్యకాస్తి తేనాదరాహూతవరః ప్రయాయాత్
సువాసినీవిప్రసుహృద్భిరాప్తైస్సుగంధపుష్పాక్షతమంగళాద్యైః ॥
విచిత్రవస్త్రాభరణాత్మజాంజనస్రక్కంచుకోపేతసువాసినీగణైః
తాంబూలనానావిధగంధభూషణస్రక్కంచుకోష్ణీషధరైర్ద్విజోత్తమైః
ఆమ్నాయధ్వనిభిస్త్వనిందితకులస్త్రీగీతఘోషాదిభిః

కన్యాదానవిధౌతిరస్కరిణికా వస్త్రాదిసంధానకం। జ్యోతిశ్శాస్త్ర
విదుక్తశోభన ముహూర్తంయావదాకాలికం। కల్యాణాష్టక
చూర్ణికాదిపఠనం తస్మిన్ముహూర్తేచతా। వన్యోన్యంగుడజీర
కంచశిరసోః ప్రక్షేపణందంపతీ ॥౧౩॥

మంగళాచార కర్మలు చెప్పుచున్నాడు. నర్వోపస్కరవస్తు సహితముగా కంతనిచ్చుట, కల్యాణోత్సవ మంటపమునందు ఘటికాపాత్రాస్థాపనము వివాహాఘులకు వరాదులకు ఎదురుగావెళ్లుట, శాలయందు శాసికధారణము, (భోజన)శాల యందు వరపాదప్రక్షాళనము చేయుట, కన్యాదాన సమయమందు తెరవేయుట, శుభముహూర్త పర్యంతము మంగళాష్టకములను చూర్ణికను పఠించుట శుభ ముహూర్త సమయమందు వధూవరులు పరస్పరము శిరంబులయందు గుడసహిత జీలకర్రనుంచుకొనుట, మొదలగు మంగళాచార కర్మలుచేయవలెను.

## బ్రహ్మాది వివాహలక్షణము

ఆర్షేన్వకాభిః ప్రసృజ్యంతేఆదిత్యాదినక్షత్రాభ్య మభిమంత్రయేత
ఇత్యంత్రమార్గానుసారేణోద్వాహయోరుక్తంహికన్యావరణంవశేంసనం॥
కర్తవ్యమార్గానుసరణోద్వాహయోరన్యేష్వకన్యావరణంవిధీయతే॥

"ఆర్షేన్వకాభిః ప్రసృజ్యంతే,, (మృగశిర నక్షత్రమందు కన్యావరణార్థమై వెళ్లినవారలు దాతలచే పూజింపబడుదురు.) అనువది మొదలు "తొవాదితోదాభ్యామభిమంత్రయేత" అను సూత్రమువరకుగల కన్యావరణాదికము ఆర్షాసుర వివాహములయందు చెప్పబడినది. ఇతర వివాహముల యందు కన్యావరణము విధింపబడలేదు.

ప్రతిగ్రహార్త్విజ్యబలాద్వివాహకౌ బ్రాహ్మక్యదైవౌఖలువోత్త
మోత్తమౌ॥ కాయార్షకౌమధ్యమకౌతధేతరేస్యుర్ద్విబ్రాహ్మణా
నాంసతతంహినిందితాః॥

ప్రతిగ్రహణము, ఆర్త్విజ్యము, వీనివలనబ్రాహ్మదైవవివాహములు బ్రాహ్మణులకు ఉత్తమములు. ఆర్షప్రాజాపత్య వివాహములు మధ్యమములు. ఇతర వివాహములు నింద్యములు.

రాజ్ఞాంతుగాంధర్వకరాక్షసౌవిశస్స్యాదాసురస్సర్వవిగర్హితోంతిమః ॥౧౪॥ ప్రాహుఃఆర్షస్తువివాహఆసురోవైశ్యస్యతూద్వా

హావిధిః ప్రశస్యతే॥

రాజులకు గాంధర్వ రాక్షస వివాహములు ఉత్తమములు. వైశ్యులకు అసురవివాహము ముఖ్యము. బ్రాహ్మణాది సర్వవర్ణములకు పైశాచవివాహము నింద్యము. ఆర్షవివాహము బ్రాహ్మణులకు అసురవివాహము వైశ్యులకు ప్రశస్తము. అని చెప్పబడుచున్నది.

మృగశీర్షే కృత్తికాయాం వహ కన్యకాం మఘాసు గౌ ర్గ్రాహ్య మథే వివాహకం

మృగశిరానక్షత్రమందు కన్యావరణము జేయవలెను. మఘానక్షత్రమునందు వరుని చేనివ్వబడు గోమిథునద్వయము పరిగ్రహించవలెను. ఉత్తరఫల్గునీనక్షత్రమునందు వివాహము జేయవలెను.

సుప్తాపిదత్తాదిసమస్తకన్యకా నింద్యాస్స్యురార్షాసురయోర్వివాహయోః ఆర్షం వివాహం ప్రథమం ప్రయుక్తవాన్ కర్మార్హ మంత్రాధ్యయనానుసారత

ఆర్షాసుర వివాహములయందు సుప్తాపిదత్తాదికన్యకలు నింద్యలగుచున్నారు. మంత్రపాఠానుసారముగా నార్షవివాహము నాపస్తంబమహర్షి చెప్పియున్నాడు.

ఉక్తాధర్మాయేయఆర్షేవివాహే బ్రాహ్మప్రాజాపత్యదైవేషు నస్యుః సర్వేష్వవ్యద్వాహకార్యేషువక్ష్యమాణా ధర్మాస్సర్వసాధారణాస్స్యుః

ఆర్ష వివాహములయందు చెప్పబడిన ధర్మములు బ్రాహ్మ ప్రాజాపత్య దైవ వివాహములయందు లేవు. బ్రాహ్మాద్యష్ట విధవివాహములయందు వక్ష్యమాణ ధర్మములు సర్వసాధారణములని తెలిసికోవలెను.

కన్యాదానంస్వాతినక్షత్రయుక్తం ప్రాజాపత్యబ్రాహ్మదైవేషు తత్స్యాత్। నాన్యేషాంస్యాద్విధ్యభావాద్ద్విజానామాచార్యేణగ్రాహ్యఆర్షోవివాహః॥౧౮౬

స్వాతీనక్షత్రమునందు కన్యదానము శుభప్రదము ఈ కన్యాదానము ప్రాజాపత్య బ్రాహ్మ దైవవివాహములయందు కూడ కలదు ఇతరవివాహములయందు విధిలేకపోవుటవలన లేదు. బ్రాహ్మణులకార్షవివాహము గ్రాహ్యమని ఆచార్యుడు చెప్పియున్నాడు.

గార్హస్థ్యాపసీయాత్రవివాహమంటపేగృహేషు చైకాపితయోః ప్రయోజనం। తయోఃపరం చాతిథి వత్సమర్హ్యేత్క్రమేణయోస్స్యాపచిత స్తమన్వయా॥౧౮౭॥

వివాహమంటపమునందొక గోవును, గృహమునందొకగోవును కట్టవలెను వివాహమంట పమునందు కట్టబడిన గోవుచే వరునకును గృహమునందుకట్టబడిన గోవుచే వరాపచితునకును అతిథిపూజవలె మధుపర్కపూజ చేయవలెను.

వరాయమధుపర్యాన్మధుపర్కే కర్మగోయుక్తముద్వాహేనికేతనేతు
తత్రోపరస్యాపచితాయదద్యాద్వివాహహోమాత్పరకాలఏవ.॥౧౮౮॥

వివాహగృహమునందు వరునకు గోసహిత మధుపర్క పూజ జేయవలెను. వివాహ ప్రధాన హోమానంతరము వరాపచితునకు జేయవలెను.

గోరాలంభస్థానమేతావదేతద్బ్రాహ్మ్యస్త్రార్థంయత్తద్యుగేస్మిన్నిషిద్ధం

గోరాలంభ (గోవును వధించుట) స్థానమిదియే. కలియుగమునందు మధుపర్క పూజయందు గోరాలంభము నిషేధించబడినది. గోరాలంభ బోధక వచనములు యుగాంతర విషయములు.

## సప్తపదికిపూర్వము వరమరణము

దత్తాకన్యాసప్తపాదాత్పురాచేద్దేయాన్యస్మైనోనిషిద్ధాకదాచిత్॥
ఇత్యేవప్రోక్తంయాజ్ఞవల్క్యేనసప్తపాదాదూర్ధ్వందోషమాహు
స్స్వదత్తా। తస్మాదూర్ధ్వంచేదసౌనాపునర్భూస్తస్యాఃపుత్రాస్సా
మపౌనర్భవాఖ్యాః॥

సప్తపదికి పూర్వమునందు వరుడు మరణించినచో మరియొకని కాకన్యకనిచ్చి వివాహము జేయుటనిషిద్ధముగాదని యాజ్ఞవల్క్యుడు చెప్పియున్నాడు సప్తపద్య నంతరమందు ఆకన్యకు పునర్వివాహము జేసిన దోషము వచ్చునని చెప్పుచున్నారు * సప్తపదికి తరువాత పునర్వివాహము జేసికొనినస్త్రీ పునర్భువు అనియు తత్పుత్రులు పౌనర్భవులు అనియు చెప్పబడుదురు.

అన్యైర్దత్తా చేద్వినా దాతు రాజ్ఞా మజ్ఞానాద్వా బంధనాద్వా బలాద్వా దేయాన్యస్మై కన్యకా నోనిషిద్ధా సాంగోద్వాహే సత్యపి ప్రాహు రార్యాః

అజ్ఞానమువలనగానిదాతను కట్టుటవలన గాని బలాత్కారముగా గాని దాత

* రంభాకపిత్థాది ఫలానినారికేళాజాదిభిః పంచభిర్యుతాని స్వాలంకృతానాం క్రమశో త్ర విందాద్యాత్స్వంస్పర్శనాద్వా విఫలంకుమార్యాః॥ అను శ్లోకము ఛ.ఓ. వ పుస్తకమునందు చూపట్టుచున్నది.

యనుమతి లేకుండా ఇతరులచే ఇవ్వబడిన స్త్రీకి వివాహము సాంగమైనను దానికన్యకను మరియొకనికిచ్చి వివాహము జేసిన దోషము లేదని ఆర్యులుచెప్పుచున్నారు.

వివాహానర్హకన్యకలు

కన్యా గుప్తా ద్యా శ్చోర్ధ్వ ఏతా వర్జ్యానక్షత్రాదినామ్న్యశ్చ సర్వాఃసుప్తాద్యేతా స్సన్య గృహీ ర్లక్షణాని ద్రవ్యాణ్యంతర్లక్షణా న్యేవ పంచ॥౧౨౨॥

నానాబీజా న్యత్ర వేద్యాశ్చ పాంసూన్ క్షేత్రాల్లోష్టం గోశకృ త్స్మశానాని ద్రవ్యాభావా ద్వృద్ధిదాన్ క్రమేణాజ్యం కార్యం పంచమం భాగ్యవన్తః॥౧౨౩॥

౧గుప్త ౨ద్యోత ౩ఋషభ ౪శరభ ౫నదీనగ ౬వృక్ష ౭ముండ ౮వామందూషిక ౯సాంగారిక ౧౦రాత ౧౧పాలి ౧౨మిత్ర ౧౩స్వనుజ ౧౪వక్షకారి అనుపదునలుగు రు కన్యలును నక్షత్రాభిధాన కన్యకలును నద్యభిధానకన్యకలు, వివాహార్హలు కారు. సుప్త, రుదతి, నిష్క్రాంత, అను నీమువ్వురు కన్యకలు కూడ వివాహార్హలు గారు. సుప్తాదికన్యలు బాహ్యలక్షణయుతలు. నానాబీజములు, యజ్ఞవేదికాపాంసుగము, సస్య సంపన్నక్షేత్రమృత్తిక, గోమయము, శ్మశానమృత్తిక, అను నీయైదు ద్రవ్యములు వివాహ్యకన్యకవలన తనకు గలుగు వృద్ధిక్షయముల దెలిసి కొనుటకు అంతర్లక్షణము లు. ద్రవ్యపంచక స్పర్శనమువలన క్రమముగా ప్రజావృద్ధి, యజ్ఞవృద్ధి, సస్యాభివృద్ధి, పశువృద్ధి, వధూవరాన్యతరమరణము గలుగును. అందువలన శ్మశానమృత్తికను స్పర్శ జేసిన కన్యక వివాహార్హ కాదు.

యోగ్యకన్యావరలక్షణము

బంధుశీలకులబుద్ధిలక్షణారోగ్యసంపదుపపన్నకన్యకా॥
వేదశాస్త్రసహితోక్తలక్షణోపేతవిప్రవర ఉచ్యతేవరః॥

శ్రేష్ఠబంధువులుగలది, ఆస్తిక్యాది సుశీల సంపన్నురాలు, గూఢగుల్ఫాదిసాముద్రికశాస్త్రోక్త స్త్రీలక్షణలక్షితయు, ఆరోగ్యవంతురాలు, అగు కన్యక వివాహార్హ యగును. బంధువులు గలిగినట్టియు, ఆస్తిక్యాదిగుణములు గలిగినట్టియు, సాముద్రిక శాస్త్రోక్తపురుషలక్షణ లక్షితుడు, వేదవేదాంగ వేత్తయు, అగు నతడు వివాహమున కర్హుడు.

యస్యాం మనశ్చక్షుషోర్నిబంధ స్తస్యా మృద్ధిం వదంత్యేవహి కన్యకా

యాం। ఆర్షే వివాహే సుహృదాభిమంత్రణం నాస్త్యేషు కన్యావరణం త్రిషు స్యాత్ ॥౧౫౫॥

ఏకన్యకయందు మనస్సు నేత్రములు ఆసక్తి బొందునో ఆకన్యకను వివాహము చేసికొనిన ధర్మాదులకు వృద్ధి కలుగు నని కొందఱు ఆచార్యులు చెప్పుచున్నారు. ఆర్షవివాహమునందు కన్యావరణము ఉన్నది. ఇతర వివాహములయందు లేదు.

యద్వృద్ధాచరితం తదాచరణముద్వాహేహ్ని పూర్వేహ్ని వా।
పుణ్యాహాభ్యుదయ క్రియాదికులదేవస్థాపనాద్యావరాత్
నిర్వర్త్యోచిత మంగళాఖిలపదార్థైః స్వైః స్వబంధుభిస్సంయుతో
హ్యభ్యాగవ్య వరం ద్విజప్రవర ముచ్చాగార మావేశయేత్ ॥౧౫౬॥

వృద్ధాచారసంపరాప్రాప్తంబు లగు పుణ్యాహవాచన నాందీశ్రాద్ధకులదేవతాస్థాపనాది కర్మలను వివాహదివసంబున గాని, తత్పూర్వదినంబున గాని, నిర్వర్తించుకొని, మంగళపదార్థ సహితుడై బంధువులతో వరున కెదురుగా వెళ్లి తీసికొని వచ్చి విడిదియందు ప్రవేశ పెట్టవలెను.

## వివాహసంకల్పము

ఉష్ణీష కంచుకనవాంబర కజ్జలస్రగ్రత్నాంగుళీయ మకరకుండలభూషితస్సన్। ఆచార్యమిత్రసహిత శ్శుభగేహ మేత్యప్రాఙ్ముఖ స్సముపవిష్ట ఉదారపీఠే ॥౧౫౭।

ధర్మప్రజా సంపత్త్యర్థం స్త్రియముద్వహ ఇత్యపి సంకల్ప్య చాసమానార్షగోత్రజాం శ్రోత్రియాత్కులాత్॥ దశపూరుష విఖ్యాత జాతాం కన్యాం మనోహరాం అరోగిణీం భ్రాతృమతీం పిత్రాదత్తాం ప్రతిగృహ్ణీత్ ॥౧౫౮।

తలపాగ, అంగరకా, నూతనవస్త్రము, కాటుక, పుష్పమాలికలు, రత్నాంగుళీయకము, మకరకుండలములు, మొదలగు వానిని ధరించిన వాడై ఆచార్య మిత్రులతో గూడి వివాహ గృహమును ప్రవేశించి పీటమీద ప్రాఙ్ముఖముగా నాసీనుడై ధర్మప్రజా సంపత్త్యర్థం స్త్రియముద్వహే యని సంకల్పించి అసమానార్ష గోత్ర జయు మనోహరయు రోగిష్ఠి కానిదియు దశపూరుష విఖ్యాత శ్రోత్రియ వంశజాతయు భ్రాతృమతియు, తండ్రిచే నివ్వబడినదియు, అగు కన్యను ప్రతిగ్రహించ వలెను.

## గృహ్యాగ్నిప్రతిష్ఠ

ఉద్వాహార్థం పాకయజ్ఞాద్యశేషస్మార్తాఖ్యానాం
కర్మణాం హోమసిద్ధ్యై హోమాశేషాణాంచ
విజ్ఞసాధ్యశ్రౌతాగ్నీనాం హేతుభూతం ప్రధానం॥౧౬౭॥
లోకారణీభ్యాం మథితానలంవా సచ్ఛ్రోత్రియాగారత ఆహృతంవా
అలంకృతాయాం శుభవేదికాయా మగ్నిప్రతిష్ఠాపనమత్రకుర్యాత్।

కన్యాదానానంతరము వివాహము, ఔపాసనాదిపాకయజ్ఞములు, హవిర్యజ్ఞములు శ్రౌతాగ్నులు మొదలగు కర్మల హోమసిద్ధికి హేతుభూత మైనదియు, ప్రధాన మైనదియు, అగు అగ్నిని మథించి గాని, శ్రోత్రియగృహమునుండి తీసికొని వచ్చిగాని, అలంకృత వేదిక యందు ప్రతిష్ఠించవలెను.

ఉద్వాహవహ్నేః పరిరక్షణీయః ప్రయత్నతో ర్థా స్వపరికర్మిభిస్స్యాత్

ఇట్లు ప్రతిష్ఠించబడిన గృహ్యాగ్నిని ప్రయత్నపూర్వకముగా పరికర్ములు (సేవకులు) రక్షించుచుండవలెను.

## మధుపర్కపూజ

ప్రత్యేత్య సప్రాఙ్ముఖ ఆసనార్హపీఠోపవిష్టో హి వరోతి హృష్టః।
విప్రైస్సుహృత్పుత్రకళత్ర సమన్వితేన స్రగ్వస్త్రగంధమణిభూష
ణభూషితేన। భద్రాసనే సముపవిష్టకుబేరదిగ్ద్రు దాత్రా సమర్పిత
మహామధుపర్కపూజాం ॥౧౭౦॥

గృహ్యోక్తేనవిధినైవ హి కూర్చపాద్యాద్యుక్తోపచారసహితాం
ప్రతిగృహ్య చాథ గంధాక్షత స్రగుపవీతసుగంధవాసోలంకార జాత
మఖిలం ప్రతిగృహ్యతత్ర ।౧౭౧।

ఇట్లు గృహ్యాగ్నిప్రతిష్ఠ జేసి వివాహగృహమునకు తిరిగివచ్చి, అతిసంతోషయుక్తుడగు వరుడు ఆసనమునందు ప్రాఙ్ముఖముగా నాసీనుడయి బ్రాహ్మణులు, మిత్రులు, పుత్రులు, కళత్రము మొదలగువారితో గూడికొన్నట్టియు, వస్త్రమణిగంధభూషణ భూషితుడైనట్టియు, భద్రాసనమునందు ఉత్తరాభిముఖముగా, నాసీనుడైనట్టియు, దాతచే నివ్వబడినదియు, అర్ఘ్యపాద్యాద్యుపచార సహితమైనదియు, అగుమధుపర్కపూజను పరిగ్రహించి పిమ్మట దాతచే నివ్వబడినగంధము, అక్షతలు, పుష్పమాలికలు, యజ్ఞో

పవిత్రమువస్త్రము అలంకారములు మొదలగు పదార్థములను పరిగ్రహించవలెను.

సుముహూర్తము

యావజ్జ్యోతిర్దత్తంలగ్నం వదేయుస్తావత్కల్యాణాష్టకంచమాఙ్గళికాంచ
లగ్నేప్రాప్తేన్యోన్యమాలోకనీయంవాస్యైశ్శీర్షేశ్శర్కరాజీరకేస్తః

అనంతరము దైవజ్ఞునిసుముహూర్త పర్యంతము మంగళాష్టకములను చూర్ణికను పఠించి సుముహూర్తసమయమున వధూవరులు పరస్పరము జూచుకొని శిరస్సులయందు పరస్పరము గుడసహితముగు జీలకఱ్ఱను ఉంచుకొనవలెను.

కన్యాందృష్ట్వా భ్రాతృమంత్రంజపిత్వాతామీక్షేతాఘోర మంత్రేణాచాథ। ఆశీఃకార్యాబ్రాహ్మణైర్వేదవిద్భిఋగ్భిశ్చస్తైస్సామభిర్వా
యజుర్భిః॥౧౨౩

తర్వాతకన్యకను వరుడు చూచి “అభ్రాతృఘ్నీం” అను మంత్రమును జపించి, “అఘోర చక్షుః,” అను మంత్రముచే ఆకన్యకను చూడవలెను. అనంతరము, వేదవేత్తలగు బ్రాహ్మణుల వలన మంగళకరంబులగు ఋగ్యజుస్సామములచే ఆశీర్వాదమునుపొందవలెను.

వరవధూసంకల్పము

దర్భేష్వాసీనౌవరవధ్వౌసంకల్పయతఆవాభ్యాంకర్మాణి కర్తవ్యాని
ప్రజాశ్చోత్పాదయితవ్యాఇత్యనయోర్నైమిత్తికేస్యవిధయోః॥౧౨౪

దర్భలయందాసీనులగు వధూవరులు “ఆవాభ్యాంకర్మాణి కర్తవ్యాని ప్రజాశ్చోత్పాదయితవ్యాః” కర్మలను మనము చేయవలెను. సంతానము పుట్టించవలెను” అని సంకల్పమును చేయవలెను.

వధూభ్రూమార్జనము

ధృత్వాంగుష్ఠానామికాభ్యాంచదర్భంలిప్యాప్సంమృజ్యభ్రువోరంతరంహి
మంత్రేణైతత్ప్రతీచీంనిరస్యేదంభస్స్పృష్ట్వారౌద్రరాక్షేతిమంత్రాత్

అంగుష్ఠానామికలచే వరుడు దర్భనుపట్టుకొని వధువుకనుబొమ్మలమధ్యను “ఇదమహం” అనుమంత్రముచే తుడిచి, దర్భను పశ్చిమదిశయందు పడవేసి “రౌద్రరాక్షస” అనుమంత్రమునందు చెప్పబడుటవలన ఉదకోపస్పర్శనము చేయవలెను.

యుగచ్ఛిద్రాభిషేకము

శోకేప్రాప్తేచేజ్జపేదుక్తమంత్రంయుగ్మాన్విప్రానేకకార్యార్థయుక్తాన్

హించి "ప్రాహత్వేతోనయతు" యను మంత్రముచే నగ్ని సమీపమునకు దీసుకొని వెళ్లి అగ్నికి పశ్చిమభాగంబున ఉండవలెను.

ప్రధానహోమాదులయందుదక్షిణవధూనిర్ణయము

వధ్వాసహాగ్నిమభిగమ్యచతస్యపశ్చిమే పీఠాదిషూపవిశతోయుగప
ద్వధూవరౌ తత్రోత్తరోనరఇతీరణాత్ వివాహకర్మాదిమాష్టవిధకర్మ
సుచోత్తరోవరః।౧౮౬। ప్రధానహోమోయుద్ధృదాదిహోమః ప్ర
వేశఆగ్నేయచరోశ్చహోమః తచ్ఛేష హోమోహృదయాభి
సంగమస్సీమంతకః పుంసువనాఖ్యహోమః।౧౮౭। ఏతేషుహోమే
ష్వపిచోత్తరోవరశ్చాసీనఆగూర్యకరోతికర్మతత్ ఆరభ్యచాబ్రహ్మ
విసర్జనాంతతఃఫలప్రదానేపితథోత్తరోవరః।౧౮౮।

ఇట్లు వధూసహితుడై అగ్ని సమీపమునకు వెళ్లి, అగ్నికిపశ్చాద్భాగమున పీఠాదులయందొక్కపర్యాయము కూర్చుండవలెను "ఉత్తరోవరః" ఆప-గృ-౪-౮- అనుట వలన వివాహాద్యష్టవిధకర్మలయందు వరుడు ఉత్తరమున కూర్చుండవలెను. ప్రధానహోమము, యుద్ధృదాదిహోమము, ప్రవేశహోమము, ఆగ్నేయస్థాలీపాకము, వివాహశేషహోమము, హృదయసంసర్గహోమము, సీమంతము, పుంసువనహోమము అనునీ ఎనిమిదికర్మలయందు ఉత్తరమున వరుడాసీనుడై సంకల్ప ప్రభృతి బ్రహ్మవిసర్జనాంతము చేయవలెను. ఫలప్రదానము (బ్రహ్మస్థలు) నందు ఉత్తరమున వరుడు ఉండవలెను.

అహోమహోమాత్మకసర్వకర్మసుస్మార్తేషుపత్నీచ పతేశ్చదక్షిణే
కర్తోత్తరస్యాందిశిచాసనస్థో ముతాసురాగూర్యకరోతిచాఖిలం।౧౮౯।

హోమరహితములు, హోమసహితములు, అగుసమస్త స్మార్తకర్మలయందు తన దక్షిణభాగంబున పత్నినికూర్చుండజేసి తానుఉత్తరమున నాసీనుడై ప్రాణాయామప్రభృతి సమస్తముచేయవలెను.

కామ్యవ్రతోద్యాపనకర్మసుస్యాత్కర్తోపవిష్టోదిశిదక్షిణస్యాం
సర్వేషుపర్వస్వపిచాగురాంతఃకుర్యాస్సచోర్ధ్వంనియమోథకించ

కామ్యవ్రతోద్యాపనములయందు, సమస్త పర్వములయందు, కర్త దక్షిణభాగంబున కూర్చుండి సంకల్పమునాదిగా జేసి తనవామభాగమున పత్నిని ఉంచుకొనవలెను.

హిరణ్యకేశివ్యతిరిక్తకానాంప్రధానహోమాదిషుషట్సునిత్యం
శాఖావిభేదాత్తుననంశయోత్రతిష్ఠేద్వధూర్దక్షిణతోవరస్య।౧౯౦।

హిరణ్యకేశులుగాక మిగిలిన సమస్తశాఖలవారు ప్రధాన హోమాది అఖిలకర్మలను దక్షిణవధువుగానుండి చేయవలెను.

ఇత్యుక్తమార్గైర్బహుభిస్స్వవృద్ధైః సూత్రార్థతాత్పర్యవివేకవద్భిః
సంకల్పమారభ్యసమాపనాంతం కర్త్రైవమేవం సకలం క్రియాసు ॥౯౭

సూత్రార్థ తాత్పర్య వివేకము కలిగినట్టియు, వృద్ధులైనట్టియు, అగు పెక్కుమంది పెద్దలచే నీప్రకారముగా చెప్పబడినందున సంకల్ప ప్రభృతి సమాప్తి పర్యంతము పత్నికుత్తరమున నాసీనుడై కర్త సమస్త కర్మలు చేయవలెను.

## ప్రధాన హోమము

సుఖోపవిష్టస్స్వవరేణ పావకస్య దక్షిణాసీనవధూముపస్పృశన్ వ
రోయతాసుస్స్వనయోనవోఢయోర్వధ్వానహోత్రైర్వివాహహోమకం
కరిష్యఆఘారశతోగ్నిమిద్ధ్వాత్యాదాజ్యభాగాంత ఇహోదిమర్గాఖ్యాం
నుసంస్పృశన్వై హృదయంచవధ్వా సోమస్యనస్తామభిమంత్రయేత ॥౯౮॥

వరుడు అగ్నికి పశ్చిమ భాగంబున సుఖాసీనుడై తనకు దక్షిణ భాగంబున నాసీనయగు వధువును స్పృశించుచు ప్రాణాయామము జేసి "అనయోర్వోఢయోర్వధ్వానవివాహ ప్రధాన హోమం కరిష్యే" యని సంకల్పము జేసి అగ్నింధనాద్యాజ్యభాగాంతమునందు చేసి "సోమః ప్రథమో వివిదే, సోమోదదద్గంధర్వాయ" యను ఋగ్ద్వయముచే నాసీనురాలగు వధువు హృదయమును స్పృశించుచూ వధువునభిమంత్రింపవలెను.

## పాణిగ్రహణము

మంత్రైశ్చతుర్భిఃకన్యాదక్షిణోత్తానపాణింసాంగుష్ఠంస్వకపాణినాదక్షిణేన
గృహ్ణీయాత్త్రీన్వృషంస్పృహఃపుత్రకామోహ్యంగుష్ఠమేవైకంచాంగుళీః స్త్రీప్ర
ప్రజార్థీ ॥౯౯॥

స్త్రీ పురుష సంతానకాముడగు వరుడు సర్వ న్యగ్భూత (బోర్లించబడిన) దక్షిణ హస్తముచే "గృహ్ణామితేసుప్రజాస్త్వాయ" ఇత్యాదినాలుగు మంత్రములచే నుచ్చరించి మంత్రాంతమునందు, సాంగుష్ఠము, బోర్లించబడినదియు, అగు వధూదక్షిణహస్తము గ్రహింపవలెను. కేవల పుత్రకాముడగు వరుడు బొటనవ్రేలిని మాత్రమే గ్రహింపవలెను. కేవల స్త్రీ సంతానము కోరునతడు అంగుష్ఠముగాక మిగిలిన వ్రేళ్లను పట్టుకొనవలెను.

## సప్తపది

అథోత్తరేణాగ్నిమిమాంవధూంతు ప్రాచీందిశంవావ్య థవాప్యుదీచీం

ప్రక్రామయిత్వాప్రాహాగ్నిం దక్షిణేనపదా వధూమేకమిషే ఇతి మంత్రతః ।
మంత్రక్రమేణైవహాసప్తమేపదేజపేన్సఖేత్యస్యసూక్తంతతః
కేచిద్వధూసప్తపదక్రమార్థంకుర్వంతి రాశీనిహ తండులాద్యైః ॥
సువర్ణపూగీఫలపుష్పవస్త్రైరలంకృతానాత్ర మనోజ్ఞరోప్యా

అనంతరము అగ్నికి ఉత్తరభాగమున ప్రాక్సంస్థిగాగాని ఉత్తరసంస్థిగాగాని వధూదక్షిణపాదముచే "ఏకమిషే" ఇత్యాదిమంత్రప్రశ్నోక్తక్రమముగా ఏడడుగులను త్రొక్కించి సప్తమపదమునందు "సఖే" ఇత్యాదిమంత్రమును జపింపవలెను. సప్తపదక్రమార్థమై తండులాదులతో రాసులను కొందఱు చేయుచున్నారు. అవి కూడ మనందు సువర్ణపూగీఫల, పుష్ప, వస్త్రాదులచే నలంకరింపబడిన తండులాది రాసులయందు పూర్వోక్తక్రమముగా మంత్రము జపించుచూ సప్తపదములను త్రొక్కించవలెను.

ప్రదక్షిణంకేవలమగ్నిమాచరేద్వధూవరౌ తావుపవిశ్యపూర్వవత్
హుత్వాప్రధానాహుతిషోడశంతతోఽశ్మస్థాపనం స్తేహ్యుపవిశ్య పూ-
ర్వవత్

అనంతరము వధూవరులు కేవలము అగ్నికి మాత్రమే ప్రదక్షిణము జేసి, పూర్వమందు వలెనే దక్షిణపనువుగా కూర్చుండి "సోమాయజనివిదేస్వాహా" ఇత్యాది పదునారు మంత్రములచే హోమము జేసినపిమ్మట అశ్మస్థాపనము జేసి దక్షిణపనువుగా కూర్చుండవలెను.

## లాజహోమము

వరోహ్యుపస్తీర్యహికన్యకాంజలౌలాజాన్ద్విరోప్యావదతోఽభిఘారణం
కృత్వావకృచ్ఛాంజలినామపార్శ్వతో జుహోత్యృచాఓం జమదగ్ని
జోవరః లాజాంస్త్రిరేవావపత్యధాపరేజుహోతిలాజానిహదేవతీర్థతః

దక్షిణపనువుగా గూర్చుండి వరుడు కన్యకాంజలియందు ఉపస్తరణజేసి, లాజలను రెండుసార్లుంచి, అభిఘారింపగా కన్యక అంజలివామపార్శ్వముచే నొక్కొక పర్యాయము హోమము జేయవలెను. పంచార్షేయప్రవరగల జమదగ్ని శ్రీవత్స గోత్రజులు లాజలను మూడు పర్యాయములుంచవలెను. లాజహోమము, దేవతీర్థముతో (అనగా అంగుళ్యగ్రములనుండి జేయవలెనని కొందఱు చెప్పుచున్నారు.

ఇత్యుక్తంతంత్రోపదేశాతిదేశాభావాదేవకార్యాపిహోమానలిష్టన్

రక్షింపవలెను. భ్రమవలనగాని ప్రమాదము వలనగాని సాయంప్రాతః కాలౌపాసనములందు విచ్ఛిన్నమైనయెడల విచ్ఛిన్నౌపాసనాగ్ని పునస్సంధానముచేసి హోమకాలము పర్యంతము దంపతులలో శక్తుడుపవసించి యుండవలెను.

యజమానే ప్రవసతి సత్యగ్నిస్థాపనాదికం
కారయిత్వా తదారభ్య పత్నీ తూపవసేదితి॥౨౦౭

అది మొదలుకొని భర్త ప్రవాసము వెళ్లినప్పుడు అగ్ని విచ్ఛిన్నమైనచో విచ్ఛిన్నాగ్నిపునస్సంధానము చేయించి తదారభ్య భర్త వచ్చువరకు పత్ని ఉపవసించియుండవలెను.

రోగోపవాసాతురసంకటాదిష్వయాశ్చేతు వ్యాహృతిభిస్స్రువాహుతిః
హుత్వాన్నమద్యాద్యదిసాయమహ్నా వాథో విస్మృత్య మానాగ్నిరపి ప్రమాదతః॥౨౦౮॥ భ్రమాచ్చతూరాత్రమహూయమానోఽగ్నిర్లౌకిక
స్స్యాత్ప్రతిపద్యతే స ఆ సప్తరాత్రాజ్జుహుయాదిహైతే వనస్పతించ ప్రతి
హోమమేకే॥౨౦౯॥ ఆద్వాదశాహాదిత్రికే చిదాహుః పునశ్చ సంధిస్త
దతిక్రమే తు అత్రైకమే ద్వాదశవాసరేభ్యస్సంధానముక్తం స్మృతికృ
ద్భిరుక్తమ్॥౨౧౦॥

సాయంప్రాతః కాలముల యందు రోగము, ఉపవాసము, ఆపద మొదలగునవి తటస్థించినయెడల ఔపాసనము చేయలేకపోయినచో "అయాశ్చ" యను మంత్రముచేతను వ్యాహృతులచేతను స్రువాహుతిని చేసి భుజించవలెను. మరియు ప్రమాదమువలనగాని భ్రమవలనగాని అగ్ని విచ్ఛిన్నము గాకపోయినను నాలుగురాత్రములు ఔపాసనము చేయనిచో ఆ అగ్ని లౌకికమగును. సప్తరాత్రముల వఱకు ఔపాసనము చేయనిచో లౌకికమగుననియు, తద్దోషపరిహారార్థమై వనస్పతి హోమము చేయవలయుననియు కొందఱు చెప్పుచున్నారు. ద్వాదశ రాత్రములు ఔపాసనము చేయనిచో లౌకికమగునని కొందఱు చెప్పుచున్నారు. ద్వాదశ రాత్రాతిక్రమమైన యెడల పునస్సంధానము చేయవలయునని స్మృతికర్తలు చెప్పుచున్నారు.

అథోత్తరం సూత్రముహోత్తరార్థస్యోక్తం భనిత్యావదనప్రవేశాత్
ప్రయాణకార్యం యదృదావిహోమకం ధర్మం విహాయైవ మనీషిణోఽఖిలాః
ప్రధానహోమేసతి తత్సమాప్తౌ గృహప్రవేశార్థ మిహ ప్రయాణం
ఉక్తం విసృజ్యాథ నికాశ్చ సత్రం కుర్వంతి తత్కర్తురనుజ్ఞయైవ॥౨౧౧

స్మృత్యుక్తమృద్ఘ్నంత్రితభస్మధారణంకర్తవ్యమిత్యుక్తమిదంమనీషిభిః।
ప్రాతస్తు సర్వంహి సమానముచ్యతే సేష్టాత్ర సౌర్యప్రథమాహుతిః క్వచిత్

స్థాలీపాకానంతరము రాత్రి ప్రథమ యామమునందు ఔపాసనము ప్రారంభించవలెను. సాయంప్రాతరౌపాసనముల యందు అగ్నియు, అగ్నిస్స్విష్టకృత్తును దేవతలు "స్థాలీపాకవద్దైవతం" ఆప-గృ ౭-౨౦। అనుటవలన స్థాలీపాక దేవతలు ఉద్దేశ్యలు. "సౌర్యపూర్వాహుతిః ప్రాతరిత్యేక" ఆప-గృ-౭-౨౧। అను సూత్రానుసారము ప్రాతరౌపాసనమందు "సూర్యాయస్వాహా" యనికొందరు చెప్పుచున్నారు. అదిఆపస్తంబసమ్మతముకాదు ఔపాసనాదిసమస్తహోమములయందు ఆద్యంతములయందు పరిషేచనము చేయవలెను. అగ్నిమధ్యమందు "అగ్నయేస్వాహా" యనియు, ఈశాన్యదిక్కునందు "అగ్నయేస్విష్టకృతేస్వాహా" అనియు, సాయంప్రాతః కాలములయందు తండులములతోగాని, యవలతోగాని, బుషీక్షీరముతో ఆహుతిద్వయము చేయవలెను. అనంతరము "అగ్నేత్వంనో అంతమః" యనుమంత్రములతో అగ్న్యుపస్థానము చేసి, అనాజ్ఞాతత్రయమంత్ర జపమును చేయవలెను. అంతోము స్మృతులయందు చెప్పబడినదియు బుషులచే మంత్రితమైనదియు, అగుభస్మధారణమువలయునని విద్వాంసులు చెప్పుచున్నారు. సాయంప్రాతరౌపాసనములకు భేదములేదు. ప్రాతః కాలంబున సౌర్యాహుతి ఆపస్తంబ సమ్మతముగాదు.

ఔపాసనకాలము

ప్రాతః ప్రాతర్హోమకాలస్తుముఖ్యః కాలోగౌణస్సంగవాంతోథసాయం॥
ముఖ్యః కాలోద్వౌముహూర్తౌ తతదూర్ధ్వంగౌణః కాలః ప్రాహురేవంమునీంద్రాః। ౨౩౨ ప్రదోషాంతో హోమకాలస్సంగవాంతః
ప్రాతరిత్యాశ్వలాయనఆచార్యోభగవానుక్తవాన్కిల॥౨౩౩।

ప్రాతరౌపాసనమునకు ప్రాతఃకాలము(పంచధా భాగించబడిన దివసముయొక్క ప్రథమభాగము) ముఖ్యకాలము సంగవకాలము గౌణ పక్షము. సాయమౌపాసనమునకు సూర్యాస్తమయానంతరము రెండు ముహూర్తములు ముఖ్యములు అటు తర్వాత గౌణము అని మునీంద్రులు చెప్పుచున్నారు. సాయమౌపాసనమునకు ప్రదోషాంతము వరకు సమయమనియు, ప్రాతరౌపాసనమునకు సంగవాంతము వరకు కాలమనియు, ఆశ్వలాయనాచార్యుడు చెప్పియున్నాడు.

హోమావశిష్టంచరుమాజ్యసంప్లుతంతం బ్రాహ్మణం దక్షిణదిశ్యవ
స్థితం।సంభోజయిత్వావృషభంవధూరుపాధ్యాయమాయతస్యాపచితా

యాధీమతే॥౨౩౪॥

పితుః కులాదాహృతమత్ర దద్యాత్తద్దక్షిణార్థం భవతి క్రియాంగం।స్యా
ద్యత్రయత్రాపచితాఖ్యశబ్దస్తత్రాప్యుపాధ్యాయ ఇతీరితోఽర్థాత్॥౨౩౫॥

హోమావశిష్టచరువును ఘృతప్లుతముజేసి దక్షిణదిక్కునందున్న బ్రాహ్మణుని భుజింపజేయవలెను. పితృగృహమునుండి తీసుకొనిరాబడిన వృషభమును క్రియాంగమగు దక్షిణగా వరాపచితుడగు ఉపాధ్యాయునికివ్వవలెను. ఎచ్చట వరాపచిత శబ్దము చెప్పబడినను ఆశబ్దమునకు ఉపాధ్యాయుడని అర్థము.

స్థాలీపాకప్రకరణమిహోక్తం డికాంతావదథైనా మాగ్నేయేన ప్రభృతి
కథితంకార్యమాగ్నేయసంజ్ఞం। స్థాలీపాకాభిధమృషభదానాంతిమ
త్త్రైవసాయం ప్రాతశ్చోపాసనవిధిమపిప్రోక్తవానాశ్మరథ్యః॥౨౩౬॥

"అగ్నయే నామాగ్నేయేన స్థాలీపాకేనయాజయతి,, ఆప-గృ-౭-౧॥ అనునది మొదలు ఖండసమాప్తివరకు స్థాలీపాకప్రకరణమును వ్యాఖ్యానించవలసియున్నది. వృషభ దక్షిణంబగు ఆగ్నేయ స్థాలీపాకమును, సాయం ప్రాతఃకాలముల యందౌపాసనమును, ఆశ్మరథ్యుడు చేయవలయునని ఈప్రకరణమునందే ఆపస్తంబ మహర్షి చెప్పియున్నాడు.

తత్రైవంహ్యత ఊర్ధ్వమాదిమనుసృత్యాదక్షిణేత్యేక ఇ
త్యంతంపార్వణపూర్వకాలవిహితాన్వారంభణీయేన హి।
* సాకంసాంగతయోపపాదితమిమంతద్దర్శపూర్ణాఖ్యమా
స్థాలీపాకవిధింప్రతిప్రతిపదంకర్తవ్యమాజీవితం॥౨౩౭॥

ఆ స్థాలీపాకప్రకరణమునందే "ఏవమత ఊర్ధ్వగ్ం దక్షిణావర్జము పోషితాభ్యాంపర్వసు కార్యః,, ఆప-గృ-౭-౧౭॥ ఇత్యాది "పూర్ణపాత్రస్తు దక్షిణేత్యేకే,, ఆప-గృ-౭-౧౮, ఇత్యంత గ్రంథముచే ప్రతిపత్స్థాలీపాక పూర్వకాల కర్తవ్యాన్వారంభణీయ స్థాలీపాక సహితముగాను సాంగముగాను ప్రతిపాదించబడినదియు, దర్శపూర్ణమాసనామముగలదియు, అగు ప్రతిపత్స్థాలీపాకమును ప్రతి ప్రతిపత్తు(పాడ్యమి)నందును యావజ్జీవము జేయవలెను.

## ప్రతిపత్స్థాలీపాకారంభకాలము

అతఊర్ధ్వమిహాగ్నేయస్థాలీపాకాత్పరంహ్యాతః।
ఊర్ధ్వమన్వారంభణీయచరోరూర్ధ్వమితీరితం॥౨౩౮॥

* సార్థమితి పాఠాంతరం.

ప్రస్తావేస్మిన్నేతదుక్తం భవత్యాచారాపేతో యస్యాత్ స్యాధికారః॥

ఎవ్వానికి ప్రత్యాబ్దిక దర్శశ్రాద్ధములను జేయవలసిన యావశ్యకత లేదో అతఃప్రవశే "ఉపోషితాభ్యాం" ఆప. గృ-౭-౧౭॥ అను సూత్రార్థము నిశ్చయముగ నుదాహరింపబడినది. పూర్వోక్త ప్రస్తావనయందు ఎవనికి ఆచారాపేతుగలదో వానికే అధికారమని చెప్పబడవలయుచున్నది.

## అన్వారంభణీయస్థాలీపాక కాలము

స్థాలీపాకానంతరం చేద్వివాహేసంపూర్ణే యాయాతిచేత్పౌర్ణమాసీ
తస్యామన్వారంభణీయాఖ్యహోమం కుర్యాత్ప్రాతః పౌర్ణమా
స్యాం యథోక్తం॥ ౨౫.౦

వివాహసమాప్తిగానైన వెంటనే పూర్ణిమ వచ్చినచో ఆపూర్ణిమా ప్రాతఃకాలంబున అన్వారంభణీయస్థాలీపాకము జేయవలెను.

## అన్వారంభణీయస్థాలీపాక దేవతానిర్ణయము

శ్రౌతేన్వారంభణీయాయామగ్నావిష్ణూ సరస్వతీ।
సరస్వాంశ్చాగ్నిభగినౌ స్మార్తే హ్యేతాశ్చ దేవతాః॥ ౨౫.౧।
అగ్నిస్విష్టకృతంచాంతరేణేత్యస్మాచ్చ సూత్రతః।
ఆద్యోగ్నిస్స్విష్టకృచ్చాంతేసర్వేషు చరుకర్మసు॥ ౨౫.౨।
తస్మాదన్వారంభణీయచరావషడ్దేవతా ఇతి।
కారికాకృద్భిరప్యుక్తం గృహ్యవిద్భిః పురాతనైః ॥ ౨౫.౩॥

శ్రౌతాన్వారంభణీయసాలీపాకమునందు "అగ్నావిష్ణూ, సరస్వతీ, సరస్వాన్, అగ్నిభగినౌ" యని యే దేవతలుగలరో స్మార్తాన్వారంభణీయయందును ఆదేవతలే॥ "అగ్నిం స్విష్టకృతంచాంతరేణ" ఆప-గృ-౭-౨౫॥ అను సూత్రమువలన సమస్తమగు ప్రధానకర్మములయందు ముందుగా అగ్నియు నంతమునందు అగ్నిస్విష్టకృత్తును సిద్ధించుచున్నారు అందువలన అన్వారంభణీయస్థాలీపాకమునందు ఆఱుగురుదేవతలని ప్రాచీనులు గృహ్యవేత్తలు అగు కారికాముకులు చెప్పియున్నారు.

అనాహితాగ్నేః ప్రథమే చరౌ చ తస్యాపి కాలః కిల పౌర్ణమాస్యాం।

అనాహితాగ్నియగు వానికి నిపూర్ణిమయందే ప్రాతఃకాలమున అన్వారంభణీయ స్థాలీపాకము విధించబడినది అని కపర్దిశిష్యులు చెప్పుచున్నారు.

## అన్వారంభణీయ స్థాలీపాకము

ప్రాతర్వాదంత్యేవకపర్ద్విశిష్యాఽగ్నిస్తథాగ్నాపహితశ్చవిష్ణుః॥ ౨౫౪॥
సరస్వతీచైవతథాఽసరస్వాన్ఽగ్నిభగస్విష్టకృదగ్నిరేతాః।
క్రమేణహుత్వాఽథతతో జయాదీననంతరంబ్రహ్మవిసర్జనంచ॥ ౨౫౫

అగ్న్యాది స్విష్టకృదంతపదాహుతులను క్రమముగా హోమముజేసి అనంతరముజయాదిబ్రహ్మవిసర్జనము వఱకు చేయవలెను.

ఆద్యే చరౌ దక్షిణతో వరో త్రా వదానధర్మా జుహుయాత్తు ధీమాన్। క్రమేణ చాగ్న్యాది చతస్ర ఆహుతీ హుత్వా గ్నయే సై భగినే వదాయ॥ ౨౫౬॥ శిష్టం హవిః ప్రత్యభిఘార్య పశ్చాద్ధోమస్తత స్విష్టకృతే వదాయ। సంస్థాప్య దర్వీంచ జయాదికాంతే యదస్యతు స్విష్టకృతం చహుత్వా॥ ౨౫౭। సమంజనం బర్హిష ఏవ శమ్యాః పరేహ్ని తత్ప్రతిహోమఉక్తః।

అన్వారంభణీయస్థాలీపాకమునందు దక్షిణాదరుడుగా నుండవలెను. హవిస్సును అవదానధర్మముగా గ్రహించి అగ్న్యాదిచతుర్హోమములను జేసి ఐదవ ఆహుతియగు అగ్ని భగినికి అవదానముజేసి “అంతే ప్రత్యభిఘారణ” యనువచనమునలన చరుశేషమును ప్రత్యభిఘరించి తర్వాత హోమముజేయవలెను. అనంతరము స్విష్టకృత్తునకు అవదానముజేసిన దర్విని నేలనుంచి జయాదిహోమాంతమునందు “యదస్యకర్మణః” యనుమంత్రముచే స్విష్టకృద్ధోమము జేయవలెను. ప్రాయశ్చిత్తహోమాది బ్రహ్మవిసర్జనాంతమందు బర్హిస్సమంజనము జేయవలెను. అన్వారంభణీయయందు శమ్యలు వేయవలెను. పరదినము (పాడ్యమి) న ప్రతిపత్స్థాలీపాకము జేయవలెను.

సతీషు బహ్వీష్వశనాహుతీషు ప్రాప్తాస్వవత్తం త్వభిఘార్య చాంతం॥ ౨౫౮। శిష్టం హవి స్విష్టకృదర్థమేవాభిఘారయేత్పూర్వాసు చక్రియాసు।

అనేక చరుహోమములుగల కర్మలయందు ఆఖరు ఆహుతికిఅవదానము జేసి అభిఘరించి శిష్టహవిస్సును స్విష్టకృదర్థమై అభిఘరించవలెను.

ఉక్తస్థాలీపాకధర్మస్తుయావాం స్తావాం త్సర్వః పార్వణేతూపదిష్టః॥ ౨౫౯॥ భేదశ్చైతద్దక్షిణావర్జమత్ర కేచిత్ప్రాహుః పూర్ణపాత్రం త్విహిస్యాత్॥ ౨౬౦

ఆగ్నేయస్థాలీపాకధర్మము లన్నియు ప్రతిపత్స్థాలీపాకమునందు గ్రాహ్యములు. ఈ స్థాలీపాకములయందు దక్షిణ నిచ్చుట, దక్షిణ నివ్వకపోవుట, యను భేదము గాక మఱే భేదమును లేదు. ప్రతిపత్స్థాలీపాకమునందు పూర్ణపాత్రమును దక్షిణగా నియ్యవలయునని కొందఱు చెప్పియున్నారు.

హిరణ్యకేశిప్రముఖాః పూర్ణపాత్రం తు దక్షిణా।
ఇత్యాహుర్దర్శపూర్ణేతు స్థాలీపాకాఖ్యకర్మణి॥ ౨౬౧।

హిరణ్యకేశి మొదలగు వారు ప్రతిపత్స్థాలీపాకములయందు పూర్ణపాత్రమును దక్షిణగా నీయవలయునని చెప్పుచున్నారు.

తతాగ్నితఊర్ధ్వ మిత్యాద్యాపూర్ణపాత్రంతుదక్షిణా।
ఇత్యేకపక్ష ఇత్యేత త్సూత్రార్థ స్సముదాహృతః॥ ౨౬౨

"ఏవమత ఊర్ధ్వం" ఆప-గృ-౭-౧౮- ఇత్యాది పూర్ణపాత్రమ్దక్షిణేత్యేకే" ఆప-గృ-౭-౧౮- ఇత్యంతమగు సూత్రార్థమిట్లు స్పష్టముగా చెప్పబడినది.

నిత్యప్రాయశ్చిత్తనైమిత్తికాని కామ్యాన్యపేతాని నైపార్వ
ణేన। వ్యాఖ్యాతాన్యన్యాని కర్మాణి తాని సాధ్వాచారం ద్యా
నిగృహ్యాంతరుక్తం॥ ౨౬౩।

ఏ కర్మములు సదాచారము వలన గ్రహింపబడుచున్నవో అట్టినిత్యనైమిత్తిక కామ్య ప్రాయశ్చిత్తాది సమస్తకర్మలయందు ఆగ్నేయస్థాలీపాకధర్మములు అతిదేశము చేయబడినవి.

హృదయసంసర్గాదికర్మలయందు దేవతానిర్ణయము.

హృత్సంసర్గాగ్రయణేశాన సర్ప మాసిశ్రాద్ధాష్టకాద్యేషు
షట్సు। కర్మస్వాచార్యేణ చైతేషు తత్ర తత్రాభీష్టా దేవతా
శ్చోపదిష్టాః॥ ౨౬౪।

హృదయసంసర్గము, ఆగ్రయణము, ఈశానబలి, సర్పబలి, మాసిశ్రాద్ధము, అష్టకాశ్రాద్ధము అను ఆఱుకర్మలయందు ఆచార్యునిచేతనే దేవతలు చెప్పబడిరి.

స్థాలీపాకే దేవతా వైశ్వదేవే విశ్వేదేవా ఇత్యనేనోపదిష్టాః।
మంత్రామ్నాయానుక్రమేణైవ చాగ్న్యాద్యా రౌద్రాంతా దే
వతాస్త్రింశదుక్తాః॥ ౨౬౫।

వైశ్వదేవస్థాలీపాకమునందు "వైశ్వదేవే విశ్వేదేవాః" ఆప-గృ-౭-౨౭॥ అను

సూత్రముచే మంత్రప్రశ్నము నందలి ఆమ్నాయానుసారముగానే అగ్న్యాది రుద్రాంతంబులకు ముప్పదిముగ్గురు దేవతలు చెప్పబడిరి.

సర్పోత్సర్గే దేవతా పౌర్ణమాసీ కర్మణ్యుక్తా శ్రావణే మార్గశీర్షే। తత్రా ప్యన్వారంభణీయే చరౌ చ శ్రౌతోక్తా యా దేవతా స్తా ఇహ స్యుః॥ ౨౬౬।

శ్రావణ మార్గశిర మాసములయందు చేయబడు సర్పబల్యుత్సర్గములయందు తత్తన్మాసపూర్ణిమలే దేవతలు. స్మార్తాన్వారంభణీయస్థాలీపాకమునందు శ్రౌతాన్వారంభణీయ దేవతలనే గ్రహించవలెను.

ధర్మప్రశ్నోక్తే మహారాజసంజ్ఞే చరౌ చ స్థాలీపాకే దేవతా స్యాత్స ఏవ। ఉక్షోత్సర్గే కృత్తికాహోమే గణాఖ్యే ప్రోక్తా మంత్రా స్తత్ర బోధాయనేన। ౨౬౭।

ధర్మప్రశ్నమునందు చెప్పబడిన మహారాజచరువునందును, స్థాలీపాకమునందును, మహారాజే దేవత. వృషోత్సర్జనమునందు, గణహోమమునందు, బోధాయనునిచే మంత్రములు చెప్పబడినవి.

ప్రాయశ్చిత్తేషు వ్రతోద్యాపనేషు కామ్యేషూగ్రర్క్ష ప్రసూతౌ చ సత్యాం। శాంతిష్వాదిత్యాదియజ్ఞేషు మంత్రా స్తే నైవోక్తా దేవతా స్స్యు స్సమస్తౌ చ। ౨౬౮।

ప్రాయశ్చిత్తములయందు, కామ్యవ్రతోద్యాపనములయందు, ఉగ్రనక్షత్రజననాది శాంతులయందు, ఆదిత్యాది గ్రహయజ్ఞములయందు, మంత్రములు, దేవతలు, బోధాయనునిచే చెప్పబడిరి.

ముఖాహుతినిర్ణయము

స్థాలీపాకా స్సంతి యే తే చరవ్యే కార్యా ఏవం పార్వణే నోపదిష్టాః॥ యాయా స్థాలీపాకహోమేషు చోపదిష్టా స్తాసాం దేవతానాం పురస్తాత్। ౨౬౯। స్థాలీపాకా చ్చావదాయా వదానధర్మేణా దాయాగ్నయే గ్రేచ హుయాయాత్। అత్రోక్తాభ్యో దేవతాభ్యశ్చ హుత్వా తాసామంతే స్విష్టకృద్ధోమ ఏవ। ౨౭౦॥ అగ్నిస్స్విష్టకృతంచాంతరేణేతి సూత్రస్యాభిప్రాయమేవం వదంతి।

సమస్తస్థాలీపాకములు పూర్వోక్త ప్రకారముగా చేయవలయునని వివాహస్థాలీపాకముచే వ్యాఖ్యానము చేయబడినది. (అనగా ఆగ్నేయస్థాలీపాక ధర్మములు ప్రతిపత్స్థాలీపాకాదులయందు చెప్పబడినవి) స్థాలీపాకదేవతాహోమములకంటే ముందుగా నవదానధర్మముచే హవిస్సును గ్రహించి "అగ్నయేస్వాహా" యనిముఖాహుతి చేయవలెను. అనంతరము కర్మోక్త దేవతాహోమముల చేసి సర్వాహుత్యంతమందు స్విష్టకృద్ధోమముచేయవలెను. అనిఅగ్నిగ్స్విష్టకృతంచాంతరేణ''యనుసూత్రాభిప్రాయమువిద్వాంసులు చెప్పియున్నారు.

అగ్నిశ్చాగ్నిస్విష్టకృచ్చ ప్రధానౌ స్థాలీపాకే పార్వణేపి ప్రధానౌ.౨౭౧। ఏతావన్యోన్యాశ్రయౌ చానపాయ్యావన్యేషాం చాద్యన్తయో ర్హిప్రధానౌ, ఇత్థం సిద్ధ ప్రోక్త మగ్నిం వికల్ప్య ముక్త్వా స్వాభిః క్వాపి సంపాదితో గ్నిః।౨౭౨। ఇత్యేవాహు స్స్విష్టకృన్న ప్రధానంనాంగంకింతద్ధోమశిష్టోపపత్తిః। ఏవం బ్రూయు శ్శుష్కమీమాంసకా యేతేషాం ప్రత్యక్షోపలాపో హిపక్షః।౨౭౩।

పార్వణస్థాలీపాకమునందును, అగ్నియు, అగ్నిస్విష్టకృత్తును, ప్రధానములు. ఈ రెండును అన్యోన్యాశ్రయముగలవి, ఒకదానిని విడిచి మఱొకటి ఉండదు. ఇతరహోమముల యాద్యంతములయందు చేయబడుచున్నవి. ఇట్లు సిద్ధించిన అగ్నిని విడచి మనకు అగ్ని ఎట్లువచ్చినదనియు, స్విష్టకృద్ధోమము ప్రధానము అంగముగూడ కాదనియు, ఆయ్యాది హోమశేష ప్రయోజనమనియు, చెప్పుచున్న శుష్కమీమాంసక మతము ప్రత్యక్ష ప్రలాపము. (యథార్థము గాదిది)

శుష్కమీమాంసలక్షణము

శ్రౌత స్మార్త ప్రక్రియా నీక్షమాణా శ్శాస్త్రాధీతా శుష్కమీమాంసకాస్తే।

శ్రౌతస్మార్త ప్రయోగ జ్ఞానములేని కేవలశాస్త్రవేత్తలు శుష్కమీమాంసకులని చెప్పబడుదురు.

ఆచార్యైస్తై ర్వ్యాదితంసూత్ర మేతత్కర్మానుష్ఠానక్రమం తద్వికల్ప్య।౨౭౪। కుర్వంతి వ్యాఖ్యాన మత్రాన్యథాహి వ్యాఖ్యాతారః కేచి దుశ్శృంఖలేన।

కర్మానుష్ఠానక్రమ బోధకంబును, ఆచార్య ప్రోక్తంబును, అగు నీసూత్రమును వికల్పించి కొందరు వ్యాఖ్యాతలు స్వేచ్ఛగా అన్యథా వ్యాఖ్యానము జేయుచున్నారు

అపరైస్తదుక్తం భవతి క్రియా స్సదా ప్యనుష్ఠితా స్సంప్రతి ప్ర
వ్యాఖ్యావేదిభిః॥౨౭౬॥ ఏతావదా చార్యహృదాశయం మతం సూ
త్రార్థతాత్పర్యమితి స్ఫుటంత్విదమ్।

ఈవిషయమై ఇట్లు చెప్పబడుచున్నది ఇప్పుడు గృహ్యవేత్తలు సమస్తకర్మలు జేయుచున్నారు. ఆచార్యహృదయము ఇదియు. సూత్రార్థతాత్పర్యము ఇట్లు స్పష్టముగా చెప్పబడినది.

అగ్ని శ్చాగ్నిస్విష్టకృ ద్దేవతే చాగ్నేయస్థాలీపాకఏవాధతేద్వే॥
స్థాలీపాకే పార్వణే తు ప్రధానే సంగచ్ఛేతే దేవతే చాథతేద్వే।
ఉచ్యేతే చాద్యన్తయోస్తు ప్రధానే స్థాలీపాకే ష్వేవ సర్వేషు
తస్మాత్॥౨౭౭॥ ఆదా వగ్నిః పార్వణే నోపదిష్టస్థాలీపాకేషూ
దితా దేవతాయాః। తాసామంతే స్విష్టకృద్దేవతానాం స్థాలీపా
కేషూచ్యతే హి క్రమోఽయం॥౨౭౮॥ ఏవం సిద్ధే సత్యపి ప్రా
హురాజ్యేనా చారాచ్చాగ్రే ఽగ్నయే హోమ మేకే। త
త్కర్తవ్యోఽప్యుపదేశాతిదేశాభావాదాజ్యేనైవ హోమోనయు
క్తః ॥౨౭౯॥ తస్మాదేవాగ్నిప్రధానే ష్టకృద్భ్యస్థాలీపాకాన్నే
న హోతవ్యమేవ॥౨౮౦॥

ఆగ్నేయస్థాలీపాకమునందగ్నియు, అగ్నిస్విష్టకృత్తును ప్రధానదేవతలు. అయిద్దఱే ప్రతిపత్స్థాలీపాకమునందుకూడ ప్రధానులు. ఆకారణమువలన సమస్తస్థాలీపాకముల యందు ఆద్యన్తములయందు ప్రధానదేవతలుగా చెప్పబడుచున్నారు పార్వణస్థాలీపాకమునందు చెప్పబడిన దేవతాహోమాత్పూర్వము అగ్నియు, తర్వాత తత్తత్కర్మోక్త ప్రధాన దేవతా హోమములను, అంతమునందు స్విష్టకృద్ధోమమును చేయవలయు నని క్రమముండగా కొందఱు ముందుగా నాజ్యముచే “అగ్నయే స్వాహా” యని హోమము జేయవలయునని చెప్పుచున్నారు. అట్లుచేయవలయునని ఉపదేశాతిదేశములు లేకపోవుటవలన ఆజ్యహోమము జేయగూడదు. అందువలనఅగ్నికి, ప్రధానదేవతలకు, స్విష్టకృత్తునకు, స్థాలీపాకచరువుచేతనే హోమము జేయవలెను.

ఏకం హావి శ్చాగ్నిముఖాహుతి ప్రధానాహుతి స్విష్టకృదాహు

తీనాం। త్రేధా ప్రధానీకృత దేవతానాం సాధారణత్వాద్ధవిషో పృథక్త్వం॥౨౨॥

అగ్నిముఖాహుతి ప్రధానాహుతి స్విష్టకృదాహుతులకు హవిస్సు ఒక్కటే. అగ్ని, ప్రధాన దేవతలు, స్విష్టకృత్తు, సమానులగుటవలన హవిస్సు వేఱువేఱుగా చేయ నక్కఱలేదు.

కర్తవ్యా నుష్ఠాన యోగ్యాః పదార్థా గర్భభూతా స్సంతి యే యత్ర తత్ర। యత్రాస్మాకం జాయతే సంశయ స్తద్భూయో భూయః ప్రాయశ స్సంస్మరామః॥ ౨౨.౨।

కర్మలయందనుష్ఠానయోగ్యములగు పదార్థములు గూఢముగా నెచ్చటెచ్చట నుండునో ఎచ్చటెచ్చట మాకుసందేహములు కలుగుచుండునో అచ్చటచ్చట ఆయా యాపదార్థములను తరుచుగా మేము స్మరించుచుందుము.

ముఖాహుతి స్స్యాచ్చరుణా తదాదౌ కార్యా ప్రధానాహుత యోపి మధ్యే॥ తదంతి మే స్విష్టకృదేవహోమ త్రిపాహు స్సుధా గృహ్యావిదో విధిజ్ఞాః॥౨౨౩॥

ముందుగాముఖాహుతియు, మధ్యను ప్రధానాహుతులును అంతిమమందు స్విష్ట కృదాహుతిని, జేయవలెనని గృహ్యాదులగు పండితులు చెప్పుచున్నారు.

చరుప్రధానే ష్వఖిలేషు కర్మసు ప్రాధానకత్వా చ్చరుణాముఖాహుతిః॥ ఉత్సర్జనోపాకరణ వ్రతేషు ఘృతేన కార్యా గ్నిముఖాహుతి స్స్యాత్। ౨౨౪.

చరుప్రధానములగు సమస్తకర్మలయందు చరువుచేతను, ఉత్సర్జనములు, ఉపాకర్మ వేదవ్రతములు, మొదలగు ఆజ్యహవిష్కంబులగు కర్మలయందాజ్యము చేతనుముఖాహుతిని జేయవలెను.

అగ్నిప్రధానౌషధికర్మణికిన్వచిన్ముఖాహుతిర్నాస్త్యథచాస్తి కేషుచిత్।హవ్యేనచాగ్నివ్యతిరిక్తదేవతా ప్రధానకర్మణ్యుదితాముఖాహుతిః।

అగ్ని ప్రధానంబులగు ఓషధిహవిష్కకర్మలయందు ముఖాహుతి లేదు కొన్నికర్మలయందు ముఖాహుతిగలదు. అగ్నీతరదేవతాప్రధానంబులగు కర్మలయందు హవిస్సుచే ముఖాహుతిజేయవలెను.

అథా వికృత మాతిథ్యం మధుపర్కార్పణే విధా। లబ్ధ్వా పా

హోమమాత్రం స్యాత్తంత్రేపూర్వోత్తరే నచ॥ ౨౯౬॥

మధుపర్క పూజయందు యథాసూత్రముగా సవిధి పూజ చేయవలెను. వహోమమునందు అగ్నింధనాది పూర్వతంత్రము, జయాద్యుత్తరతంత్రములు లేవు.

మధుపర్కమున గోరాలంభనిషేధము

కలౌ యుగే నిషిద్ధత్వాద్గోరాలంభస్య కర్మణః॥
ఉత్సృష్టవ్యైవ గౌ స్తత్ర సర్వశాఖాసమంస్మృతం॥ ౨౯౭॥

కలియుగమునందు గోరాలంభము (మధుపర్కమునందు గోవునువధించుట) నిషేధింపబడుటవలన గోవును విడువవలయుననుట సమస్తశాఖలకు సమ్మతము॥

ఆగ్నేయచరు మారభ్య యావత్ఖండసమాప్తితః
స్థాలీపాక ప్రకరణ మితిగృహ్యవిదాం మతం॥ ౨౯౮॥

ఆగ్నేయస్థాలీపాక ప్రభృతి ఖండసమాప్తి పర్యంతముగల గ్రంథము స్థాలీపాక ప్రకరణము అని గృహ్యవిదులు సమ్మతము,

ఆరభ్య పార్వణేనా తోన్యాని కర్మాణి చేత్యతః।
ఖండాంత మేషాం సూత్రాణా మయ మర్థ ఉదాహృతః॥

"పార్వణేనా తోన్యాని" ఆప-గృ-౭-౨౩- ఇత్యాది ఖండసమాప్తి పర్యంతము గల సూత్రములకు అర్థము చెప్పబడినది.

ఉపాకర్మయందుదేవతానిర్ణయము

యః కోపి చోపాకరణే సమాపనే ప్రజ్ఞాయతే త్వృషి రిహాప్ర
ధానం। జాత్యేకవాక్యాదృషిరేవచర్షయోహ్యంగం త్విత్యయం
సదసస్పతి స్స్యాత్॥ ౨౯౦

"ఉపాకరణే సమాపనే చ ఋషిర్యః ప్రజ్ఞాయతే" ఆప-గృ-౮-౧- ప్రజాపత్యాది కాండర్షులు ఉపాకర్మయందు ప్రధానదేవతలు అని తెలియవలెను. జాత్యేకవచనమగుటవలన ఋషియన ఋషులుఅని అర్థము. సదసస్పతి అంగదేవత.

సర్వేషు హోమేష్వపిచ ప్రధానం స్యాత్స్విష్టకృచ్చేత్యపి హోమసంజ్ఞే। ఇత్యుక్త మేవాగ్నిముఖే ప్రసంగా త్తాభ్యాంవినాక్వా
పి నహోమ కర్మ॥ ౨౯౧

సమస్త హోమములయందు ప్రధానాహుతులనియు స్విష్టకృదాహుతియనియు రెండుహోమములుగావు, అని అగ్నిముఖమునందు ప్రసంగమువలన చెప్పబడినది. ప్ర

ధాన స్విష్టకృదాహుతులు వినాగా హోమముండదు.

తస్మాత్ప్రధానం హి నపర్ణయో స్తాన్యస్విష్టకృత్సాన్య త్స
దసస్పతిర్హి। వ్రతేషు చోపాకరణే సమాపనే ష్వేవంహి కర్త
వ్య మనుక్రమేణ।౨౯౨।

ఆ కారణమువలన సదర్షులు ప్రధానదేవతలు అనియు, సదసస్పతి స్విష్టకృత్స్థానీయుడనియు, తెలియవలెను. వ్రతములయందు, ఉపాకర్మమునందు, ఉత్సర్జనములయందు, ఇట్లు క్రమముగా జేయవలెను.

కర్తవ్యేస్మి న్నేతదుక్తం భవత్యాచార్యాధీనో యో వటు
స్తం ప్రతీదం। గర్భాజ్జాతాద్వాష్టమాబ్దోపనీతం శ్రావణ్యాం
ప్రోష్ఠపద్యాం తు వాపి।౨౯౩। అధ్యాయోపాకర్మ కృత్వా త
ఊర్ధ్వమాగామిన్యాం ప్రావృషి ప్రారభేత॥ ప్రాజాపత్యా
ఖ్యవ్రతం హోమపూర్వం కార్యం వర్షం తద్వ్రతం చైక
మేవ।౨౯౪। పూర్ణేబ్దే స్యోత్సర్జనాఖ్యం చ హోమం కార్యం
వర్షం తద్వ్రతం వర్షపూర్ణే। ఏవం సౌమ్యాఖ్య వ్రతాగ్నే
యవైశ్వదేవాని స్యుస్తత్తదుత్సర్జనాని।౨౯౫।

ఏ బ్రహ్మచారి ఆచార్యాధీనుడై యుండునో గర్భాష్టమవత్సరంబునగాని జన్మాష్టమాబ్దంబునగాని ఉపనీతుడగు ఆ బ్రహ్మచారిని గురించి కర్తవ్యంబగు ఉపాకర్మ విషయమై ఇట్లు చెప్పబడుచున్నది. శ్రావణమాసమునగాని, భాద్రపదమాసమునగాని, ఉపాకర్మనుచేసి, తదవ్యవహితోత్తర శ్రావణమాసమున ప్రాజాపత్యవ్రతము హోమపూర్వకముగా ప్రారంభించి, ఒకసంవత్సరము వఱకు ఆవ్రతము నాచరించవలెను. వర్షపూర్తి కాగానే ప్రాజాపత్య వ్రతోత్సర్జన హోమముచేసి, సంవత్సరపర్యంతము ఆ ఉత్సర్జనము నాచరించవలెను. ఇట్లు సౌమ్యవ్రతాగ్నేయ వ్రతవైశ్వదేవవ్రతములు తత్తదుత్సర్జనములు జేయవలెను.

ఏవం కర్తవ్యే సతి బ్రహ్మచర్యమష్టాబ్దం స్యాత్షోడశే జన్మ
నోథి। గోదానాఖ్యం కర్మ కార్యం హి సాంగే వేదే ధీతే స్యా
త్సమావర్తనాఖ్యం॥౨౯౬।

ఇట్లు నాలుగు వ్రతములు నాలుగు త్సర్జనములు చేసినట్లైతే ఎనిమిదివత్సర

ర్మయని పేరు.

యస్య వ్రతస్య వ్రతదేవతాయా
నామ్నా తత శ్చోపనిషత్ప్రభృత్యః।
బ్రహ్మ స్వయంభూ స్సదసస్పతిశ్చ
పూజ్యా వ్రతోత్సర్జనయో శ్చహోమే॥ ౩౨౦।
పంచైతా వ్రతనామ్న్యాదిదేవతా స్సదసస్పతిం,
సూక్తం జయాద్యాః ప్రాధాన్యం యస్యవై స్విష్టకృచ్చవేత్॥

వ్రతదేవత, ఉపనిషత్తోయము, (యాజ్ఞికీరిత్యాది) స్వయంభువు, సదసస్పతి, అనుదేవతలు వ్రతోత్సర్జనములయందు, హోమమునందు, బూజ్యాలు పూర్వోక్తదేవతా పంచకము ప్రధానము సదసస్పతిని స్విష్టకృత్థానమునందు జేయవలెను. దీనికి వ్రతోపాకర్మయని పేరు.

ఉత్సర్జనోపాకరణేషు కుర్యు రేవం మనీషిణః,
యజుర్వేదేతుచత్వారః కాండాః కాండవతీనృషీన్। ౩౨౧।
తర్పయంత్య ర్చయంత్యే తానుపచారైస్తు సూరయః,
వ్రతేషూత్సర్జనేష్వేవంహోమంకుర్వంతిసంప్రతి॥ ౩౨౩॥

గృహ్యావిదులు ఉపాకర్మోత్సర్జనములయందు పూర్వోక్తప్రకారముగా జేయుచున్నారు. యజుర్వేదమునందు నాలుగు కాండములుగలవు. కాండపతులగు ఋషులను షోడశోపచారములచే బూజించి తర్పణము జేయవలెను. వేదవ్రతములయందు, ఉత్సర్జనములయందు, ఇప్పటివారు హోమమును చేయుచున్నారు.

వేదవ్రతములు

ప్రజాపతేః కాండఋషేః పురస్తా
త్ప్రజాపతేనత్వాదితీహ సూక్తం
ఆగ్నేయకే గ్నేనయసూక్త మానో
విశ్వేతి సూక్తం త్విహ వైశ్వదేవే ॥ ౩౨౪॥
సాంహితీభ్యో దేవతాభ్య ఉపనిషద్భ్యఏవచ।
యాజ్ఞికీభ్యో వారుణీభ్యో బ్రహ్మణే చస్వయంభువే ॥ ౩౨౫॥
సదసస్పతిమంత్రోక్త దేవతాయై తతః పరం।

జయాదయో ధస్విష్టకృత్తత్రోపస్థాన ముచ్యతే ॥౩౨౬॥
ఆగ్నేవ్రతపతే త్యాదిచతస్రో దేవతాః ప్రతి
తత్ర కాండఋషిభ్యః ప్రాజాపత్యవ్రత మాచరేత్ ॥౩౨౭॥
ఏవం సౌమ్యాగ్నేయవైశ్వదేవేష్వ నుష జేదిహ।
ఏతచ్ఛాఖాంతరాయాతం మాభూ దాచార్యసంమతం ॥౩౨౮॥

ప్రాజాపత్యవ్రతమునందు పూర్వోక్తప్రకారముగా స్నానముజేసి, ఋషులకు పూజాతర్పణములజేసి, అగ్నింధనాద్యగ్ని ముఖాహుత్యంతమందు, "ప్రజాపతయే కాండ ఋషయేస్వాహా" యని ముందుగా హోమముజేసి, "ప్రజాపతేనత్వదేతాన్" యను సూక్తముచే నాలు ప్రధానాహుతులజేసి, "సాంహితీభ్యోదేవతాభ్య ఉపనిషద్భ్య స్స్వాహా, యాజ్ఞికీభ్యోదేవతాభ్య ఉపనిషద్భ్యస్స్వాహా, వారుణీభ్యోదేవతాభ్య ఉపనిషద్భ్యస్స్వాహా, బ్రహ్మణేస్వయంభువేస్వాహా" అని ఉపహోమములను సదసస్పతి మంత్రముచే "సదసస్పతిహోమము"ను జేయవలెను. ఆగ్నేయవ్రతమునందు అగ్నిముఖాహుత్యంతమందు "అగ్నయే కాండఋషయేస్వాహా" యని ముందుగా హోమముజేసి జయాద్యనంతరము స్విష్టకృద్ధోమమైన పిమ్మట "అగ్నే వ్రతపతే కాండఋషిభ్యః ప్రాజాపత్యవ్రతంచరిష్యామి తచ్ఛకేయంతన్మేరాధ్యతాం। వాయోవ్రతపతే, ఆదిత్యవ్రతపతే వ్రతానాంవ్రతపతే, అను మంత్రములచే అగ్న్యాదిదేవతాచతుష్టయోపస్థానము జేయవలెను. ఆగ్నేయవ్రతమునందు, అగ్నిముఖాహుత్యంతమందు "అగ్నయేకాండఋషయే స్వాహా" యనిహోమముజేసి "అగ్నేనయ" యను సూక్తముచే నాలు ప్రధాన హోమముల జేయవలెను. వైశ్వదేవవ్రతమునందు "ఆనోభద్రాః క్రతవో యంతు" అను సూక్తముచే ప్రధానాహుతుల జేయవలెను. తక్కినదంతయు ప్రాజాపత్య వ్రతమునందు వలెనే చేయవలెను. ఉపస్థానమునందు "అగ్నేవ్రతపతే—ఆగ్నేయవ్రతంచరిష్యామి" యని ఆగ్నేయవ్రతము నందును, "అగ్నేవ్రతపతే—వైశ్వదేవవ్రతం చరిష్యామి." యని వైశ్వదేవవ్రతమునందును, చెప్పవలెను. ఉపహోమములు, దేవతోపస్థానము, సూక్తము, జయాదులు, ఆపస్తంబ సమ్మతములుగావు. శాఖాంతరమునుండి వచ్చినవి. గావున శాఖాంతరులు జేయవలెను.

సౌమ్యవ్రతేతు సోమాయ కాండఋషయ ఇతీరితం।
సోమేధేనుమిదంసూక్తం సాంహితీభ్యః ప్రభృతయః ॥౩౨౯॥
ఉదంతిస్థా అపస్పృశ్య నమోనాచేతి శాంతికం।
జప్త్వా చతస్ర స్సమిధ స్స్వాజ్యా ద్రౌదుంబరీ ర్వటుః ॥౩౩౦॥

పృథివీసమిదితి త్యేతై రుత్తిష్ఠన్నాదధాతిహి।
యుంజతే కృష్ణఇత్యాద్యా దశద్వాదశ చోత్తరే ॥౩౩౧॥
వా బ్రాహ్మణపాఠానుపాకాదిపద వాచనం।
యుంజతేసవితేత్యేతా ద్వావా వాచయతి స్ఫుటం ॥౩౩౨॥
అగ్నేవ్రతపతేకాండేత్యాద్యుపస్థాన మాచరేత్।
శంనోవాతఇత్యాంశోజపన్నాహితాగ్న్యా హితవాససా ॥౩౩౩॥
శిర స్సంవేష్ట్య స్వకుటీం గృహాగారంహిప్రవేశయేత్,
పరేద్యు ర్బ్రాహ్మణానాం చభోజనం కారయేదితి ॥౩౩౪॥

స్నానము జేసి, నవర్షిపూజా తర్పణాదులజేసి, అగ్నింధనాద్యగ్నిముఖాహుత్యంతమందు "సోమాయకాండర్షయే స్వాహా" యని మంత్రముగా హోమముజేసి "సోమాద్ధేనుం" అను అనువాకముచే ఆజ్యాహుతులజేసి, సాంహితీత్యాద్యుపహోమములను సదసస్పతి హోమమును జేసి, పాదంతి (నీళ్లకాగు) యందున్న ఉదకమును ఉపస్పర్శనము జేసి, "నమోవాచా" అను శాంతిని జపించి, ఆజ్యాక్తంబులగు నాలుగు ఔదుంబరీ (మేడి) సమిధలను "పృథివీసమిత్, అంతరిక్షస్సమిత్, ద్యౌస్సమిత్, ప్రాజాపత్యామేసమిదసి" అను నాలుగు మంత్రములచే వటుడు నిలిచి అగ్నియందు వ్రేల్చవలెను. తర్వాత "యుంజతే కృష్ణః" ఇత్యాది పది మంత్రములను గాని పన్నెండు మంత్రములను గాని చెప్పింపవలెను. అథవా "యుంజతేసవితా" ఇత్యాది మంత్రద్వయమును వటునిచే చెప్పించిన పిమ్మట "అగ్నేవ్రతపతే కాండర్షిభ్యః సౌమ్య వ్రతం చరిష్యామి" ఇత్యాది మంత్రములచే దేవతోపస్థానము జేసి, "శంనోవాతః" యనుశాంతిని పఠించవలెను. అనంతరము సంమీలనము జేసి నూతనవస్త్రమును శిరస్సునకు జుట్టి, సూర్యాస్తమయానంతరము గృహమునకు రావలెను. మరుదినంబున బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను.

## వేదవ్రతోత్సర్జనములు

* ఉత్సర్జనం కార్య మథద్యౌరాద్యైస్సమిధః క్షిపేత్।
వటోశ్చ కేశవపనం వ్రతేషూత్సర్జనేషు చ ॥ ౩౩౫॥
వదంతి కేచి త్సోమ్యాఖ్యవ్రతపవే తరేషున ॥౩౩౬।

ఇట్లు వేదవ్రతములను జేసి, తదుత్సర్జనములను చేయవలెను. "ద్యౌరాదివాక్యములచే సమిధలనగ్నియందు వ్రేల్చవలెను. వేదవ్రతములయందు, తదుత్సర్జనములయందు, వటునకు

---

* ఉత్సర్జనం త్వేవమేవేతి పాఠాంతరం

కేశవపనము చేయించవలెను. సౌమ్యవ్రతమునందు కేశవపనముచేయవలయుననియు, ప్రాజాపత్యాది వ్రతములయందు కేశవపనముచేయనక్కరలేదనియు, గొందఱు చెప్పుచున్నారు.

అధ్యాయోపాకర్మ చారభ్య తూష్ణీం
కర్మాణ్యుత్సర్గాంతి చత్వారి తాని,
ప్రాజాపత్యాదీని కాండవ్రతాని
సంక్షేపేణైతాని చోదాహృతాని॥ ౩౩౨॥

అధ్యాయోపాకర్మాద్యుపాకర్మ చతుష్టయము, తదుత్సర్జనములు, ప్రాజాపత్యాది వేదవ్రతములు, తదుత్సర్జనములు. ఇట్లు సంగ్రహముగా చెప్పబడినవి.

అనుపనీతుడు స్త్రీయు హోమము జేయగూడదు

స్త్రీయానుపేతేనచ సూత్రవాక్యా
ద్భ్రమప్రమాదాతురసంకటేషు
స్మార్తేష్వపి కర్మసు
హోమో నకర్తవ్య ఇహైవ తాభ్యాం। ౩౩౩॥

భ్రమ ప్రమాద రోగాద్యాపదలయందు స్త్రీయును, అనుపేతుడును, "స్త్రీయానుపేతేన" ఆప-గృ-ర-౩॥ అను సూత్రవాక్యమువలన స్మార్తకర్మలయందు, లౌకికకర్మలయందుహోమము జేయగూడదు.

అనుపనీతునకు శ్రాద్ధాధికారము

ప్రాప్తాబ్దపంచమ ఉపేతసమోనుపేతః
స్యాత్స్వౌర్ధ్వదైహికవిధిం తుసపిండనాంతం।
కుర్వీత కర్మ సకలం హీనమంత్రమేవ।
పిత్రోర్గృహే గ్రజమృతే పితృమాతృపిత్రోః। ౩౩౪॥

ఐదుసంవత్సరములు ఈడువచ్చినవాడు అనుపనీతుడైనను ఉపనీతునితో సమానుడు అట్టి అనుపనీతుడు తల్లిదండ్రులు, అన్న, పితామహపితామహులు, మాతామహమాతామహులు, మరణించినయెడల వారికి సపిండీకరణాంతము అను ఔర్ధ్వదైహికము సమంత్రకముగా జేయవచ్చును.

ఏషాం సాంపిండ్యక్రియాస్వత్ర హోమం।
కుర్వీతాగ్నౌ లౌకికే సోనుపేతః।

నాలుగవరోజు రాత్రి ప్రథమయామము గతించగా గంధర్వోద్వాసనము చేసి, దండమునకు చుట్టిన వస్త్రమును బ్రాహ్మణునకు ఇచ్చి, వధూసహితుడై అగ్నిని ఉపాసించి, శేషహోమమును చేయవలెను.

హస్తేనాదాయాత్ర హవిర్హుతానాం వశిష్టం
స్థాలీస్థాజ్యం శీర్షి వధ్వా నయేయుః।
ఆసీనస్సన్ స్మంత్రతో థాహు కేకే
సంపాతాజ్యం తద్దశాహే న్యథా స। ౩౯౯॥

పరుడు ఆజ్యస్థాలియందు హోమముచేయగా మిగిలిన ఆజ్యమును హస్తముచే గ్రహించి, ఆసీనుడై వధువుశిరస్సునందు సమంత్రకముగా ఉంచవలెను. సంపాతాజ్యమును దశాహమునందు ఉంచవలెనుగాని, మఱొకప్పుడు ఉంచకూడదని కొందఱాచార్యులు చెప్పుచున్నారు.

ఆజ్యశేషేణ హృదయదేశౌ యుగప దున్మృజేత్।
ఋచాం గుష్ఠానామికాభ్యాం తత స్త్రిసఋచో జపేత్॥ ౩౫౦॥

వరుడు హుతావశిష్టఘృతమును అంగుష్ఠానామికలతో గ్రహించి, "సమంజంతు విశ్వేదేవాః" అను ఋక్కుచే తనయొక్కయు, వధువుయొక్కయు, హృదయములను ఒక్కమాఱు స్పృజించి, "ప్రజాపతే" ఇత్యాది మూడుఋక్కులను జపించవలెను.

తత స్త్వలీకాగమనం సఖీనాం।
నిశ్శతనం స్యా ద్ధరిరాణికార్చనం।
స్రక్కంచుకాంతహేతశూర్పయుగ్మా।
న్దద్యా స్సజాతీయసువాసినీభ్యః। ౩౫౧॥

అనంతరము అళీకాగమనము, (దొంగవేలిమి) గోళ్లనుతీసుకొనుట, లక్ష్మీపూజను చేసి, పుష్పమాలికలు, కంచుకములు (రవికెలు) గలిగినశూర్ప (చేట) యుగ్మములను సజాతీయ సువాసినీస్త్రీలకు ఇయ్యవలెను.

## సమావేశము

తత్రో ద్వాహో క్తత్రిరాత్రాంతదీక్షా
సంపూర్తౌ వాంఛావతో దారవతోర్యః।
ప్రాదుర్భావే యావనే సత్య యం స్యా

# నరసింహ కారికా వృత్తి

తత్కాల స్త్రియా మైథునస్యోక్త ఏవ। ౩౫.౨॥

వివాహాత్త్రిరాత్రిదీక్ష సమాప్తి అయినపిమ్మట మైథునేచ్ఛ గలిగినట్టి వధూవరులకు యౌవనము అంకురించినయెడల ఈసమయము మైథునమునకు యోగ్యము అని చెప్పబడినది.

ఆరోహణోరుం చానువాకం జపిత్వా।
కుర్యాత్పత్నీసంగమం శుద్ధరాత్రౌ।

పంచాంగశుద్ధికలిగిన రాత్రియందు "ఆరోహణోరుం" అను అనువాకమును జపించి పత్నితో సంభోగించవలెను.

## రజస్వలాశాంతి

శస్తే నక్షత్రే రజో భూత్తదూర్ధ్వం।
దుష్టర్క్షే చేచ్ఛాంతికర్మోత్తరత్ర। ౩౫.౩॥

మంచి నక్షత్రములందు రజస్వల అయినయెడల స్నానానంతరమందును, దుష్ట నక్షత్రములయందు రజస్వల అయినయెడల శాంతిజేసిన తర్వాతను గర్భాధానము చేయవలెను.

దృష్టే రజసి దుష్టర్క్షే సతి శాంతిక్రియావిధిః।
జ్యోతిర్వసిష్ఠ జ్యోతిష్మత్ప్రోక్త్యసాభ్యాం విధీయతే।

దుష్టనక్షత్రములయందు రజస్వల ఐనయెడల శాంతివిధి జ్యోతిర్వసిష్ఠ, జ్యోతిః కశ్యపులచే చెప్పబడినది.

చండాలీ పతితా సమా థ రజకీ శూద్రా దినాదిక్రమా।
చ్ఛుద్ధా పుష్పవతీ చ పంచమదినే హవ్యేషు కవ్యేషు చ।
చేద్దుష్టేహ్ని నవోదకుంభసలిలై స్సత్మంత్రైస్తథా।
స్నానం పాపనుదం సపంచకిసలైః కార్యాం సమృద్ధిర్జలైః॥

రజస్వలయైన స్త్రీ ప్రథమదినమున చండాలస్త్రీ సమానురాలనియు, ద్వితీయదినమున పతితస్త్రీసమానురాలు అనియు, తృతీయదినమున రజకీ (చాకలిది) సమానురాలు అనియు, చతుర్థదినము శూద్రస్త్రీసమానురాలు అనియు తెలిసికొనవలెను. హవ్యకవ్యములకు ఐదవదినమున అర్హురాలు. గర్భాధానాదులయందు ప్రథమరజస్వల యగు స్త్రీకి, నవోదకుంభసలిలములతోడను, సత్మంత్రాంగములగు ఓషధులతోడను, పంచపల్లవములు గలిగినట్టియు, పవిత్ర వృత్తిక గలిగినట్టి ఉదకములతోడను, సహస్రపాదములను

భార్యతో రాత్రి తృతీయభాగమునందు భోగించవలెను.

రజోదర్శనాదులయందు ప్రథమదివసనిర్ణాయము

తృతీయభాగాది పరేహ్ని రాత్రి
ద్విభాగపర్యంత మహః పరేద్యుః।
రజస్వలాయా మృతుసంగమేపి।
మృతౌ ప్రసూతావపి చాహు రార్యాః॥ ౩౬౫॥

ఉక్తప్రకారా దృతుసంగమం యదా।
యుగ్మాసు పుత్రాః ప్రభవంతి రాత్రిషు।
స్త్రియో హ్యయుగ్మాస్వితి ధర్మవేదినో॥
వదంతి తస్మా దృతుశోధనం స్మరేత్॥ ౩౬౬॥

పూర్వదినరాత్రి తృతీయభాగము లగాయతు పరదినరాత్రి రెండుభాగముల పర్యంతము పరదినమని వ్యవహరింపబడుచున్నది. రజోదర్శనమందును, ఋతుసంగమమునందును, మృతియందును, జననమందును ఈరీతిగా దినసంగణనము చేయవలెనని ఆర్యులు చెప్పుచున్నారు. పూర్వోక్తప్రకారముగా యుగ్మరాత్రులయందు ఋతుమతియగు భార్యతో సంభోగించినయెడల పుత్రులును, బేసిరాత్రులయందు కుమార్తెలును కలుగుదురు అని ధర్మవేదులు చెప్పుచున్నారు. ఆకారణమువలన ఋతుశోధనము జ్ఞాపకముంచుకోవలెను.

చతుర్థీప్రభృతీత్యాది యావత్షోడసమాప్తితత్
నిస్సంశయత్వాత్సూత్రాణాం స్పష్టత్వా న్నుపేక్షితం॥

(చతుర్థీప్రభృతి' ఆప-గృ-౯-౧॥ ఇత్యాది ఖండసమాప్తి అను గల సూత్రములు సంశయము లేనివగుటవలనను స్పష్టములగుటవలనను ఉపేక్షింపబడినది.

## వైశ్వదేవకాలము.

వైశ్వదేవస్య సంస్థాత్వా న్నిత్యత్వా దాత్మశుద్ధయే।
వైశ్వదేవస్తు కర్తవ్య స్స్థాలీపాక పూర్వకః॥ ౩౬౭॥

వైశ్వదేవము సంస్థఅగుటవలనను, నిత్యము అగుటవలనను ఆత్మశుద్ధికొరకు వైశ్వదేవస్థాలీపాకపూర్వకముగా చేయవలెను.

నోత్తద్యేత యావదాగ్నేయవైశ్వ

దేవస్థాలీపాక హోమౌ చతావత్॥
నోత్పత్తి శ్చౌపాసనస్యాథ వైశ్వ
దేవస్యాప్యుత్పత్తి శేవాత్ర నోక్తా॥ ౩౬౯॥

ఎప్పటివరకు ఆగ్నేయస్థాలీపాక, వైశ్వదేవస్థాలీపాకములు చేయబడవో అంతవరకు ఔపాసనము వైశ్వదేవము చేయకూడదు.

కర్తవ్యా త్వౌపాసనారంభ ఆ
గ్నేయస్థాలీపాకహోమే కృతే తు॥
ప్రారంభ స్స్యాద్వైశ్వదేవస్య వైశ్వ
దేవ స్థాలీపాక హోమే సమాప్తౌ॥ ౩౭౦॥

ఆగ్నేయస్థాలీపాకము సమాప్తి అగుటతోడనే ఔపాసనము ప్రారంభింపవలెను. అట్లనే వైశ్వదేవస్థాలీపాకము సమాప్తియైనవెంటనే వైశ్వదేవము ప్రారంభింపవచ్చును.

వైశ్వదేవమునందు దేవతానిర్ణయము

యే దేవతే విహితే యేతే స్థాలీపాకే స్విష్టకృద్వతే।
ఔపాసనేపి తే ఏవ సాయం ప్రాతస్తు దేవతే॥ ౩౭౧॥

ఆగ్నేయస్థాలీపాక దేవతలగు అగ్నియు, అగ్నిస్విష్టకృత్తును, ఔపాసనమునకు గూడ దేవతలునుగా తెలిసికొనవలెను.

యాః ప్రోక్తా స్స్యుర్వైశ్వదేవస్థాలీపాకే పి దేవతాః।
సాయం ప్రాత ర్వైశ్వదేవే ప్యుక్తా స్తా ఏవ దేవతాః॥

వైశ్వదేవస్థాలీపాక దేవతలనే వైశ్వదేవ దేవతలనుగా తెలిసికొనవలెను.

స్థాలీపాకే వైశ్వదేవే ప్రధానా
స్తత్రా గ్న్యాద్యా రుద్రపర్యంతమంత్రాః।
వేదోక్తా స్తా దేవతా వైశ్వదేవే
విశ్వేదేవాహీతి సూత్రాదితాత్పర్యాత్॥ ౩౭౨।

వైశ్వదేవస్థాలీపాకమునందు ప్రధానములగు అగ్న్యాది రుద్రపర్యంత మంత్రములు వేదమందు చెప్పబడినవని. "వైశ్వదేవే విశ్వేదేవాః" ఆప-గృ-౭ ౨౭॥ అను సూత్రమువలన దేవతలు చెప్పబడెను.

ఆగ్నేయాదయ ష్షడ్ఢోమా బలిహరణాని చానగ్ని దేశ్యాన్యపి।

సర్వాణ్యాపి ప్రధానాని నహి కించదపి శేషా చరణ మంగమితి
సూత్రార్థః॥ ౩౭౪।

ఆగ్నేయాది ఆజ్యహోమములు అగ్నియందు వ్రేల్వబడిని బలులు అన్నియు ప్రధానములు. శేషా నామముగల అంగము కించిత్తునులేదు. అని ''వైశ్వదేవేశ్వ దేవాః'' ఆప-గృ-౭-౨౭॥ అను సూత్రమునకర్థము.

సుదర్శనేనే త్థముదీరితార్థా త్సర్వే ప్రధానా ఇతి నిశ్చితాస్సుః।
ఏవంచ గార్గ్యో వరదోపి గృహ్యప్రదీపకాకృద్గురు రుక్తవాన్హి।

సుదర్శనునిచే ఈప్రకారముగా చెప్పబడిన అర్థమువలన అందఱు ప్రధానులు అని నిశ్చయింపబడుచున్నారు. గర్గవంశీకుడును, గృహ్యప్రదీపికాకారుడును, గురువును, అగు వరదరాజుకూడ ఈప్రకారముగానే చెప్పియున్నాడు.

కర్తవ్య త్వాత్కర్మణో వైశ్వదేవ
కర్మ ప్రారంభాధి కారార్థసిద్ధ్యై।
పత్నీయుక్తః కర్మణి వైశ్వదేవ
స్థాలీపాకం కర్మ కుర్వీత విప్రః॥ ౩౭౬।

కర్మచేయతగినదగుటవలన వైశ్వదేవారంభాధికారము కొఱకు పత్నీయుక్తుడై విప్రుడు వైశ్వదేవస్థాలీపాకమును చేయవలెను.

వైశ్వదేవప్రకరణము.

వివాహార్థం వైశ్వదేవ మంత్రాణా ముపయోగకే।
ద్వాదశాహ మధశ్శయ్యాది చరేచ్చ సభార్యకః॥ ౩౭౭।
ఇత్యుక్త్వాథ ప్రశస్తేహన్యారభ్యేతిసుదర్శనః
ప్రాహారభ్యేతి వాక్యేన స్థాలీపాకో వగమ్యతే॥ ౩౭౮।

వివాహానంతరము వైశ్వదేవమంత్రములనుచెప్పుకొనుటకై పత్నీయుక్తుడై పన్నెండుదినములు అధశ్శయ్యాది బ్రహ్మచర్యమును చేయవలెనని చెప్పి ప్రశస్త దినంబున ఆరంభించి అని సుదర్శనాచార్యులు తద్భాష్యమునందు వ్రాసియున్నారు. ''ఆరభ్య'' యను వాక్యమువలన స్థాలీపాకము చేయవలెనని తోచుచున్నది.

అథార్యాః ప్రయతా వైశ్వదేవే న్నేత్యాద్యుదీరితం।
సూత్ర మేత త్సాయం ప్రాత ర్వైశ్వదేవక్రియాపరం।

''ఆర్యాః ప్రయతా వైశ్వదేవన్నసంస్కర్తారస్స్యుః'' ఆప-ధ-౨-౩-౧। అను

వాద్యాభ్యాభాగాంతమునందు స్థాలీపాకమునుండి గ్రహించి, మంత్రపాఠక్రమముగా అగ్న్యాది రుద్రాంతములగు ముప్పది హోమములు చేయవలెను. వైశ్వదేవ స్థాలీపాకమునందు పిత్ర్యాహుతి సవ్యముగా చేయవలెను. పరిధులు వేయవలెను. స్విష్టకృద్ధోమానంతరము బర్హిస్సంజ్ఞనము చేసి; హోమశేషమును సమాప్తి పొందించవలెను.

## వైశ్వదేవము.

కృత్వా గార్హాదన్న మాదాయ సిద్ధం
పాత్రేష్వన్నం పంచధా కల్పనీయం
తత్పార్థక్యాద్వైశ్వపాత్రేపి వాంశాన్॥ ౩౮౪।
హోమార్థమేకత్ర హవిష్య మన్నం
పాత్రే ప్రకల్ప్య స్వహవిష్యజాతం।
క్షారాది ముద్గాది యుతం ద్వితీయే
దేవాధ్వరార్థం చహవి స్తృతీయే॥ ౩౮౫।
అగ్రార్థ మన్నా దఖిలాచ్చతుర్థే
తద్వన్మనుష్యాయ చ పంచమేహి।
సుదర్శనేనైవ ముదీరితం స్యా
త్పిత్ర్యః క్రతో ర్భూతమఖస్య కల్ప్యం॥ ౩౮౬।
హోమాగ్రభాగా ద్బలయో ద్వితీయా
ద్భూతాగ్రదేవక్రతవ స్తృతీయాత్।
పిత్రధ్వరాయైవ చతుర్థభాగో
మనుష్యయజ్ఞాయ హి పంచమాంశః॥ ౩౮౭।
ఇత్థం విభాగం ప్రవదంతి శిష్టాః
పక్షద్వయే ప్యేక మిహా వలంబ్య।
క్షీరాజ్యదధ్యాదిభి రక్త మన్నం
హస్తేన చాదాయ తదగ్రభాగాత్॥ ౩౮౮।
ఔపాసనాగ్నౌ జుహుయా త్షడాహుతీ
రగ్న్యాదికా స్స్విష్టకృ దస్తిహాతాత్।

తస్మా న్నసోమో స్త్యత సత్తమాష్టమో
భ్యా మాంగిరాచార్య మతే క్వచిన్న ॥౩౮౯॥
తస్మా దభూ త్స్విష్టకృతం హిమష్టకం
హోమా త్పరం చోత్తరతో ఽష్టభస్మని।
క్షౌరాద్య సహామ్యం జుహుయాచ్చ హోమా వయో॥

• గృహమునుండి అన్నమును తీసుకుని వచ్చి, ఆఅన్నమును ఐదుభాగములనుగా జేసి, ప్రత్యేకప్రత్యేకముగా ఐదుపాత్రలయందుగాని, ఒకపాత్రమునందుగాని, ఉంచవలెను. ప్రథమపాత్రమునందు హోమార్థముగు అన్నమును, ద్వితీయపాత్రమునందు క్షౌరముద్గ సహితము అగు ఆహవిష్యాన్నమును, తృతీయపాత్రమునందు దేవయజ్ఞార్థముగుఅన్నమును చతుర్థపాత్రమునందు అగ్రదానార్థముగు అన్నమును, పంచమపాత్రమునందు మనుష్య యజ్ఞార్థముగు అన్నమును ఉంచవలెనని నృసింహాచార్యుడు తనభాష్యమందు వ్రాసి యున్నాడు. మఱికొందఱు ప్రథమభాగమునుండి హోమమును, ద్వితీయభాగమునుండి బలులను, తృతీయభాగమునుండి భూతయజ్ఞ దేవయజ్ఞాగ్రదానములను, నాలుగవభాగ మునుండి పితృయజ్ఞమును, ఐదవభాగమునుండి మనుష్యయజ్ఞమును, చేయవలయునని చెప్పుచున్నారు. పూర్వోక్త పక్షద్వయమునందు ఒకపక్షము నవలంబించి, పాలు, నెయ్యి, పెరుగు మొదలగువానిచే నభిఘరించబడిన అన్నమును ప్రథమభాగమునుండి గ్రహించి, ఔపాసనాగ్నియందు అగ్న్యాది స్విష్టకృదంతములగు (అగ్నయేస్వాహా విశ్వేభ్యోదేవేభ్యస్స్వాహా, ధ్రువాయభూమాయస్వాహా, ధ్రువక్షితయేస్వాహా, అచ్యుతక్షితయేస్వాహా, అగ్నయే స్విష్టకృతేస్వాహా'' అని) ఆరుహోమములనుచేయవలెను. స్విష్టకృత్తుకలదు అనిపఠించుటవలన సోమాహుతిలేదు. ఆంగీరసమతమునందు ఎనిమిది హోమములుగలవు. ఎనిమిది హోమములు చేయవలెనని ఎచ్చటను చెప్పక పోవుటవలన స్విష్టకృద్ధోమము ఆఱవది అని ఎఱుంగవలెను. హోమానంతరము అగ్నికి ఉత్తరదిక్కున ఉన్నభస్మయందు క్షౌరముద్గ సహితమగు ఆహవిష్యమును హోమమును చేయవలెను. ''హోమవరో'' అనుపదమువరకుండు శ్లోకముతో నన్వయము.

బలిహరణ ప్రకారము.

శేషంతు సంసృజ్య బలిం త్సమాచరేత్॥ ౩౯౦।
దేశేదేశే స్యా ద్బలీనాం ప్రమృజ్యా
ప్రోక్ష్య న్యస్యా సేచనం చాత్రనానా।
అంగుళ్యగ్రాణి స్పృశంతీ హ యద్వ

పాకాద్యాతిథ్యాంత కృద్వైశ్వదేవ
స్సాయం ప్రాతర్భార్య ఔపాసనాగ్నౌ
కర్తవ్య స్స్యాత్ స్వగృహం ప్రోషితోపి
తద్వా చాన్యైః కారయే న్మందిరేతు॥ ౪౦౦।

పాకాదియు, ఆతిథ్యాంగము అగు వైశ్వదేవమును ప్రతిదినమునందు సాయంప్రాతః కాలములయందు ఔపాసనాగ్నియందు చేయవలెను. యజమానుడు ప్రవాసమునందున్నపుడు పత్ని అన్యులచే గృహమునందు చేయించవచ్చును.

ఆచార్యైస్తైర్వా క్తధర్మాఖ్య సూత్రా
దుక్తం "చార్యాః ప్రయతా వైశ్వదేవే"
ఇత్యారభ్య హ్యాతిథనేవ చాగ్రే
భోజయే దిత్యంతకం వైశ్వదేవం॥౪౦౧।

"ఆర్యాః ప్రయతా వైశ్వదేవే" అప-ధ-౨-౩-౧॥ అనునది మొదలు "అతిథీనేవ చాగ్రే భోజయేత్" అప-ధ-౨-౪-౧౦॥ అనునంతవరకు ఆచార్యునిచే వైశ్వదేవము చెప్పబడినది.

ప్రవాసమందు వైశ్వదేవము.

లౌకాగ్నౌ చానాహితాగ్నిర్వి ప్రవాసీ
కుర్వీతాగ్రం పంచయజ్ఞాన హరహ్యాం।
ఉష్ణే భస్మన్యాహితాగ్ని స్త్వనగ్నిః
కుర్వీతాగ్నౌ లౌకికే వైశ్వదేవం॥ ౪౦౨॥

అనాహితాగ్నియు, ప్రవాసియు, వైశ్వదేవమును, పంచమహాయజ్ఞములను, అగ్రదానమును లౌకికాగ్నిలో చేయవలెను. హోమాగ్నిముకానిది ఉష్ణభస్మహోమము చేయవలెను. విచ్ఛిన్నాగ్నియగు ఆహితాగ్ని వైశ్వదేవమును లౌకికాగ్నిలో చేయవలెను.

రోగో పవాసాది పరాన్న భోజనా
ద్యాపత్సు సత్స్వప్యశనం ప్రయత్నతః॥
కర్తవ్య మేవాహని సాయ మన్వహం
స్యా ద్వైశ్వదేవం త్వథ పంచచాధ్వరాః॥ ౪౦౩॥

కుర్వీతనో చేద్య దిపక్వమన్నం ఫలానిమూలా న్యథ తం
దులాది। యథాధికారంజుహుయాచ్చ వహ్నా జలంజతే
వస్త్వపిదాగ్న్యభావే, ౪౦౪॥

(ఆ) ప్రవాసము, పరాన్న భోజనము మొదలగు ఆపదలయందు ప్రయత్న పూర్వకముగా అన్నమునుండి సాయం ప్రాతః కాలములయందు వైశ్వదేవమును పంచమహా యజ్ఞములను చేయవలెను. పక్వాన్నము సంభవము కాకపోతే ఫలమూలు దుంపలు తండులాదికము మొదలగు వస్తువులను యథాధికారముగా అగ్నియందు హోమము చేయవలెను అగ్నిలేకపోయిన యెడల ఉదకమును గాని ఫలాది పదార్థములను గాని ఉదకము నందు హోమము చేయవలెను.

ఇమమేవార్థమన్యత్రస్పష్టం శిష్టై రుదాహృతం
॥పక్వాభావే ప్రవాసేచ తండులా నోషధీస్తువా। ౪౦౫॥
పయోదధి ఘృతంవాపి కందమూల ఫలానివా।
యోజయేద్దేవయజ్ఞాదౌ జలంవా సక్తువాజలే। ౪౦౬॥

పూర్వోక్త ప్రకారముగా గ్రంథాంతరములయందు శిష్టులు స్పష్టముగా చెప్పియున్నారు. పక్వాన్నము సంభవము కాకపోయినపుడును, ప్రవాసమునందును, బియ్యము ఓషధులు, పాలు, పెరుగు, నెయ్యి, కంద, దుంపలు, ఉదకము, సక్తు, పిండి మొదలగు పదార్థములు వైశ్వదేవమునందు ఉపయోగించవచ్చును. అగ్నిలేకపోయినయెడల ఉదకమునందు హోమము చేయవచ్చును.

## వైశ్వదేవావశ్యకత

వైశ్వదేవావశ్యకత్వమాహ శాతాతపోమునిః।
శాతాతపముని వైశ్వదేవము అవశ్యముగా చేయవలెనని చెప్పియున్నాడు.
॥వైశ్వదేవ విహీనాయే ఆతిథ్యేన వివర్జితాః।
సర్వేతేవృషలాజ్ఞేయాః ప్రాప్తవేదా అపిద్విజాః। ౪౦౭॥

వైశ్వదేవహీనులు, అతిథ్యవర్జితులు అగు ద్విజులు సాంగవేదసంపన్నులయినను శూద్రులు అగుచున్నారు. అని ఎఱుంగవలెను.

ఉక్తంచ భగవద్గీతాస్వివమమేవార్థముత్తమం ॥౪౦౮॥
॥ఇష్టాన్భోగాన్హివోదేవా దాస్యంతే యజ్ఞభావితాః

తైర్దత్తానప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవసః। ౪౦౯॥
యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః।
భుంజతే తేత్వఘంపాపాయే పచంత్యాత్మకారణాత్। ౪౧౦॥

యజ్ఞభావితులగు దేవతలు మీకు ఇష్టములగు సమస్తభోగములను ఇచ్చుచున్నారు. దేవతలచే నివ్వబడిన ఆభోగములను దేవతలకు పెట్టక ఎవ్వడు భుజించునో అతడు దొంగయగును. యజ్ఞశేషమును భుజించువారలు సర్వపాపములవలన విముక్తిని పొందుదురు. ఎవరు తమకై వండుకొనుచున్నారో వారలు పాపమును భుజింతురు. అని స్పష్టముగా భగవద్గీతలయందు శ్రీకృష్ణభగవానుడు చెప్పియున్నాడు. అందువలన వైశ్వదేవము అవశ్యముగా చేయవలెను.

యజ్ఞోపవీతీ జుహుయాచ్చదేవ తీర్థేనచోత్తానకరేణచా
న్నం। తద్వైశ్వదేవాదిషు హస్తసాధ్య హోమేషు స
ర్వేష్వపి తండులాదీన్। ౪౧౧॥

హస్తసాధ్యహోమములగు వైశ్వదేవాది సమస్తకర్మలయందు అన్నముగాని, తండులాదికములుగాని, యజ్ఞోపవీతియై ఉత్తానహస్తుడై దేవతీర్థముతో హోమమును చేయవలెను.

బలులను స్వయముగా తీసివేయకూడదు

వైశ్వదేవబలీనాంతు నదోషో దర్శనే క్వచిత్।
స్వయముద్ధరణే దోష స్తస్మాదన్యైస్తుకారయేత్। ౪౧౨॥

వైశ్వదేవబలులను చూచిన దోషములేదు. బలులను స్వయముగా తీయగూడదు. ఇతరులచే తీసివేయించవలెను.

అనుద్ధృత్య బలీనశ్నన్ ప్రాణాయామాంత్షడాచరేత్।
స్వయముద్ధరణేచేత్తు ప్రాజాపత్యం సమాచరేత్। ౪౧౩॥

బలులను ఎత్తకుండా భుజించినయెడల ఆరుప్రాణాయామములను చేయవలెను. స్వయముగా బలులను ఎత్తినచో ప్రాజాపత్యమును చేయవలెను.

నిత్యశ్రాద్ధం బలీన్దద్యాన్నైవపాత్రాంతరేక్వచిత్।
ఉద్ధృత్యాగ్నౌ విప్రాన్నంక్షిపేద్వా పరిసద్మనాం। ౪౧౪॥

పాత్రములయందున్న భూమియందే బలులను ఉంచవలెను. పాత్రాంతరమునందు

ఉంచకూడదు. బలులను ఎత్తి ఆవులకుగాని బ్రాహ్మణులకుగాని ఉదకములయందుగాని ఉంచవచ్చును. లేదా ఇంటిమీదను వైనను వేయవచ్చును.

## బ్రహ్మయజ్ఞ కాలము

ప్రాతస్స్నాత్వా కర్మసంధ్యాదికృత్వా।
శ్రౌతంస్మార్తం చాగ్నికృత్యం సమాప్య।
స్వాధ్యాయస్యాధ్యాపనాద్యస్త్రిగేహే।
యోగక్షేమం పిత్ర్యసర్వం తదూర్ధ్వం। ౨౧౬॥
యో బ్రహ్మయజ్ఞే నచ యక్ష్యమాణః ప్రాచ్యాముదీచ్యా మపరాజితాయాం। గ్రామాద్బహిస్స్థ ప్రహ్రదకూపవాపీనదీ తటాకాదయుపమయత్రి। ౨౧౭॥ సంత్యజ్యగత్వా విధినాద్వితీయ స్నానంచ మాధ్యాహ్నిక మత్రకృత్వా గృహ్యాంతరోక్త స్మృతిషూదితత్వా త్స్నానాత్పరం బ్రహ్మముఖంచ కుర్యాత్। ౨౧౮॥

ప్రాతస్స్నానానంతరము సంధ్యావందనమును చేసికొని, శ్రౌతస్మార్తాగ్నిహోత్రములను చేసి, శిష్యులకు వేదమును చెప్పి, గృహమునందు యోగక్షేమములను కనుగొనినపిమ్మట బ్రహ్మయజ్ఞము చేయువాడై, గ్రామమునకు తూర్పుదిక్కునగాని, ఉత్తరదిక్కునగాని ఉన్నకూపము, దిగుడుబావి, చెఱువు, నది మొదలగువానియందు యథావిధిగా మధ్యాహ్నిక స్నానమును చేసి, మాధ్యాహ్నిక సంధ్యావందనానంతరము బ్రహ్మయజ్ఞమును చేయవలెను. గృహ్యాంతరములయందును, ధర్మశాస్త్రములయందును, మాధ్యాహ్నికస్నానానంతరము బ్రహ్మయజ్ఞము చేయవలెనని చెప్పబడియున్నది.

## బ్రహ్మయజ్ఞవిధి

అప్సుస్నాత్వాగమ్య యజ్ఞోపవీత
భూత్వావిప్రోధౌతశుక్లాంబరస్సన్।
ప్రాఙ్మాసీనో బ్రహ్మయజ్ఞేన యక్ష్య
ఇత్యాచార్యా ప్రోదకం స్పృశ్యదోర్భ్యాం। ౨౧౯॥
విద్యుదస్యమంత్రేణాథ శుద్ధోదకైస్త్రి

రాచామేదిత్యాది హ్యాత్సర్శనాంతం।
కృత్వా కృత్యాక్త్వాచమనంచ సవ్యే
పాదేపాదం దక్షిణం స్థాప్యతస్మిన్। ౨౯॥
జానున్యుత్తానం కరం స్థాప్యతస్మి
న్పాగ్రే ద్వేతే పవిత్రేనిధాయ।
ప్రాంచంవ్యంచం దక్షిణం స్థాప్యహస్త
మోమిత్యుక్త్వా వ్యాహృతీ స్త్రిరుక్త్వా॥ ౩౦॥
దేవ్యాఃపాదం పాదముక్త్వార్ధమర్ధం
తూక్త్వా సర్వాంచా విరామంజపిత్వా।
ప్రాగగ్రా నాస్తీర్య దర్భాన్ బహూంశ్చ
తేషూపస్థాఖ్యాసనంత ద్వికేమం। ౩౧॥
సవ్యేపాదే దక్షిణం స్థాప్యచోరుం
సవ్యేహ్యూరౌ దక్షిణం స్థాప్యపాదం।
ఏవంరూపోపస్థ సంజ్ఞాననేస్మి
న్పాగాస్య స్వాధ్యాయ మత్రారభేత। ౩౨॥

యజ్ఞోపవీతియై నద్యాదులయందు స్నానముచేసి, ఆచమనముచేసి, ఆరవేసిన ధౌతవస్త్రమును ధరించి, ప్రాఙ్ముఖముగా నాసీనుడై "బ్రహ్మయజ్ఞేనయక్ష్యే" అని సంకల్పించి, "విద్యుదసి విద్యమేపాప్మాన మృతాత్సత్యముపైమి" అనుమంత్రముచే ఉదకోపస్పర్శనముచేసి, కృత్వాచమనమును చేసి, వామపాదమునందు కుడిపాదమును ఉంచి, కుడిమోకాలిమీద వెల్లకిలగానుంచిన వామహస్తమునందు రెండుపవిత్రములను ఉంచి దానిమీద కుడిచేతిని ప్రాఙ్ముఖముగా బోర్లించి, "ఓంభూర్భువస్సువః" అనిపలికి గాయత్రిని ముందుగా ప్రతిపాదమునందును ఆపిచెప్పి, రెండవమారు అర్థర్చగాచెప్పి, మూడవపర్యాయము అవిరామముగా గాయత్రీమంత్రమును అంతయుచెప్పి, ప్రాగగ్రములుగా వేయబడిన దర్భలయందు ఉపస్థాసనముచేసి కూర్చొని, స్వాధ్యాయమును ప్రారంభింపవలెను. ఉపస్థాసనము ఎట్లుచేయవలెనగా వామపాదముమీద కుడితొడనుంచి ఎడమతొడమీద కుడిపాదము నుంచిన అది ఉపస్థాసనము అనబడును.

(అనగా స్వస్తికము వేసి కూర్చొనుట)

## స్వాధ్యాయస్వరూపము

అధ్యేతృభిః పితృపితామహాదిభిస్తథా!
పూర్వైః క్రమాధ్యయన పాఠపరంపరాయత్।
స్వాధ్యాయ మిత్యభిహితం హితమ స్తకర్మా
నుష్ఠాన కారణవిధా వుపయోగితత్వాత్। ౨౧౩॥

పితృపితామహ ప్రపితామహాదుల అధ్యయన పాఠపరంపరను స్వాధ్యాయమని పేరు. అదియే సమస్తకర్మానుష్ఠానమునకు ఉపయోగించును.

అధ్యేతవ్యం ప్రత్యహం బ్రహ్మయజ్ఞే
స్వాధ్యాయంస్తై తద్యథాశక్తి కృత్స్నం
తత్రేషేత్వోర్జ ప్రభృత్యేవకాండం
ప్రశ్నంసూక్తం చానువాకం యజుర్వా। ౨౧౪॥

అర్థంవాధీయీతా త్సంక్షిప్తాపకేవి
నమ్యాన్తే హ త్రిర్నమో బ్రహ్మణేతి।
వృష్టిస్తంత్రేణోదకం స్పృశ్యదోర్భ్యాం!
మాచమ్యాథోతర్పణం స్యాద్యతాసుః। ౨౧౫॥

ప్రతిదినమున బ్రహ్మయజ్ఞమునందు ఆస్వాధ్యాయమునంతను యథాశక్తిగా అధ్యయనము చేయవలెను. అందు ముందుగా "ఇషేత్వోర్జేత్వా" అనునది మొదలు ప్రతిరోజున ఒకకాండమునుగాని, ఒకప్రశ్నమునుగాని, ఒకసూక్తమునుగాని, ఒకఅనువాకమునుగాని, ఒకయజుస్సునుగాని, ఒకయజురర్థమునుగాని, జ్ఞాపకమున్నంతవరకు అగకుండా చెప్పవలెను. అంతమునందు "ఓంనమో బ్రహ్మణే నమోఅస్త్వగ్నయే" యను మంత్రమును ముమ్మారు ఉచ్చరించి, "వృష్టిరసి వృశ్చమే పాప్మాన మృతాత్సత్యముప పైమి" యనుమంత్రముచే ఉదకమును స్పృశించి అచమనము చేసినపిమ్మట ప్రాణాయామముచేసి, తర్పణమును చేయవలెను.

ఏవంకతుర్ణాంనో సమర్థోయదిస్యా
ద్గ్రామేస్వాధ్యాయం త్వధీయీతవిప్రః।
అంతర్గ్రే హేమానసే నైవవాహా
ర్నక్తంతిష్ఠ న్నాకయానో వ్రజన్వా। ౨౧౬॥

స్నాత్వా వైశ్వదేవం గృహదేవతార్చనం
హ్యాభ్యాగతానా మతిథేశ్చపూజనం
అభ్యాగతా జ్ఞాత చరామనోహరా
అజ్ఞాతగోత్రో తిథిరాగతో హఠాత్, ౨౨౩॥

* ఇంటికివచ్చి, వైశ్వదేవమును చేసినతర్వాత దేవతార్చనను చేసి, అభ్యాగతులను అతిథులను పూజించవలెను. అజ్ఞాతులగువారు అభ్యాగతులనియు, భోజనసమయమున హఠాత్తుగా వచ్చిన అజ్ఞాతగోత్రుడగు నతడు అతిథి అనియు చెప్పబడుచుండు.

## ఉపనయన కాలము

గర్భాష్టమేష్వితి ప్రోక్తమాచార్యైస్తైవతత్రతు।
జన్మతఃపంచమేషష్ఠే సప్తమేవ్వోపనాయనం ॥౨౨౪॥
కర్తవ్యం బ్రాహ్మణస్యేతి సూత్రార్థస్సముదాహృతః।
రాజ్ఞస్తు నవమాదూర్ధ్వం దశమాబ్దాత్పరం విశః ॥౨౨౫॥
ఆచార్యస్యమతంచేదం తతో మనుమతంస్మృతం।
"బ్రహ్మవర్చసకామస్య కార్యం విప్రస్యపంచమే।
రాజ్ఞో బలార్థినష్షష్ఠే వైశ్యస్యేహార్థినోష్టమే" ౨౨౬
"వటుఃపటుతరప్రజ్ఞాశాలీ చేద్బ్రహ్మవర్చసం
అపేక్ష్యపంచమేవర్షేషష్ఠేవాసప్తమేపివా" ॥౨౨౭॥
ఇతిగృహ్యాంతరం బ్రహ్మవర్చసం నవమేస్మృతం ॥౨౨౮॥
కశ్యపేనాథదశమాదూర్ధ్వం కామ్యంచమధ్యమం।
నీచంత్రయోదశాదూర్ధ్వం పతత్యూర్ధ్వంతుషోడశాత్ ॥౨౨౯॥
నప్రాయశ్చిత్తమేతావత్పర్యంతం తూర్ధ్వమేవహి,
ఉద్దాలకోదితప్రాయశ్చిత్తంకృత్వోపనాయయేత్ ॥౨౩౦॥
ప్రాయశ్చిత్తమకృత్వైవనకుర్యాదుపనాయనం ॥౨౩౧।

* జన్మాది ఐదవ సంవత్సరము నందుగాని, ఆరవ సంవత్సరము నందుగాని ఏడవ సంవత్సరమున గాని, బ్రాహ్మణునకు ఉపనయనము చేయవలెనని "గర్భాష్టమేషు బ్రాహ్మణము

వత్సాప్రతిష్ఠ చేసి, పరదినమునందు ఉక్తకాలమునందు చౌలము చేయబడనిచో చౌలమును చేసి, ఉపనయనము చేయవలెను. జాతకర్మాదిచౌలాంతములగు కర్మలు తత్తదుక్తకాలములయందు చేయనిచో ఆజాతకర్మాదికర్మలను చేసి ఉపనయనము చేయవలెను.

పాహిత్రయోదశహోమము

పూర్వోక్త కర్మ కరణే హ్యధికారసిద్ధ్యై
పాహిత్రయోదశ ఘృతాహుతి హోమమత్ర
కృత్వా వ్యతీత జననా ద్యఖిల క్రియాశ్చ
కృత్వో పనయాన ముశంతి విధింవిధిజ్ఞాః ॥౭౪౮॥

పూర్వోక్తజాతకర్మాదికర్మలను చేయుటకు అధికారము కలుగుటకై పాహిత్రయోదశహోమమును చేసి, అతీతములగు జాతకర్మాదికర్మలను చేసి, ఉపనయనము చేయవలెనని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

ఉపనయనము

పరేద్యు రాచార్య వటూ సుమంగళ
స్నాతౌ చ భూత్వా సమలంకృతౌ తతః।
కటే కుమారం హ్యుపవేశ్య దక్షిణే
హ్యాసీన ఇత్యు త్తరత స్స్వయం తతః ॥౭౪౯॥
ఇమం వటుం కాశ్యప మాని గోత్రం
యజ్ఞేశ శర్మాణ మిహోపనేష్యే।
సంకల్ప్య చాలం కృత వేదికాయా
మగ్ని ప్రతిష్ఠాపన మత్రకుర్యాత్ ॥౭౫౦॥

ఉపనయన దినమున ఆచార్యుడు మంగళస్నానము చేసి అలంకరించుకొనిన వాడై మంగళస్నాతుడు. అలంకరించుకొనినవాడు అగు వటువును తనకుదక్షిణభాగమున కూర్చుండజేసి "ఇమంకాశ్యపసగోత్రంయజ్ఞేశశర్మాణముపనేష్యే" అని సంకల్పించిఅలంకృత వేదికయందు అగ్నిప్రతిష్ఠాపనము చేయవలెను.

బధ్వా కుమారస్య చ కంకణం త
త్కర్మాంగ తద్బ్రాహ్మణ భోజనంస్యాత్ ।

తై ర్భుక్తవద్భి శ్శుచిమంత్రవద్భి
శ్చైవా శిషాం వాచన మాచరంతి ॥౪౬౧॥

అనంతరము వటువునకు కంకణమును కట్టి కర్మాంగముగు అభ్యుదయ శ్రాద్ధమునం దు భుజించినట్టియు, శుచులు, వేదవేత్తలు అగు బ్రాహ్మణులవలన ఆశీర్వాదమును పొందవలెను.

అభ్యుదయశ్రాద్ధము

బ్రాహ్మణా న్భోజయిత్వేతి యత్ర యత్రో పదిశ్యతే ।
తత్ర తత్రా భ్యుదయిక శ్రాద్ధ మిత్యవగమ్యతే ॥౪౬౨॥
సర్వర్ధి కర్మ కర్మభ్యః పూర్వేద్యు స్సద్య ఏవవా । బ్రా
హ్మణా న్భోజయే దష్టౌ హిరణ్యేనా దనేనవా ॥౪౬౩॥
ఇత్యయం గౌణపక్ష స్స్యా న్ముఖ్యో ద్వావింశతి ర్ద్విజాః
తదా భ్యుదయిక శ్రాద్ధం వక్ష్యామ స్తూ త్తరత్రహి ॥
ఆశిషోవాచయిత్వేతి పుణ్యాహం కర్మణస్స్మృతం । తత్క
ర్మ సర్వే జానంతి గృహ్యజ్ఞా యాజ్ఞికా ద్విజాః ॥౪౬౫॥
శుచీ న్మంత్ర వత స్సర్వ కృత్యేషు భోజయే దితి,
ప్రాహా చార్యః కేషు చిదా దా వంతేషు కేషుచిత్ ॥౪౬౬॥
చౌలో పనయనా న్నాది ష్వాదా బ్రాహ్మణభోజనం ।
ఉదీరితం కుమారాణాం శేష భోజన సిద్ధయే ॥౪౬౭॥

ఎచ్చటెచ్చట "బ్రాహ్మణాన్భోజయిత్వా" అని చెప్పబడునో అచ్చటచ్చట అభ్యుదయిక శ్రాద్ధము చేయవలెనని తోచుచున్నది. సమస్త శుభకర్మలయందు పూర్వదినమున గాని, తత్కాలమునగాని, ఎనమండుగురు బ్రాహ్మణులను నిమంత్రించి, అన్నముతోగాని, హిరణ్యముతోగాని, అభ్యుదయిక శ్రాద్ధమును చేయవలెను. అభ్యుదయిక శ్రాద్ధమునందు ఇరువది యిద్దఱు బ్రాహ్మణులకు పెట్టుట ముఖ్యపక్షము. ఎనమండుగురు బ్రాహ్మణులకు పెట్టుట గౌణపక్షము. అభ్యుదయిక శ్రాద్ధము ముందు సవిస్తరముగా చెప్పబడును. "ఆశిషోవాచయిత్వా" అనుటవలన చెప్పబడుకర్మణః పుణ్యాహ వాచనమును గృహ్యవిదులగు యాజ్ఞికులందఱు ఎఱుంగుదురు. "శుచీన్మంత్రవతస్సర్వకృత్యేషుభోజయేత్"

అని కొన్ని కర్మల ఆదియందును, కొన్నికర్మలఅంతమందును, ఆపస్తంబాచార్యులు చెప్పి యున్నారు. చౌలము, ఉపనయనము, అన్నప్రాశనము, మొదలగు కర్మలయందు కూడా వటువులకు శేషభోజనము, బ్రాహ్మణభోజనము చెప్పబడినది.

### యజ్ఞోపవీతధారణకాలము

యజ్ఞోపవీతం త్వితి వాచయే ద్వటుం
యజ్ఞోపవీతం ఖలు ధారయేదపి,
కేచి చ్ఛివస్వామి మతానుసారిణః
కుర్యుః పురస్తా చ్ఛమి న్నిధానతః॥౮౬౮।

"యజ్ఞోపవీతం" అను మంత్రమును వటువుచే చెప్పించి యజ్ఞోపవీతమును ధరింప చేయవలెను. శివస్వామి మతానుసారులగు కొందఱు సమిదాధానమునకు పూర్వ యజ్ఞోపవీతధారణమును చేయించుచున్నారు.

భోజనా చమనే స్వాధ్యాయే చ యజ్ఞోపవీ త్యభూత్
ఇత్యా చార్యః ప్రాహ తస్మా ద్యజ్ఞోపవీత ధారణం॥౮౬౯॥
ప్రాగ్భోజనా చ్ఛ్రేయ ఏవ సదాచారాచ్చ నిశ్చితం।
యజ్ఞోపవీతినం చైకం కుమారం భోజయే త్పృథక్। ౮౭౦॥

"భోజనఆచమనేస్వాధ్యాయేచ యజ్ఞోపవీతీస్యాత్" ఆప-ధ-౧-౧౫-౧॥ అని ఆపస్తంబుడు చెప్పుట వలన భోజనాత్పూర్వమందు యజ్ఞోపవీతమును ధరించుట మంచిది అలాగుననే శిష్టాచారము వలన కూడ నిశ్చయింపబడినది. యజ్ఞోపవీతి ధారియగు కుమారుని వేఱుగా భుజింపచేయవలెను.

### కుమారభోజనము

అన్నా ద్యశేషో చిత భోజ్య పూరితం
పాత్రం చ గాయ త్ర్యభిమంత్రితా శనం।
ఆపోశనే నాహుతి పంచకై ర్యుతం
తం భోజయే చ్ఛోదర పూరణం యథా ॥౮౭౧॥
తత్రా శిషో వాచయిత్వా కుమారం భోజయేదితి।
మదా చా ర్యేణ చోక్తత్వా న్న మాత్రా సహభోజనం॥

మాత్రా సహైవాశనమత్ర నాస్త్యతో
చార్యేణనోక్తం నతు సర్వ సమ్మతం।
శాస్త్రార్థ మస్తీతి వదంతి యే ద్విజా
స్తే చానభిజ్ఞాం ధ పరంపరాహి ।౮౭॥
వటోశ్చ మాత్రా సహభోజనం మదా
పస్తంబ సూత్రే తు తథాశ్వలాయనే,
సూత్రేష్వనుక్తం హి తతో నమష్ఠితం
శిష్టైశ్చ వృద్ధైరపి సూత్ర వేదిభిః ॥౮౮।
సమాన పంక్తా వపి వా సహాశనం
యేషాం చ గృహ్యేతు విధిర్విధీయతే,
తచ్ఛాఖినామేవ తదుక్త సత్క్రియా
విరుద్ధ గృహ్యస్య దితి నాన్య శాఖినాం ॥౮౯॥

ఆశేషభోజ్యాపశార్థపూరితమగు భోజనపాత్రను గాయత్రిచే అభిమంత్రించి, అపోశనానంతరము ప్రాణాహుతిపంచకము పుచ్చుకొనిన కుమారుని ఉదరపూరణము అగునట్లు భుజింప చేయవలెను. "అశిషో వా వయుత్స్యా కుమారం భోజయిత్వా" ఆప-గృ-౧౦-౯॥ అని ఆపస్తంబాచార్యులు చెప్పియుండుటవలన తల్లితో కూడ కుమారుని భుజింప చేయకూడదు తల్లితో కలిసి భుజించవలెనని ఆపస్తంబుడు చెప్పకపోవుటయే గాక, ఆశ్వలాయనాది సంమతముగూడ కాదు. ఈవిషయము శాస్త్రార్థము గలదనువారలు అంధపరంపరలోనివారు. తల్లితో కలిసి భుజించవలెనని ఆశ్వలాయనాపస్తంబసూత్రములయందు అనుక్తముగుటవలన సూత్రవేదులు, వృద్ధులు అగు శిష్టులు తల్లితో కలిసి కుమారుని భుజింప చేయుటలేదు ఏ సూత్రమునందు మాతృపంక్తియందు కుమారునకు భోజనము పెట్టవలెనని విధింపబడియున్నదో తత్సూత్రానుసారులే అట్లు చేయవలెను గాని అన్యసూత్రానుసారులు అట్లు చేయకూడదు.

### క్షౌరకర్మయందు కుమారనామోచ్చారణప్రకారము

అతో దాత్రే సత్యసౌ శబ్ద ఏవ
నామ బ్రూయా ద్విప్ర శర్మా సుశర్మా।

దేవస్యోదాత్తే పి చైవానుదాత్తే
శర్మన్నిత్యేవా వృథం చాత్ర వర్జనం ॥౪౭౬॥

ఈశాదిమంత్రములయందు అసౌశబ్దము అంతోదాత్తమగునపుడు "విష్ణుశర్మాను శర్మా" యని ప్రథమావిభక్తి చెప్పవలెను. "అవృధమసౌసోమ్య" అనుమంత్రము గాక "దేవస్య" ఇత్యాదిమంత్రములయందు ఉదాత్తమైనను అనుదాత్తమైనను "కేశవశర్మన్, నారాయణశర్మన్" అని సంబుద్ధివిభక్తి చెప్పవలెను.

పాత్రాసాదనము

కుశాంబు కూర్చాజిన వస్త్ర మేఖలా
దండాశ్మన శ్చేతి సకృత్ప్రయోజయేత్,

కుశలు, ఉదకము, కూర్చము, అజినము, వస్త్రము, మేఖల, దండము, అశ్మ అను పాత్రలను ఒక్కమారే ప్రయోగించవలెను.

ఆచార్యవటువులు చెప్పతగినమంత్రములు

స్యాత్సామిధేసీ మిమ మగ్న ఆయుషే
హ్యగ్నిష్ట ఆయు స్స్వౌచ ముచ్చరే ద్గురుః ॥౪౭౭।

ప్రాహోవమే న్మాణవకం తు వాచయన్
యోగాది మంత్రా న్నవ హోవయేదితి,

ఇయం దురుక్తా దజినస్య మంత్ర
మాగంత్రాసమ గన్మి తి చాప్యుదాయుషా ।౪౭౮।

సమంత్ర మేతా న్యపి మేఖలా దీ
న్యథో పున ర్మాణ వకం తు వాచయేత్।

"ఆయుర్దాదేవ, ఇమమగ్న ఆయుషే, అగ్నిష్టఆయుః" అనుమంత్రములను ఆచార్యుడు చెప్పవలెను. యోగాదిపదునొకండు మంత్రములలో ద్వితీయచతుర్థమంత్రములు గాక శేషించిన తొమ్మిది మంత్రములను మాణవకునిచే చెప్పించుచు, హోమము చేయించవలెను. అని ఆపస్తంబుడు చెప్పియున్నాడు. ఇయందురుక్తాత్, మిత్రస్యచక్షుః, ఆగంత్రాసమగన్మహి, ఉదాయుషా, అనుమంత్రములను ఆచార్యుడు చెప్పుచూ, మేఖలాదులను ధరింప చేయుచూ, కుమారునిచే చెప్పించవలెను.

యోనః ప్రచోదయాత్॥ఓం భూః తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ఓం భువః ధియో యోనః ప్రచోదయాత్॥ఓగ్ సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్॥అని ఆచార్యుడు వటువునకు గాయత్రిని ఉపదేశము చేయవలెను. అనంతరము కుమారుడు "గురోవరం దదామి" అని పలికి వరమును ఇవ్వవలెను. ఆచార్యుడు పదు పేదు ప్రాణాయామములను చేసి, "దేవస్యత్వా" యను మంత్రముతో ఆ వరమును గ్రహింపవలెను. శ్రౌతమునందు గ్రహణము మంత్రముతో చేయబడుచున్నది. ఉపనయనము శ్రుతిసంస్కారమగుటవలన దీనియందును సమంత్రకముగానే వరమును గ్రహింపవలెను. వరముగా గోవు అని ఎఱుంగవలెను.

అగ్నికార్యము

అగ్నయే సమిధ మాది యజుర్జ్యంపి
ద్వాదశైవ సమిదాహుతీ ర్వటుః।
కాలయో శ్చ జుహుయా ద్వయో రిహా
చార్య ఆహ న తదన్య ఇష్యతే॥౭౮౭।
ఏకా సమి ద్వ్యాహృతిభి శ్చ కేచి
ద్వ్యస్తా స్సమస్తా స్సమిధ శ్చతస్రః।
ఇత్యాహు రేకే తు తదూర్ధ్వ మేకా
సమి త్పునస్త్వే తివదంతి కేచిత్ ॥౭౮౮॥
యత్తే అగ్నే మయి మేధా మిత్యుపస్థాయ పావకం।
మానస్తోకబుచా భస్మధార్య స్త్యాత్ర్యాయుష మంత్రకైః॥౭౮౯।

"అగ్నయే సమిధం" ఇత్యాది పన్నెండు మంత్రములతో పన్నెండు సమిదాహుతులను సాయంప్రాతః కాలములయందు చేయవలెను. అని ఆచార్యుడు చెప్పియున్నాడు. ఆపస్తంబసూత్రమునకు భిన్నమైనది అంగీకరించబడదు. వ్యాహృతులతో ఒక సమిదాహుతిని చేయవలెనని కొందఱును, వ్యస్త సమస్తములగు వ్యాహృతులతో నాలుగు సమిదాహుతులు చేయవలెనని మఱికొందఱును, తదూర్ధ్వము "పునస్త్వా" అను మంత్రముతో ఒక సమిదాహుతిని చేయవలెనని కొందఱును చెప్పుచున్నారు. "యత్తే పర్చకే నాహం" ఇత్యాది మంత్రములచే అగ్న్యుపస్థానము చేసి, "మానస్తోక" అను మంత్రముతో భస్మమును ధరించి

## భిక్షాచరణాదికము

వృద్ధా న్నమస్కృత్య హి మాతృ పూర్వకం
పలాశ పూజార్థ మిహా మభిక్షాం।
సంయాచయే త్తా మథ బాధ మస్మి
స్యా ద్బాధ మశ్నామి కరోమి బాధం॥౭౭॥
బాధం దివా నస్వపిమీ తి బాధం
బాధం చరామి ప్రభవామి చేతి।
తచ్చక్షు రేతేన కృతార్థతా స్యా
న్మాధ్యాహ్నికీ చాత్ర పున ర్నకార్యా ॥౭౮॥
సంధ్యాం చ భిక్షాటన మగ్నికార్యం
కుర్వీత కాలద్వయ మన్వహంహి।
కర్తవ్య మాపాకరణా దుపైతై
గాయత్రియా బ్రహ్మమఖం చ నిత్యం॥౭౯॥

మాతృపూర్వకముగా వృద్ధులకు నమస్కారము చేసి పలాశపూజనిమిత్తమై అమ్మ(తం డ్రుం) భిక్షను ఎత్తవలెను. అనంతరము వటునిచే బాధయులను చెప్పించి, సూర్యోపస్థానము చేయించవలెను మధ్యాహ్న సంధ్యావందనము చేయునక్కరలేదు. సంధ్యావందనము, భిక్షాటనము, అగ్నికార్యము, సాయంప్రాతః కాలములయందు ప్రతిదినమును చేయవలెను. నూతన వటువులు ఉపాకర్మవరకు గాయత్రితో ప్రతిదినమును బ్రహ్మయజ్ఞమును చేయవలెను.

## పాలాశకర్మ

పాలాశార్చా స్యాచ్చతుర్థేహ్ని కార్యా
గ్రామాత్ప్రాచీం ప్రాగుదీముదీచీం।
తాంప్రాప్యాథస్తా త్పలాశస్య కృత్వా
ప్రాక్సంస్థాని స్థండిలాని త్రీణ్యుదగ్వా॥౮౦॥
ఆవాహ్య తేషు ప్రణవం తథాదౌ

స్నాత్వా కృత్వా దేవతాపూజనంచ।
అగ్నించేద్వాద్యాజ్యభాగావసానే
పూర్వైరగ్నిం తం పరిష్కృత్య సాంతం ॥౪౯౫॥
యచ్ఛందసా మిదం సూక్తం వాచయ న్నేవ హావయేత్।
చతుర్భిః పంచభి ష్షడ్భి ర్వాక్యై శ్చాధికవాక్యైః॥౪౯౬॥
క్రమా త్త్యక్త్వాపి మాయుంశ్చేత్యాది వాక్యచతుష్టయం।
స్వాహామ్నాతా ష్షడత్రాంత్యే వాక్యేస్వాహేతి యో
జయేత్॥౪౯౭॥ ఏకాదశాహుతీ రేవం హావయిత్వా
గురుస్వయం। జయాదీంశ్చ స్వయంహుత్వా వస్త్రాది
త్యాగధారణం॥౪౯౮॥
అసంశయత్వా దుపనాయనస్య
ఖండద్వయస్యాపి సుబోధకత్వాత్।
ఉపేక్షితం శిష్ట మథద్విజాంశ్చ
సంభోజయిత్వా శివ మాచరంతి॥౪౯౯॥

కొందఱు ఈపాలాశకర్మయందు హోమమును చేయుచున్నారు. ముందుగాప్రణవాది దేవతాపూజచేసి "అగ్నింధ నాద్యాజ్యభాగావసానమునందుఅపూపములతో అగ్నిని అలంకరించి "యచ్ఛందసాం" అను ఛందస్సూక్తమును వటుచే చెప్పించుచూ, ఆసూక్తమందలి మొదటి నాలుగు వాక్యములచే నొక ఆహుతిని, అనంతరము ఐదు వాక్యములతో నొక ఆహుతిని తర్వాత ఆరువాక్యములతో నొక ఆహుతిని, అనంతరవాక్యముతో నొక ఆహుతిని, అనంతరము "మాయుంశ్చ" ఇత్యాది నాలుగు వాక్యములను విడచి తదనంతరగములగు నాలుగు వాక్యములచే నాలుగు ఆహుతులను, అనంతర వాక్యద్వయముతో రెండు ఆహుతులను, అనంతరవాక్యముతో నొకఆహుతిని, మొత్తము పదునొకండు ఆహుతులను, వటువుచే ఆచార్యుడు హోమము చేయించి జయాదులను స్వయముగా హోమము చేయవలెను. ఛందస్సూక్తమునందలి ఆఖరు ఏడువాక్యములలో ఆరువాక్యములు స్వాహాకారాంతములు అయినాను, అంత్యవాక్యమునందు స్వాహాకారము యోజన చేయవలెను. అనంతరము ప్రాచీన వస్త్రమును విడిచి నూతన వస్త్రమును వటువు ధరింపవలెను. ఉపనయనము సంశయములు లేని దగుటవలనను ఉపనయన బోధకమగు

దంతఖండములు సుబోధకములగుటవలనను శేషించిన దంతయు ఉపేక్షించబడినది. ఆ నంతరము బ్రాహ్మణులకు భోజనము పెట్టి వారివలన ఆశీర్వాదమును పొందవలెను.

## స్నాతకము

అధీత వేదస్తు గురో రనుజ్ఞయా
  య ఆశ్రమం స్వీకురుతే తముద్దిశన్।
జ్యోతిర్విదుక్తేహని శోభనే పివా
  కార్యం సమావర్తన ముత్తరాయణే॥౧౦౦॥
బ్రహ్మచర్య వ్రతస్యా నుష్ఠాన ధర్మాది సంశయే।
  కృచ్ఛ్రాదిభిః కృతప్రాయశ్చిత్తో నాందీయముఖశ్చపన్॥౧౦౧

వేదవేదాంగములను చదువుకొనిన బ్రహ్మచారి గుర్వనుజ్ఞను పొందిన గృహస్థాశ్రమము స్వీకరింప దలచిన యెడల ఉత్తరాయణమున, సిద్ధాంతి నిర్ణీతమగు శుభముహూర్తమున, స్నాతకము చేయవలెను. బ్రహ్మచర్యవ్రతము బాగుగా చేయబడ లేదు. అని సంశయము ఉన్న యెడల బ్రహ్మచర్య వ్రతలోపప్రాయశ్చిత్తము చేసికొని నాందీముఖశ్రాద్ధము చేయవలెను.

తతః పరేహన్యుషసి వ్రతీకృత
  స్నానో ప్యనధ్యాం తు సమాప్య గోగృహం।
ప్రవిశ్య హి ప్రాగుదయా త్స్వకాంతయా
  సూర్యో యథా నాభితపే త్తథావసేత్॥౧౦౨॥

అనంతరము పరదినమున ఉషఃకాలమునందు స్నానము చేసి, సంధ్యావందనము చేసికొని, సూర్యోదయాత్పూర్వమే గోశాలలో ప్రవేశించి, సూర్యరశ్మి తన దేహమునకు తగులకుండునట్లుగ ఉండవలెను.

యది క్వచి న్మూత్రపురీషనంకటే
  ఛత్రాదిభి శ్చావరణై ర్వృతో భవేత్
కృత్వాగ్ని కార్యం త్వథ మధ్యమే దినే
  వహ్నింధనాది హ్యథ పాత్రసాదనే॥౧౦౩॥
సూత్రే వస్త్రే మణియుగమపి స్రక్సుగంధౌ ప్రవర్తౌ

పచ్ఛాచ్ఛూద్రక్రియైత్యే గ్రే పత్సవ్యం సర్వశాఖినాం॥౧౧౨॥

అర్ఘ్యానంతరము పూర్వోక్త వస్త్రాదికమును ఇవ్వవలెనని శాఖలు చెప్పుచున్నారు. శూద్రుడు పాదప్రక్షాళనము చేయునెడల ముందుగా వామపాదములను కడుగవలెను. అని సర్వశాఖలవారు చెప్పియున్నారు.

క్షత్రవైశ్యౌ యదిప్రాప్తౌ నియమో నాత్రదృశ్యతే।

క్షత్రియుడు వైశ్యుడు పాదప్రక్షాళనము చేయునపుడు పాద నియమము లేదు,

పురస్తాదుపరిష్టాచ్చ మధుపర్కాఖ్య కర్మణి॥ ౧౧౩ ॥

యజుర్భ్యాముపఆచామే దిత్యాహాచార్య ఏవహి।

తత్యక్త్వా త్వైవ కుర్వంతి కేచిద్వ్యాఖ్యాన మన్యథా॥

ఏకత్వాత్కర్మణో మధ్యే ఘటేతా చమనం కథం।

అనుక్త మన్యతో గ్రాహ్య మిత్యర్థోఽపి ఘటేత న॥

తస్మాద్విరుద్ధ వ్యాఖ్యానం న మన్యంతేమనీషిణః।

మధుపర్కకర్మయందు మధుపర్క ప్రాశనమునకు పూర్వమునందును, పరమునందు ఆచమనము చేయవలెనని ఆపస్తంబుడే చెప్పియున్నాడు, దానిని విడిచి ఈవిషయమై కొందఱు అన్యథాగా వ్యాఖ్యానమును చేయుచున్నారు, మధుపర్కము ఒక్కటే కర్మ అగుటవలన కర్మ మధ్యమునందు ఆచమనము ఎట్లు సంబంధించును "అనుక్త మన్యతోగ్రాహ్యం,, అను న్యాయముకూడ యిచ్చట సంబంధించదు, కనుక విరుద్ధవ్యాఖ్యానమును విద్వాంసులు అంగీకరించరు.

మధుపర్కః ప్రదాతవ్యః ప్రాఙ్ముఖాయ ద్విజాయహి॥ ౧౧౬ ॥

తస్యాన్తే భోజనం దేయ మాచార్యా దిభ్య ఏవహి।

తేభ్యస్సంవత్సరా దూర్ధ్వ మాగతేభ్యస్సమర్పయేత్ ॥

స్వగ్రామ వాసి వ్యాఖ్యాతే మధుపర్క స్సకృద్భవేత్।

సకృత్త్వాత్పటలస్యాస్య సుకరత్వా దుపేక్షితం॥ ౧౧౮ ॥

ప్రాఙ్ముఖుడగు ద్విజునకుమధుపర్కముఇవ్వవలెను. మధుపర్కపూజాన్తమునందు భోజనము పెట్టవలెను. ఆచార్యాదులు సంవత్సరాదూర్ధ్వము వచ్చినయెడల తిరిగి వారికి మధుపర్క పూజచేయవలెను. స్వగ్రామవాసియగు వ్యాఖ్యాతకు పదవాక్యప్రమాణము లతో సానుశబ్దములను ఉచ్చరించువాడు, సప్రమాణముగా వ్యాఖ్యానము చేయువాడు,

ఒక్కమా శీ మధుపర్క పూజ చేయవలెను. పంచమ పటలము స్వల్పమైనది అగుట వలనను సుకరమైనది అగుటవలనను విశేషముగా చెప్పక విరమించవలసినది.

## సీమంతకాలము

సీమంతకర్మ నవచతుర్థమాసేతిథ్యృక్షవారాదివిశోధ్య కుర్యాత్।
పుంనామధిష్ణ్యేషు చ శుక్లపక్షే స్యాచ్చంద్రతారాబలసంయుతేహ్ని॥
షష్ఠే ష్టమే వా నవమే పి మాసే
సర్వేషు తిథ్యృక్ష దినాదిషు స్యాత్।
తస్మిన్నకర్మాకరణే హి దోషో
హ్యనుక్త కాలే పి చ కర్మ కుర్యాత్॥ శ్లో.౨౦॥

చతుర్థ షష్ఠాష్టమ నవమ మాసములయందును, పురుషనక్షత్రములయందును, పంచాంగశుద్ధ దినమునందు చంద్రతారాబలములను ఆలోచించి గర్భవతియగు స్త్రీకి సీమంతము చేయవలెను. సీమంతము నిత్యకర్మ యగుటవలన చేయనిచో ప్రత్యవాయము సంభవించును. కాబట్టి అనుక్త కాలమందైనను సీమంతము చేయక తీరదు.

## సీమంతము

నాందీముఖబ్రాహ్మణభోజనంచకృత్వాశిషోవాచనమాచరేయుః।
యామ్యోత్రపత్న్యుత్తరతిస్స్వయంచాసీనోగ్నిమిధ్మాదికమత్రకర్మ్యాః॥
పాత్రప్రయోగాత్పర మేక యత్నా
దాసాదయే దంకురితా న్యవాంశ్చ।
మాలేవ సూత్ర గ్రథితా స్వయూధాం
త్సగ్ధన్నపుంజీల శలల్యా పతాకా॥ శ్లో.౨౧॥

యథావిధిగా నాందీశ్రాద్ధమునందు బ్రాహ్మణులకు భోజనము పెట్టి వారివలన నాశీర్వచనము(కర్మణఃపుణ్యాహవాచనము) జరిగింపవలెను. అనంతరము భర్త పత్నికి ఉత్తర భాగమున నాసీనుడై అగ్నింధనాది పాత్ర ప్రయోగమువరకు చేసి సాంకుర యవమాలికను, దర్భపుంజీలమును, మేడిపళ్లగుత్తిని ఏకుపందిముళ్లను, అనుమాన పాత్రములను ఆసాదించి ఆజ్యభాగాంతమువందు "దాతౌదదాతునోరయిం" అను నాలుగు హోమములను "యస్త్వాహృదా" అను నాలుగు హోమములనుజేసి జయాద్యుత్తరపరిషేచనమువరకు చేయవలెను.

ప్రాప్తే ముహూర్తే సతి మంగళాష్టకాన్
త చ్చూర్ణికా దీంచ పఠత్సుసత్స్వథ।
సీమంత మున్నీయ నిరస్య పశ్చిమం
హ్యాప స్పృశే దంబ్వథ గాన మత్ర హి॥ ౧౨౩ ॥
అసా వితి హ్యత్ర సమీప నద్యా
స్సంబుద్ధి నామ్నై వ ముదాహరేత।
కావేరి గోదావరి తుంగభద్రే
తుల్యే తి భాగీరథి నర్మదే స్మ॥ ౧౨౪ ॥
ధమ్మిల్ల ఆబధ్య యవా న్విరూఢాన్
కంఠే ప్రబధ్యే తి వదంతి కేచిత్।

సుముహూర్త సమయమున మంగళాష్టకములను చూర్ణికను పఠించుచుండగా మా నుషపాత్రములను గ్రహించి భార్య సీమంత ప్రదేశమును దువ్వి పశ్చిమముగా పారవైచి ఉదకోపస్పర్శనము జేయవలెను. తర్వాత వైణికులకు గానముచేయుడని ప్రేషయివ్వ వలెను. గాన మంత్రములకు "సోమఏవనోరాజా" యనుమంత్రమునందలి "అసౌ"అను స్థానమున సమీప నదీనామము సంబుద్ధిగానిర్దేశింపవలెను. అనగా "కావేరి, గోదా వరి, తుంగ, భద్రే, తుల్యే, భాగీరథ, నర్మదే అని సంబుద్ధివిభక్తితో నిర్దేశింపవలెను. అనంతరము సాంకుర యవమాలికను కొప్పునకట్టవలెను. కంఠమునందు ధరించవలెనని కొం దఱు చెప్పుచున్నారు.

## పుంసువనము

కుక్షిత చే త్పుంసువనం తృతీయే
మాస్యేవ తిష్యా దితి శుక్లపక్షే॥ ౧౨౫ ॥
నోచే త్తు సీమంత దినే హి పూర్వం
కృత్వా థ సీమంత కృదేవ స స్యాత్।
యామ్యే త్ర పత్న్యా త్తరత స్స్వయం
స్యా న్నాత్రైవ శమ్యా అథ మానుషాణి॥ ౧౨౬ ॥
న్యగ్రోధ వృక్షస్య భవా నుదీచ

స్నానం గేహాన్నిర్గమో నాస్తిశుద్ధిః।
స్త్రీస్నాతాయాం సూత్యగారా ద్దశమ్యాం
సత్యాం స్నాతాయాంచ శుద్ధాహి నాస్యాత్॥ ౫౩౧ ॥
స్నానంప్రోక్తంసంగవేసూతికాంతే
నైవంపిత్ర్యంకర్మకర్తవ్యమత్ర।
తస్మాజ్జాతంకర్మజాతేష్టినామా
వ్యక్తంకార్యాణీతిచైకాదశేహ్ని॥౫౩౨

పుత్రుడు పుట్టినతోడనే జాతకర్మచేయుటకు వీలులేకున్నది. పదిరోజులలోపుస జననాశౌచము ఉండుటవలన దశరాత్రానంతరము జాతకర్మ నామకర్మలు చేయవలెను. పదిరోజులు వెళ్లినతరువు తల్లికి స్నానముగాని, పురిటియింటినుండి అవతలకు వెళ్లుటగాని, శుద్ధిగానిలేదు. పదునొకండవరోజున పురిటియింటినుండి ఇవతలకు వచ్చిస్నానము చేసినతోడనే తల్లి శుద్ధురాలగును. పురిటిస్నానము పదునొకండవరోజున సంగవకాలమునందు చేయింపవలెను. పైత్రపితృకర్మలు ఈరోజుననే చేయవలెను. అందువలన నేకాదశిదినమున జాతకర్మ నామకరణములు చేయవలెనని శాస్త్రములయందు చెప్పబడియున్నది.

దశమ్యా మితి శబ్దోత్ర సూతికాం తోపలక్షణం।
అతీతే దశరాత్రేతు కర్తవ్యే జాతనామనీ॥ ౫౩౩ ॥

"దశమ్యాముత్థితాయాం,, ఆప-గృ-౧౫-౮॥ అను సూత్రమునందలి "దశమ్యా,, యను పదము సూతికాంతోప లక్షణము.దశరాత్రములు వెళ్లిన తర్వాత జాతకర్మనామకరణములు చేయతగినవి.

## నామకరణము

వర్గేచ వర్గే ప్రథమ ద్వితీయా
వఘోష వంతౌ శషసా అఘోషాః।
అఘోష శిష్టం త్విహ ఘోషవ చ్చా
న్తస్థా శ్చ యాద్యా అథ నామ దద్యాత్॥ ౫౩౪ ॥
నామ ద్వ్యక్షే ఘోషవ దాది మధ్యే
న్తస్థం తతో దీర్ఘ విసర్జనీయౌ।
ఆనార్ష్య ఏతాదృశ నామ చాహ
త ద్వైదికం బాధ న శాస్త్రకారాః॥ ౫౩౫ ॥

క, ఖ, గ, ఘ, ఙ, కవర్గము, చ, ఛ, జ, ఝ, ఞ, చవర్గము, ట, ఠ, డ, ఢ, ణ, టవర్గము, త, థ, ద, ధ, న, తవర్గము. ప, ఫ, బ, భ, మ, పవర్గము. ఈ ఐదువర్గముల యందలి ప్రథమ ద్వితీయము లగు క, ఖ, చ, ఛ, ట, ఠ, త, థ, ప, ఫ, ఈఅక్షరము లును, శ, ష, స, లనును అఘోషము లనిపేరు, గ, ఘ, ఙ, జ, ఝ, ఞ, డ, ఢ, ణ, ద, ధ, న, బ, భ, మ, అనుఅక్షరములును హకారమునకును ఘోషములని పేరు య, ర, ల, వ, లను అంతస్థములని పేరు ఈరీతిగానక్షరసంజ్ఞలును తెలిసి నామకరణము చేయువ లెను, నామద్వయమునందు ఘోషవద్వర్ణములు ఆదియందును, అంతస్థవర్ణములు మధ్య యందును, దీర్ఘ విసర్జనీయములు అంతమునందును, ఉండవలెను అని ఆపస్తంబుడు చెప్పి యున్నాడు, ఆనామము వైదికాహ్వానము గాని లౌకికాహ్వానము కాదు.

వార్ధాః శ్చ శీర్దాః ప్రభృతి ద్వయేషు నంచ
హిరణ్యదా శ్శోభనదా ఇహాపి।
నామాని వైతా న్యపి నో సుశబ్ద
పూర్వంతు వా నామ మనోహరంస్యాత్॥ ౧౩౬ ॥

వార్ధాః, గీర్ధాః, హిరణ్యదాః, శోభనదాః, అని ఆపస్తంబోక్త నామమున కుదా హరణములు వైదికాహ్వాననామకరణములు వేనపుడు సుశబ్దపూర్వకమగు నామకరణము (సుబ్రహ్మణ్యః, సుభద్రా,)ను ఉంచిన మనోహరముగా నుండును.

లిఖేత్ పాత్రా ర్పిత తండులేషు
సువర్ణపుష్పా క్షత సంయుతేషు।
తజ్జన్మ మాసాధిప నామ చ ర్క్ష
నామా త ఊర్ధ్వం వ్యవహార నామా॥ ౧౩౭ ॥

పళ్లెరమునందు తండులమునుబోసి సువర్ణము, పుష్పములు, అక్షతలుకూడనుంచి మాసనామము, నక్షత్రనామము, వ్యవహారనామము క్రమముగావ్రాయవలెను.

అన్నప్రాశన చౌలోపనయన స్నాన కర్మసు।
కంకణం తు వటో రేకం కర్మాంతే త ద్విసర్జయేత్॥ ౧౩౮॥
గర్భాధానే పుంసువనే సీమంతే చ వివాహకే।
శతాభిషేకే దంపత్యో ర్ద్విధియే తే తు కంకణే॥ ౧౩౯ ॥

అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, స్నాతకము, అను కర్మలయందు వటువునకు ఒకనికి మాత్రమే కంకణముకట్టి ఆయాయికర్మాంతములయందు కంకణమును విసర్జింపవలెను. గర్భాధానము, పుంసవనము, సీమంతము, వివాహము, శతాభిషేకము, అను కర్మలయందు దంపతుల ఉభయులకును కంకణము కట్టవలెను.

అన్నప్రాశనము

షష్ఠే మాసే బ్రాహ్మణాన్భోజయిత్వా
విప్రైస్స్వైస్త్సై రాశిషో వాచయిత్వా।
పాత్రే మధ్వాజ్యాన్న దధ్యాది యుక్తం
చాంతే మంత్రాణాం సకృత్ప్రాశయేత్తం॥ ౧౪౦ ॥

ఆరవమాసమునందు అభ్యుదయిక శ్రాద్ధము, కర్మణః పుణ్యాహవాచనము ఆయిన పిమ్మట స్వర్ణాదిపాత్రియందు తేనె, నెయ్యి, అన్నము, పెరుగు కలిపి "భూర పాంత్వోంషధీనాం" అను నాలుగు మంత్రములను చెప్పిన పిమ్మట ఒకమారు బాలకుని భుజంప చేయవలెను.

కర్ణవేధ

తామ్ర రాజత సౌవర్ణ సూచ్యా వా ద్విత్రి తంతునా।
పాద్గ్రంత జననాత్కర్ణౌ భిద్యేతే మాతులాదిభిః॥ ౧౪౧ ॥

తామ్రముచేగాని వెండిచేగాని బంగారముచేగాని చేయబడినట్టియు రెండుమూడు పేట్లు పొడవుగల దారము కలిగినట్టియు సూదితో మేనమామ మొదలగువారు బాలకునికి కర్ణవేధను చేయవలెను.

చౌలము

వర్షే తృతీయే సతి చౌలకర్మ
కుర్వీత విప్రాన్ సహ భోజయిత్వా।
స్తై ర్వాచయిత్వా శిష ఊర్ధ్వ మగ్ని
మిధ్వాది పాత్రా వసరప్రయోగే॥ ౧౪౨ ॥
శీతోష్ణ మంబు శ్చలలీః కుశాంశ్చ।
గ్లప్సాంశ్చపుంజీల శకృద్యవాంశ్చ।
ఆసాదయేచ్చాధ యథర్ద్ధి సంఖ్యా
శిఖాశ్చ కార్యాః కుల ధర్మతో వా॥ ౧౪౩ ॥
ఏతాన్ఛిఖా వాపి శిఖే శిరోరుహా
న్వాపయేత్కర్మణి చోపనాయనే।

మూడవసంవత్సరమునందు చౌలము చేయవలెను. నాందీశ్రాద్ధమైనపిమ్మట ఆశీర్వాదమును పొంది అగ్నింధనాది పాత్రి ప్రయోగసమయమున శీతోదకమును ఉష్ణోదకమును, ఏదుపందిముళ్లను, కుశలను, గ్లప్సమును, దర్భపుంజీలమును, శకృత్తును, యవ-

ను, ఆసాదింపవలెను ప్రవరమునందు ఎందరు ఋషులున్నారో అన్నిశిఖలనుగాని, పంచాచారముగాగాని, శిఖలనుఉంచవలెను. ఉపనయనమునందా శిఖలవేపనము చేయవలెను.

గోదానము

గోదానశబ్దా దధునా వగమ్యతే
తచ్ఛ్మశ్రు కర్మేతి హి చౌలవద్ధి॥ ౧౨౨
ఉదగ్గతే ర్కే సతి షోడశేబ్దే
సగ్లప్స పుంజీల శలల్య ఉక్తాః।
హిత్వామూ త్పరం శ్మశ్రు చ వాపయేచ్చ
కుర్యాన్నఖో త్కృంతన ముత్తమాంగం॥ ౧౨౩ ॥

గోదానశబ్దమువలన శ్మశ్రుకర్మయని తోచుచున్నది. ఈగోదానము చౌలవత్తుగా పదునారవసంవత్సరమునందు ఉత్తరాయణమునందు చేయవలెను. అగ్నింధనాది పాత్రప్రయోగమునందు, మానుషపాత్రములగు గ్లప్సమును, దర్భపుంజీలమును, ఏదుసందిముళ్లను ఉంచి ఆజ్యభాగాది బ్రహ్మ విసర్జనాంతము వరకుజేసి శ్మశ్రు( మీసము, గడ్డము ) వాపనముచేసి గోళ్లను తీయించుకొనవలెను.

సీమంతోన్నయనా ఖ్యేస్మి న్పటలేఖిల సంశయాన్।
వివిచ్యోక్త్వా ధ శిష్టస్య సుగమత్వా దుపేక్షితం॥ ౧౨౪ ॥

ఈసీమంతపటలమునందలి అఖిలసంశయములను వివేచనపూర్వకముగా చెప్పి మిగిలిన భాగము సుగమమగుటవలన నుపేక్షింపబడినది.

గృహనిర్మాణము

అథాధికారిణాం రాజ్ఞాం సంపన్నానాం ప్రజారతాం।
సర్వేషాం బ్రాహ్మణా దీనాం గృహ నిర్మాణ మాదిశేత్॥
నైమిత్తికాది శ్రౌత స్మార్తాది కర్మణాం।
సిద్ధ్యర్థం చాత్మరక్షార్థం గృహస్థాశ్రమ సిద్ధయే॥ ౧౨౫ ॥
ఆశ్వలాయన సూత్రోక్త బాహ్యాంతర్లక్షణాని చ।
ఇష్టానిష్ట ఫలం జ్ఞాత్వా గృహ కర్మ సమారభేత్॥ ౧౨౬ ॥

ఇక గృహనిర్మాణ విషయమై చెప్పబడుచున్నది. రాజులు, సంపన్నులు, బ్రాహ్మణాది సర్వవర్ణములవారు నిత్య నైమిత్తికాది సమస్త కర్మ సిద్ధికొరకును, ఆత్మరక్షణకొరకును, గృహస్థాశ్రమ సిద్ధికొరకును, గృహము కట్టుకొనవలెను. గృహనిర్మాణవిధితద్బాహ్యాభ్యంతర లక్షణములు, ఇష్టానిష్టఫలములు, ఆశ్వలాయన సూత్రమునందు చెప్పబడియున్నవి. ఆసూత్రమును చూచి బాగుగ తెలిసికొని గృహమును కట్టుకొనవలెను.

జ్యోతిశ్శాస్త్రోక్త సంశుద్ధముహూర్తేతు శుభేదినే।
స్వసూత్రామ్నాతమంత్రైను సారేణైవ యథావిధి॥ ౫౫౦॥
ఖనిత్రైఃఖానయిత్వా తాఙ్హరేత్పాంసూనదూహనైః।
కపాలాంగార భస్మాస్థితుషకాష్ఠోపలాదికాన్॥ ౫౫౧ ॥
ఉచ్చావచాంశ్చతత్రస్థాన్ కశ్మలాంశ్చ సముద్వసేత్ ।

పంచాంగశుద్ధిదివమున స్వసూత్రోక్తమంత్రములచే యథావిధిగాగడ్డపారలతో భూమినిత్రవ్వి భూమియందు ఉన్నమట్టి, పెంకులు, బొగ్గులు, బూడిద, ఎముకలు, ఊక, కట్టెలు, రాళ్లు మొదలగు వానినన్నింటిని తీసి పారవేసి గృహమునుకట్టుకొనవలెను.

## గృహ ప్రవేశము

యథాధికారం నిర్మాయగృహాణి స్వర్చితానిచ॥ ౫౫౨ ॥
స్వలంకృతానిసర్వోప కరణైస్సహితానిచ।
సర్వధాన్యాన్వితాన్యేవ సహామాత్యాగ్నిబంధుభిః॥ ౫౫౩ ॥
సభార్యఃప్రవిశేత్తత్ర స్థాపితౌపాసనానలే।
అగ్నిమిధ్వాజయాద్యంతం కుర్యాద్బ్రాహ్మణభోజనం॥ ౫౫౪ ॥

అధికారానుసారముగా గృహమును కట్టి అలంకృతము, సర్వోపకరణ సహితము, సర్వధాన్యసమన్వితము, అగు గృహమునందు, బంధువులతోను, అమాత్యులతోను, అగ్నులతోను, కూడా భార్యాసహితుడై ప్రవేశించవలెను. అనంతరము ప్రతిష్ఠితౌపాసనాగ్నియందు అగ్నీంధనాది జయాద్యంతమువఱకు , చేసి బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను.

నూతనం గృహనిర్మాణం కర్తవ్యం మంత్రవత్తథా ।
జీర్ణాన్యపిగృహాణ్యేవం నవీకృత్య ప్రవేశయేత్॥ ౫౫౫ ॥

నూతనగృహము సమంత్రకముగా కట్టవలెను. జీర్ణగృహములను సమంత్రకముగానే బాగుచేయించి ప్రవేశించవలెను.

## సర్పబలికాలము

శ్రోణానక్షత్రాన్వితాపౌర్ణమాసీ
తస్యాంకార్యం సర్పబల్యాఖ్యకర్మ ।

మార్గేణర్క్షేణాన్వితామార్గశీర్షీ
తస్యామస్యోత్సర్జనం కార్యమేవ॥ ౫౫౬ ॥
ద్వైతిథ్యప్రాప్తే కిన్నుకాలేభవేత్తాం
ముఖ్యానోచేదప్యథైకర్మణి స్తః।
తత్రస్నుషతే ర్నియుక్తాంనచేత్తాస్య
త్కార్యంతస్యాం పౌర్ణమాస్యామవశ్యం॥ ౫౫౭ ॥
తన్నక్షత్రైర్నోత్తరాపౌర్ణమాసీ
యుక్తాచేత్తాస్యత్రత్సర్పబలికర్మకుర్యాత్।
ప్రాప్తేశౌచే పుష్పవత్యాం చపత్న్యాం
స్నానాంతేవాసూతికాంతేపివాహః॥ ౫౫౮ ॥
ఆగామిన్యాం పౌర్ణమాస్యాంతువాపి
కర్తవ్యంసాంవత్సరే వాన కేపి॥
కాలాతీతాగ్రయణం చాష్టకాఖ్యం
కార్యంపూర్వేమాసినిత్యక్రియాత్వాత్॥ ౫౫౯ ॥

శ్రవణనక్షత్రముతో కూడిన పూర్ణిమనాడు సర్పబలిని మృగశీర్షానక్షత్రయుక్తమగు పూర్ణిమనాడు సర్పబల్యుత్సర్జనమును చేయవలెను. సర్పబలియందును, తదుత్సర్జనమునందును ముఖ్యములగు పూర్ణిమానక్షత్రములు ఉండకపోయినచో కేవలపూర్ణిమనాడే సర్పబలిని ఉత్సర్జనమును చేయవలెను. ఒకవేళ ముందు మాసమునందు పూర్ణిమ శ్రవణనక్షత్రముతోగాని, మృగశీర్షానక్షత్రముతోగాని, కూడుకొనిన యెడల, పూర్ణిమనాడు తిరిగి సర్పబలిని ఉత్సర్జనమును చేయవలెను. ఆశౌచము వచ్చినప్పుడు సూతకాంతమునందును భార్యబహిష్ఠఅయిన యెడల స్నానదినమునందును లేక ముందుపూర్ణిమనాడుగాని, చేయవలెను ప్రతిసంవత్సరమునందును సర్పబలి చేయవలెను. కాలాతీతమగు అగ్రయణము అష్టకాశ్రాద్ధము. నిత్యము లగుటవలన ముందుమాసమునందు చేయవలెను.

## సర్పబలి

సర్పస్థాలీపాకహోమేగ్ని ఆజ్య
భాగాంతేగ్నిశ్శ్రావణీపౌర్ణమాస్యాం।

ఇత్యేతే ద్వే దేవతే హి ప్రధానే
    స్థాలీపాకాచ్చావదాయ క్రమేణ॥ ౫౬-౦ ॥
పైశాకస్యాహుతేస్తత్ర పలాశ
    పుష్పాణిస్యుస్త్రిత్వమాదీనిచాథ।
స్థాలీపాకాత్త్రింశుకేభ్యో యదస్య
    మంత్రేణాస్యాస్స్విష్టకృత్తజ్జయాంతే॥ ౫౬-౧ ॥
మార్గశీర్ష్యామేవమగ్ని మార్గశీర్షీ చదేవతే।
పలాశపుష్పహోమస్స్యాద్ద్వయోర్బ్రాహ్మణభోజనం॥ ౫౬-౨ ॥
ఆమార్గశీర్ష్యాః ప్రతివాసరం బలిం
    హర్తేన్నకర్తుం యదిశక్యతే స్వహాం।
సృష్టిక్షయాభ్యాం ప్రగణయ్య వాసరాం
    స్తావాహరేత్తత్ర చ తావతో బలీన్॥ ౫౬-౩ ॥
సప్తర్ష్యగ్నియమా శ్రానమాపిశాం ప్రోష్టకాన్సహ।
ముఖాహుత్యన్తం హవిషోవదానాద్ధర్మతోగ్రితః॥ ౫౬-౪ ॥
తతః ప్రధానాహుతయస్తతస్స్విష్టకృదుచ్యతే।
బర్హిస్సమంజనం చైషు కార్యాః పరిధయో బుధైః॥ ౫౬-౫ ॥

అగ్నియు, శ్రావణీపూర్ణిమయు సర్పబలి స్థాలీపాకమునందు ప్రధాన దేవతలు. అగ్నింధనాదిముఖాహుత్యంతమునందు అవదానధర్మముగాహవిస్సును గ్రహించి, ప్రధాన హోమమును చేసి, “జగ్ధోమశకః„ ఇత్యాది మూడు మంత్రములచే మోదుగపువ్వులను హోమము చేసి,జయాద్యంతమునందుహవిశ్శేషము చేతను, మోదుగపువ్వులచేతను “యదస్యకర్మణః„ అను స్విష్టకృన్మంత్రముతో స్విష్టకృద్ధోమమును చేయవలెను. సర్పబల్యుత్సర్జనమునందు అగ్నియు, మార్గశీర్ష పూర్ణిమయు దేవతలు. సర్పబలియందు వలె నీఉత్సర్జనమునందు గూడపలాశపుష్పహోమము చేయవలెను. సర్పబల్యుత్సర్జనములయందు బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. శ్రావణపూర్ణిమ లగాయతు మార్గశీర్ష పూర్ణిమవఱకు ప్రతిరోజు నను బలులన్ను వేయుటకు వీలులేక పోయిన [illegible]పూర్ణిమ లగాయతు మార్గశీర్ష పూర్ణిమ వఱకు గల దినములను లెక్కించి, మార్గశీర్ష [illegible] నాడు అన్ని బలులను వేయవచ్చును

సర్పబలి, ఆగ్రయణము, ఈశానబలి, మాసిశ్రాద్ధము అష్టకాశ్రాద్ధము, ఈకర్మలయందు ముందుగా ముఖాహుతియు అనంతరము ప్రధానహోమములు, పిమ్మట స్విష్టకృద్ధోమము, చేయవలెను. పూర్వోక్తకర్మలయందు బర్హిస్సంయోజనము చేయవలెను. ఈకర్మలయందు పరిధులను వేయవలెను.

## ఆగ్రయణము

సవ్రీహిభిః పక్వశీనూతనైశ్చర
ద్యాగ్రయణం కార్యమనాహితాగ్నిభిః।
ఔపాసనాగ్నౌ హవిషిప్రతిష్ఠితా
భిఘారణాంతేస్మిన్ముఖాదిచక్షుషీ॥ ౧౬౬ ॥
హుత్వాస్థాలీపాక తోగ్నిగ్నయేత
డింద్రాగ్నిభ్యాం విశ్వదేవేభ్యఏభ్యః।
ద్యావా పృథివీభ్యామథస్విష్టకృతాస్య
చ్ఛేషాన్నాద్యాప్రాశనం తండులానాం॥ ౧౬౭ ॥
వికల్పద్వయమత్రోక్తం దేశధర్మవ్యవస్థయా।
అగ్నింస్విష్టకృతం చాంతరేణేత్యగ్నిస్తులభ్యతే॥ ౧౬౮ ॥
స్యాత్స్విష్టకృచ్చతుర్థాభ్య ఇతిసోమంవిసేతరాః।
తస్మాదాగ్రయణేప్రోక్తాః పంచైతాశ్చరుదేవతాః॥ ౧౬౯ ॥
అగ్నిశ్చేంద్రాగ్నీచ విశ్వేచదేవా
ద్యావాపృథివీ స్విష్టకృచ్చప్రధానాః।
ఆచార్యైస్సంప్రోదితా స్తండులానాం
శబ్దాత్పక్వం నాద్రియంతేత్రకేచిత్॥ ౧౭౦ ॥

అనాహితాగ్ని ఆశ్వయుజపూర్ణిమనాడుగాని, కార్తికపూర్ణిమనాడుగాని నూతన ధాన్యములతో ఆగ్రయణము చేయవలెను. హవిస్సు అగ్నియందు ఉంచి, దింపి, అభిఘరించిన పిమ్మట అగ్నీంధనాద్యాజ్యభాగాంతమువగదు. స్థాలీపాక చరువులను ముందుగా ముఖాహుతినిచేసి, ఇంద్రాగ్నిభ్యాగ్ స్వాహా, విశ్వేభ్యోదేవేభ్యస్స్వాహా, ద్యావాపృథివీభ్యాగ్ స్వాహా, అగ్నయే స్విష్టకృతేస్వాహా, అను నాలుగుహోమములను చేసి బర్హిస్స

మంజనాది తంత్రశేషమును సమాప్తి పొందించవలెను. అనంతరము హవిశ్శేషమును గాని తండులములను గాని, భక్షించవలెను అని వికల్పద్వయము చెప్పబడినది. "అగ్నిగ్ స్విష్టకృతంచాంతరేణ" ఆప గృ-౭-౨౫॥ అను సూత్రము వలన అగ్నియు "స్విష్టకృచ్చతుర్థాభ్యః" ఆప గృ-౧౯-౭॥ అను సూత్రము వలన శ్యామాకాగ్రయణ దేవత యగు సోముడుగాక ఇతరులగు ఇంద్రాగ్నులు, విశ్వేదేవులు ద్యావాపృథివ్యులు, అగ్నిస్విష్టకృత్తు అను నలుగురును దేవతలును, ఆగ్రయణమునందు ఐదుగురును ప్రధానదేవతలు అని చెప్పబడుచున్నారు "తండులానాం ముఖంపూరయిత్వా" ఆప-గృ-౧౯-౭॥ అను ఆపస్తంబ సూత్రమందలి తండులశబ్దము వలన పక్వమును తినగూడదని కొందరు చెప్పుచున్నారు.

ఈశాన బలి

ఉపాధ్యాయోపా కర్మవేదవ్రతాని
పాలాశార్చా బ్రహ్మయజ్ఞోత్రముఖ్యాః।
ఈశాన్యాఖ్యా దీనికర్మాణ్యుదీచ్యాం
ప్రాచ్యాం వైశాన్యాంచ కార్యాణిపుర్యాః॥ ౫౭౧॥

ఉపాకర్మ, వేదవ్రతములు, పాలాశకర్మ, బ్రహ్మయజ్ఞము, ఈశానబల్యాదికర్మలు గ్రామమునకు ఉత్తరదిక్కునగాని, ఈశాన్య దిక్కునగాని, ప్రాగ్దిక్కున గాని చేయవలెను.

ఉదగ్గతేర్కే సతిపౌర్ణమాస్యా
మీశానబల్యాహ్వయకర్మకార్యం।
సహోత్తరౌపాసనమత్రహుత్వా
పత్న్యౌపసహౌపాసన ఏకదేశం॥ ౫౭౨॥
వహ్నింగృహీత్వాదిశి తత్రగత్వా
యత్రక్వచాగ్నింప్రభృతీహాకృత్వా।
హోమాయుచ బ్రాహ్మణభోజనార్థం
పక్త్వాచరుంబర్హిషిసాదయిత్వా॥ ౫౭3 ॥
స్థలాంతరేర్థా దిహలౌకికేగ్నౌ
తంక్షైత్రపత్యం చరుమత్రకృత్వా।

ద్వేద్వేపరిష్యన్వాం తఇతీహామధ్యే,
స్యాద్ద్వే సమశ్నంత ఉపేత్రియా మే
ద్వేద్వేపరిదద్యా ద*థ చైతదంతం॥ ౧౮౭ ॥
స్యాద్దక్షిణస్యాం దిశి దేవసేనా
మంత్రేణపర్ణా నిదశౌదనాత్స్వాత్।
యాఃఆఖ్యాతాయా శ్చవామంత్రిణోత్ర
దత్తైవపర్ణాన్యపి దక్షిణస్యాం॥ ౧౮౮ ॥
స్వదాస్వరాపోప స్ప్రశేత్యేవపక్షే
స్వదాస్వరాపి త్వుత్తరస్యాంచపక్షే।
ద్వాసుధ్యేన్వా సారిణచ్చైతిపర్ణే
ద్వేపర్ణేస్యా ద్దక్షిణస్యాంనిమం॥ ౧౮౯ ॥
తద్ధోమబలిశేషేభ్య స్త్రిభ్యోన్నేభ్యఃకృతంతథా,
పిండంశిక్యస్థాపయిత్వా తస్మిన్ప్రక్షేపరిలంబయేత్॥ ౧౯౦॥
గవాంపథిక్షేత్ర పతేశ్చభూమా
వాత్వావహాంత్వా వహానంచకృత్వా,
పర్ణానిచత్వార్యపి సప్తవాస్యా
మానాద్యభూమౌచ బలింపరిదద్యాత్॥ ౧౯౧ ॥
తంక్షేత్రపతయేత్వాతు దదామీతిదదాత్యథ,
స్యాత్క్షేత్రపతయేస్వాహేత్యే కేథార్చనమాచరేత్॥ ౧౯౨॥
స్థాలీపాకంబ్రాహ్మణా న్భోజయిత్వా
తేషాశ్నంతిక్షైత్రపత్యంసపిండాః।
యద్వాకుర్యా ద్వంశధర్మానుసారా
దాదాయాగ్నిం సంసృజేద్గేహమేత్య॥ ౧౯౩ ॥

---

* దథ చైతదంత మితిపాఠాంతరం

అనంతరము ముఖాహుతిని చేసి 'భవాయదేవాయస్వాహా' ఇత్యాది ఎనిమిది మంత్రములచే ఈశానోదనమువలన హోమముచేసి, తర్వాత "భవస్యదేవస్యపత్న్యైస్వాహా" ఇత్యాది ఎనిమిది మంత్రములతో మీఢుష్యోదనము నుండి హోమముచేసి అనంతరము 'జయంతాయస్వాహా' అనుమంత్రముతో జయంతభాగమునుండియు, హోమముచేసి, ఓదన త్రయోత్తరార్ధమునుండి గ్రహించి "అగ్నయేస్విష్టకృతేసుహుతహుతే" యనుమంత్రముచే స్విష్టకృద్ధోమమును చేసి ఈశానుని అగ్నిని "స్వస్తినః పూర్ణముఖః" అనుమంత్రముతో సేవించవలెను. బర్హిస్సమంజనము ఈశానాగ్న్యుపస్థానమునకు పూర్వమునందు ఐనను పరమునందైనను చేయవచ్చును. పరిషేచనాంతమునందు యజ్ఞాగ్న్యాత్మకముల ఆకుల యందు వాటి వాటిఓదనమునుండి అన్నముగ్రహించి ప్రతిదేవతకు ఒక్కొక్కమంత్రముతో రెండేసి రెండేసి ఇవ్వవలెను. ముందుగా "గృహాపోపస్పృశ" అను మంత్రముతో దక్షిణపు పాకయందు ఈశానోదనపూర్ణపర్ణద్వయమును ఈశానునకును, అనంతరము "గృహ్యస్పృశ" అను మంత్రముతో ఉత్తరపు పాకయందు మీఢుష్యోదనపూర్ణపర్ణద్వయమును మీఢుషికిని, రెండుపాకలమధ్యయందు "ఘోషిణఉపస్పృశ" అను మంత్రముతో జయంతోదనపూర్ణపర్ణద్వయమును జయంతునకు ఇవ్వవలెను. తర్వాత "శ్వాసినః" అను మంత్రముతో దక్షిణపుపాకయందు రెండుపర్ణములను, "విచిన్వంతః" అనుమంత్రముతో ఉత్తరపుపాకయందు రెండుపర్ణములను "ప్రపున్వంతఉపస్పృశత" అనుమంత్రముతో రెండుపాకలమధ్యయందు రెండుపర్ణములను ఉంచి, తిరిగి "సమశ్నంతః" అనుమంత్రముతో దక్షిణపు పాకయందు రెండు పర్ణములను ఉంచవలెను. ఇంతవఱకు రెండేసి పర్ణములు ఉంచవలెను. అనంతరము దక్షిణపుపాకయందు "దేవసేనాః" అను మంత్రముతో ఈశానోదనపూర్ణములగు పదిఆకులను, "యాఆఖ్యాతా" అనుమంత్రముతో పదిఆకులను, "ద్వారాపోపస్పృశ" అనుమంత్రముతో రెండుఆకులను ఉంచి, అనంతరము "ద్వారాపి" అనుమంత్రముతో మీఢుష్యోదనపూర్ణములగు రెండు పర్ణములను ఉత్తరపుపాకయందును, "అన్వాసారిణః" అనుమంత్రముతో రెండుపాకలమధ్యయందు జయంతోదనపూర్ణములగు రెండుపర్ణములను ఉంచవలెను. అనంతరము "నిషంగిన్" అనుమంత్రముతో ఈశానోదనపూర్ణములగు రెండు పర్ణములను తిరిగి దక్షిణపుపాకయందుంచవలెను. ఓదనత్రయమునుండి హోమము, బలులు, అవగా మిగిలిన అన్నమును గ్రహించి పిండమునుచేసి ఉట్టిలోపెట్టి "నమోనిషంగిన్నిషుధిమతే" అనుమంత్రముతో ఏదియైన ఒక చెట్టునందు వ్రేలాడ కట్టవలెను. అనంతరము గోవులు వెళ్లు మార్గమునందు భూమిమీద క్షేత్రపతిని "ఆత్వావహంతు" అనుమంత్రముతో ఆవాహనము చేసి, నాలుగుపర్ణములయందు గాని ఏడు పర్ణములయందు గాని క్షేత్రపత్యోదనమునుండి గ్రహించి క్షేత్రస్యపతయేత్వాం

హైకామస్యాం త మనారంభో వేతి కాత్యాయనో * బ్రవీత్।
శ్రౌతస్యా నధి కారత్వా త్స్మార్తే తు కిముతా త్ర తు॥
అన్యత్రై వం న జీవంత మతి దద్యా ది తీ రణాత్।

" జీవత్పితృకస్యహోమాంతకనారంభోవా" జీవపితహోమాంతవరకు చేసి మాని వేయవలెను. లేదా ఆరంభము నే చేయకూడదు అని కాత్యాయనుడు చెప్పియుండ్చా ను శ్రౌతమునందు అధికారి కానప్పుడు స్మార్తమునందు అధికారి కాడనుట కైముత్తిక న్యాయసిద్ధము. " నజీవంతమతిదదాతి " అని గ్రంధాంతరములయందు చెప్పబడుటవలన జీవ పిత పిండపితృ యజ్ఞము చేయగూడదు.

మాసి శ్రాద్ధాధికారులు

మాసి శ్రాద్ధే జీవపితు ర్నాధికార స్మృతః క్వచిత్॥ ౧౧౯॥
మాసి శ్రాద్ధే చాష్టకా శ్రాద్ధకల్పే
సంస్థా మాసే ష్వతి జీవత్పితు స్స్యా।
వృద్ధే రస్య శ్రాద్ధ కర్మా ధికారా
భావా త్తాతే చే న్మృతే త్రా ధికారః॥౧౨౦॥

జీవపితకు మాసి శ్రాద్ధాధికారము ఎచ్చటను చెప్పబడలేదు. అష్టకా శ్రాద్ధతుల్య ము సంస్థామాసి శ్రాద్ధమునందు జీవపితకు అధికారము లేదు. తండ్రి జీవించియున్నను నాందీశ్రాద్ధము చేయవచ్చును. తండ్రి మరణించినయెడల మాసి శ్రాద్ధాధికారియగును.

మాసి శ్రాద్ధ కాలము

మాసి శ్రాద్ధస్య పరే పక్ష ఏవా
మావాస్యో పాంతే పరాహ్ణౌత్ర ముఖ్యః।
పక్షత్యా ద్యా దర్శ పర్యంత ఘస్రా
ఇష్టా నిష్టా ధానా స్విత్రా స్త్వేవ దిష్టాః॥ ౧౨౧ ॥
దర్శో ద్వాదశ్య ష్టమీ వై తృతీయా
శ్రేష్ఠా స్తేషాం వాసరాణాం చ మధ్యే।

* మునిరితిపాఠాంతరం

అసా మన్యా నిందితా దోషయుక్తా
శ్రాద్ధా యోగ్యా స్సర్వదా వర్జనీయాః॥ ౫౯౯ ॥
శ్రద్ధావాం శ్చే చ్ఛ్రాద్ధ కృ ద్య స్సమృద్ధో
మావాస్యాయాం .వాసరే న్యత్ర కుర్యాత్।
సంస్థా మాసి శ్రాద్ధ కృ ద్ద్రవ్య హీనో
మావాస్యాయా మేవ కుర్వీత నూనం॥ ౬౦౦ ॥

అమావాస్యోపాంతదినమున అపరాహ్ణకాలమునందు మాసి శ్రాద్ధమునకు ముఖ్యము. పాడ్యమి మొదలుకొని అమావాస్య వఱకుగల దినములు ఇష్టానిష్ట ఫలప్రయోజనాన్వితములని చెప్పబడినవి. ప్రతిపత్తులగాయతు అమావాస్యకొఱకుగల దినములలో తదియ, అష్టమి, ద్వాదశి అమావాస్య, అను దినములు శ్రేష్ఠములు. ఇవిగాక మిగిలినదినములు శ్రాద్ధయోగ్యములుకానందున విడువతగినవి. శ్రాద్ధకర్త, ద్రవ్యవంతుడు, శ్రద్ధగలవాడు, అయినయెడల అమావాస్యనాడుగాని, ఇతరదినములయందుగాని, మాసి శ్రాద్ధమును చేయవచ్చును. శ్రాద్ధకర్త ద్రవ్యహీనుడైన యెడల అమావాస్యనాడే మాసి శ్రాద్ధమును చేయవలెను.

దర్శశ్రాద్ధావశ్యకత

న నిర్వపతి యశ్శ్రాద్ధం ప్రమీతపితృకో ద్విజః।
ఇందుక్షయే మాసి మాసి ప్రాయశ్చిత్తీయతే హి సః॥ ౬౦౧
ఇత్యాహ వ్యాఘ్రపాదోథ మను రప్యేవ మాహ సః।
నిత్య యజ్ఞం తు నిర్వర్త్య విప్రశ్చంద్రక్షయే గ్నిమాన్॥
పిండాన్వాహార్యకం శ్రాద్ధం కుర్యాన్మాసానుమాసికం।
పిండాన్వాహార్యకం శ్రాద్ధం క్షీణే రాజని శస్యతే॥ ౬౦౩ ॥
వాసరస్య తృతీయాంశే నాతిసంధ్యా సమీపతః।
ఇతి కాత్యాయనః ప్రాహ మావాస్యా విషయే ప్రతతు॥ ౬౦౪॥
అమావాస్యాయాం పితృభ్య ఇతి గౌతమ ఉక్తవాన్।
తస్మా ద్దర్శే పితృయజ్ఞ పూర్వకం శ్రాద్ధ మాచరేత్॥ ౬౦౫॥
మృతపితరుడు ప్రతిమాసామావాస్యయందును దర్శశ్రాద్ధమును చేయనివాడు ప్రా

యశ్ప్రస్తము చేసికొనవలెను. అని వ్యాఘ్రపాదుడు చెప్పుచున్నాడు. ఆహితాగ్నియగు ద్విజుడు ప్రతి అమావాస్యనాడు పిండపితృయజ్ఞమును జరిగించి దర్శశ్రాద్ధమును చేయవలెనని మనువు చెప్పియున్నాడు. అమావాస్యనాడు దివస తృతీయభాగమున దర్శశ్రాద్ధమును చేయవలెను అని కాత్యాయనుడు చెప్పియున్నాడు. "అమావాస్యాయాం పితృభ్యో దద్యాత్" గౌ. సూ. ౧౫-౨॥ అమావాస్యనాడు పితరులకు శ్రాద్ధమును చేయవలెను. అని గౌతమమహర్షి చెప్పియున్నాడు. అందుచేతను పిండపితృయజ్ఞమును చేసి దర్శశ్రాద్ధమును చేయవలెను.

## బ్రాహ్మణనిమంత్రణము

తత్పూర్వేద్యుస్స్నాయ మౌపాసనాం తే
ప్రాచీనావీత్య తచ్చాసూన్నియమ్య।
శ్వో మాసి శ్రాద్ధం కరిష్యేథ విప్రాన్
ద్వౌ దైవే త్రీన్పిత్ర్య ఆమంత్రయేత॥ ౬౦౬ ॥
శ్రాద్ధాహే వా మంత్రయేతి ప్రభాతే
శుద్ధాన్ వధ్యాత్మా సమ్యగాచార శీలాన్।
శ్రాద్ధార్హాన్ జ్ఞానినో యోనిగోత్ర
మంత్రాసంబంధానయుగ్మాన్వరాం స్త్రీన్॥ ౬౦౭ ॥
ఇత్యాచార్యః ప్రాహ ముఖ్య గౌణ పక్షౌ తథా మనుః।
ద్వౌ దైవే పితృ కార్యే త్రీనేకైకముభయత్రవా॥ ౬౦౮ ॥
భోజయేత్సు సమృద్ధోపి శ్రాద్ధే కుర్యాన్న విస్తరం।
ఇత్యుక్త్వా న్నారదోపి సప్తమస్కంద ఏవహి॥ ౬౦౯ ॥
ద్వౌ దైవే ప్రాక్త్రయః పిత్ర్యే ఉదగేకైకమేవ వా।
మాతామహానామప్యేవం తంత్రం వా వైశ్వదైవకం॥
ఇత్యుక్తం యాజ్ఞవల్క్యేన సహ మాతామహైరపి।
మాతామహస్య శ్రాద్ధాధికారే చే దేవ మేవ హి॥ ౬౧౦ ॥
అష్టకాసు చ వృద్ధౌ చ గయాయాం చ మృతేహాని।

మాతుశ్శ్రాద్ధం పృథక్కుర్యా దన్యత్ర పతినా సహ॥ ౬౧౨॥
ఇతి వాక్యా ద్దర్శ కృష్ణ పక్షా దిష్వపి భోజనే
పిత్రాదయ స్సపత్నీకాః పిండ దానే పృథ క్పృథక్॥ ౬౧౩॥
వక్తవ్య మన్యత్ర హి యత్ర మాతృ
శ్రాద్ధం పృథ గ్ద్వి ద్వి పితేతి సూత్రాత్।
కర్తుః పితు ర్వా పి పితామహస్య
ద్విమాతరౌ వా యది సంతి బహ్వ్యః॥ ౬౧౪॥
ద్విత్వే బహుత్వే పి చ విప్ర ఏక
శ్శ్రాద్ధే తు సంభోజయితవ్య ఏవ।
ద్విత్వే బహుత్వే పి విభక్తిరూహ్య
మంత్ర స్థలింగాదిక మే* వనో హేత్॥ ౬౧౫॥
ఉదీరితా ముశంత స్త్వా హే చే హే తి తిలో సి చ।
మంత్రా స్త్వనూహితా హ్యేతే సర్వేషు శ్రాద్ధ కర్మసు॥ ౬౧౬॥
ఇదం వాం మాతరౌ పాద్యం పాద్యం వో మాతర స్త్విదం।
ఇదం వాం మాతరౌ చార్ఘ్యం ఇదం వో ర్ఘ్యంతు మాతరః॥
ఏవం పితామహీ ప్రపితామహ్యో రేవం విని ర్దిశేత్।
ఏత ద్వాం మాతరౌ దాయ్యా గోత్రే రూపే యువామను॥
ఏత ద్వో మాతరో దాయ్యా గోత్రా రూపా యుష్మా సను।
ఇతి మంత్రేణ దాతవ్యః పిండ స్త్వేక స్తు సర్వదా॥ ౬౧౭॥
మహాలయా మావాస్యా ది శ్రాద్ధే ష్వేవం విధీయతే।
భోజయే చ్చ సపత్నీకా న్దేయాః పిండాః పృథ క్పృథక్॥ ౬౨౦॥
త్రీ న్వా వర్గేషు త్రిషు శ్రోత్రియా న్ద్వౌ
లభ్యేతే చే త్స్థండిలం వైశ్వదేవే।

---

* ఏవనోహేత్ ఇతి పాఠాంతరం

శ్వో మాసి శ్రాద్ధమునగా తొలినాటి సాయంసంధ్యోపాసనము చేసికొని, ప్రాచీనావీతియై ప్రాణాయామము చేసి, “ శ్వోమాసి శ్రాద్ధం కరిష్యే ” అని సంకల్పించి, వైశ్వదేవస్థానమునందు ఇద్దరిని, పితృస్థానమునందు ముగ్గురిని, బ్రాహ్మణులను నిమంత్రించవలెను. శ్రాద్ధదినమున ప్రాతఃకాలమునందైనను బ్రాహ్మణ నిమంత్రణము చేయవచ్చును. శుద్ధులు, అధ్యయనసంపన్నులు, కర్మానుష్ఠాననిరతులు, జీవపితరులు, జ్ఞానులు, యోనిగోత్రమంత్ర సంబంధ రహితులు, అగు బ్రాహ్మణులు శ్రాద్ధములందు ముఖ్యులు. అని ఆపస్తంబుడు ముఖ్యపక్షమును చెప్పియున్నాడు, మనువు ముఖ్యపక్షమును, గౌణపక్షమును కూడ చెప్పియున్నాడు. వైశ్వదేవస్థానమునందు యిద్దరిని పితృస్థానమునందు ముగ్గురిని నిమంత్రించవలెనని నారదుడు భాగవతప్రథమస్కంధమున చెప్పియున్నాడు. విశ్వదేవస్థానమునందు ఇద్దరిని, పితృస్థానమునందు ముగ్గురిని లేక రెండుస్థానములయందు ఒక్కొక్కనినైనను పిలువవలెను. మాతామహస్థానమునందు కూడ ఇట్లే పిలువవలయును. బ్రాహ్మణాలాభమునందు వైశ్వదేవస్థానమున పాత్రనుంచి పితృస్థానవిధానముగా (యద్యేకం భోజయేచ్ఛ్రాద్ధే దైవం తత్ర కథం భవేత్ । అన్నం పాత్రే సముద్ధృత్య సర్వస్య ప్రకృతస్య చ । దేవతాయతనే కృత్వా తతః శ్రాద్ధం ప్రవర్తయేత్ । ప్రాస్యేదన్నం తదగ్నౌ తు దద్యాద్వా బ్రహ్మచారిణే॥ ఒక బ్రాహ్మణుడు దొరికినయెడల వైశ్వదేవస్థానమునందట్లనగా విశ్వదేవస్థానమునందు ఒక పాత్రనుంచి, అన్నమును ఆపాత్రయందుంచి, దేవాలయమునందుంచి, ఆనంతరము శ్రాద్ధము జరిగించవలెను. పిదప అగ్నియందు హోమము చేయవచ్చును. లేక బ్రహ్మచారికి పెట్టవచ్చును. ) తంత్రమును చేయవచ్చును. అని యాజ్ఞవల్క్యుడు చెప్పియున్నాడు. మాతామహశ్రాద్ధాధికారి అయినవాడు మాతామహులకుకూడ శ్రాద్ధము చేయవలెను. అష్టకాశ్రాద్ధము, నాందీశ్రాద్ధము, గయాశ్రాద్ధము, ప్రత్యాబ్దికశ్రాద్ధము, వీట్లయందు మాతృశ్రాద్ధమును వేరుగా చేయవలెను. ఇతరత్ర భర్తతో కలపవచ్చును '' అనువచనమువలన దర్శయందును మాసి శ్రాద్ధమునందును పితరాదులను సపత్నీకులనుగా చెప్పి పిండప్రదానమును వేరువేరుగా చేయవలెను. మాతృశ్రాద్ధము వేరుగా చేయవలెను అని చెప్పు వచనములు దర్శాదిశ్రాద్ధేతర విషయములని యెరుంగవలెను. “ యదిస్వపితా స్యాత్ '' । ఆప- శ్రౌ-౧-౯-౭॥ అనుసూత్రమువలన కర్తకుగాని, కర్తృపితరుగాని, పితామహునకుగాని, ఇద్దరుగాని, ముగ్గురుగాని, తల్లులున్నను, ఒక బ్రాహ్మణునే నిమంత్రించి భుజింపచేయవలెను. ఇద్దరుగాని, ముగ్గురుగాని ఉన్నయెడల విభక్తిని ఊహించవలెనుగాని మంత్రస్థలములగు విభక్త్యాదికమును ఊహించకూడదు. ఉపేరతాం ఉశంతస్త్వా, యేచేహ, తిలోసి, యనుమంత్రములను సమస్తశ్రాద్ధములయందు ఊహించకయే చెప్పవలెను. ఇద్దరు తల్లులు ఉన్నయెడల “ ఇదం వాం మాతరౌ పాద్యం '' యని పాద్యమునందును “ ఇదం వాం మాతరౌ అర్ఘ్యం, యని అర్ఘ్యప్రదానము

నంబును, ఏతద్వాం మాతరౌదాయ్యాగోత్రి, రూపేయంవామను,అని పిండప్రదానమునందును, ముగ్గురున్నయెడల " ఇదంవోమాతరఃపాద్యం " యని పాద్యమునందును, ఇదంవోమాతరఃఅర్ఘ్యం, యని అర్ఘ్యప్రదానమునందును, ఏతద్వోమాతరఃదాయ్యాః, గోత్రిరూపాయూష్మన్నను, అని పిండప్రదానమునందు విభక్తిని ఊహించి ఒక పిండమును మాత్రమే ఇవ్వవలెను. ఇట్లనే పితామహీప్రపితామహీలు ఇద్దఱుగాని, ముగ్గఱుగాని ఉన్నయెడల విభక్తిని ఊహించి చెప్పవలెను. మహాలయామావాస్యాదులయందు ఇట్లువిధించబడియున్నది పితరులను సపత్నీకులనుగాచెప్పి ఒకబ్రాహ్మణునకేపెట్టి పిండప్రదానముమాత్రము వేఱువేఱుగాచేయవలెను. ముగ్గురుబ్రాహ్మణులు దొరికిన యెడల మూడు స్థానములయందును ఇద్దఱుదొరకినయెడల పితృమాతామహస్థానములయందు కూర్చుండచేసి వైశ్వదేవస్థానమునందు స్థండిలకల్పనచేసి శ్రాద్ధమును జరిగించవలెన

## శ్రాద్ధదినమున వైశ్వదేవాదినిర్ణయము

ఉక్తే కాలే జ్ఞాపితా స్సర్వ్యమే హ్నా
స్నానార్థం ప్రస్థాపయిత్వా థ కర్తా॥ ౬౨౧ ॥
అప్సు స్నాత్వా ధౌత శుక్లాంబర స్స
న్మృద్వా భస్మా దీని ఫాలేన ధృత్వా।
శ్రాద్ధా ర్థాన్యే నోదనైవ వైశ్వ నై
దేవం యజ్ఞా న్పంచ దేవార్చనాంతం॥ ౬౨౨ ॥
కృత్వా దర్శే చే త్తతః పిండయజ్ఞం
కృత్వా దర్శ శ్రాద్ధ మేవా రభేత।
ఏవం హ్యాప స్తంబిభి శ్చాగ్నిమద్భి
ర్దర్శే కర్తవ్యాః క్రియాః క్వా పిదృష్టాః॥ ౬౨౩ ॥
పక్షాంతం కర్మ నిర్వర్త్య వైశ్వదేవం తతో గ్నిమాన్।
పిండయజ్ఞం తు నిర్వర్త్య తతో న్వాహార్యకం బుధః॥ ౬౨౪ ॥
పక్షాంత కర్మా న్వాధానం వైశ్వదేవం పితృక్రతుః।
అన్వాహార్యం నామ దర్శ శ్రాద్ధం చాయం క్రమ స్స్మృతః॥

మధ్యాహ్నకాలమున బ్రాహ్మణులను స్నానార్థముపంపి కర్త స్నానముచేసి ధౌత వస్త్రముసు ధరించి మృత్తికనుగాని, భస్మముగాని ఫాలభాగమున ధరించి, పృథక్పాకముచే వైశ్వదేవము పంచమహాయజ్ఞములు దేవతార్చనములనుచేసి దర్శశ్రాద్ధమును చేయదలచినయెడల దేవతార్చనానంతరము పిండపితృయజ్ఞమును చేసి, అనంతరము దర్శశ్రాద్ధమును జరిగించవలెను. ఇట్లు ఆహితాగ్నికి దర్శయందు చేయదగిన కర్మ క్రమము స్మృతులయందు చెప్పబడినది పక్షాంతకర్మనుచేసినతర్వాత వైశ్వదేవమును తదనంతరము పిండపితృయజ్ఞమును తర్వాత దర్శశ్రాద్ధమును చేయవలెను. పక్షాంతకర్మ అనగా అన్వాధానముఅనియు, అన్వాహార్యము అనగా దర్శశ్రాద్ధమనియు, చెప్పబడుచున్నది.

ప్రాచీనావీ త్యగ్ని మిధ్మాది కుర్యా
ద్దర్భాం త్సం స్తీర్యో త్తరేణా గ్ని మేవ॥
పాత్రా ణ్యే కైకం న్యసే ద్దక్షిణా ప
వరంచాథో దక్షిణే నా గ్ని మేవ ౬౨౬ ॥

పితృర్థంపాత్రాణిచాసాద్యతత్ర। వేదింకుర్యాత్పిండదానార్థముర్వ్యాం

ప్రాచీనావీతియైఅగ్నీంధనాదిపరిస్తరణాంతమువఱకుచేసి అగ్నికి ఉత్తరభాగమున దర్భలనుబేసి ఆదర్భలయందు దక్షిణసమాప్తిగా ఒక్కొక్కపాత్రను ఆసాదించి, అనంతరము అగ్నికి దక్షిణభాగమున పితృ పాత్రలను ఆసాదించి పిండప్రదానార్థమై భూమియంద వేదిక వేయవలెను.

పవిత్ర లక్షణము

స్థాల్యా గ్ర ప్రాదేశ దీర్ఘాణ్యన్వితాని
పిత్ర్యే త్రీణి స్యుః పవిత్రాణి పూర్వైః॥ ౬౨౭ ॥
"సాగ్రాణి త్రీణి ప్రాదేశ సంమితాని సమాని చ।
నైకమూలా న్యబద్ధాని పవిత్రాణీ హ పైతృకే" ॥౬౨౮ ॥

స్థూలములైనట్టియు అగ్రములుగలిగినట్టియు ప్రాదేశ (జానెడు) ప్రమాణముగలిగినట్టియు మూడుపవిత్రములు పితృకర్మల యందు గ్రహించవలెనుఅని ప్రాచీనులుచెప్పియున్నారు.

ఇధ్మతంత్రము

ఇ త్యత్రో క్తం ప్రోక్షణీ సంస్కృతా ది

పూర్ణం పాత్రం బర్హిషి స్థాపయిత్వా।
పిత్ర్యర్ఘ్య పాత్రాణి మాతామ... ర్ఘ్యా
న్యుత్తానాని హ్యత్ర కృత్వా థ తేషు ॥ ౬౯ ॥
దర్భాం తరవత్స్వేవ పాత్రేష్వపో చ్ఛా
శ్శంనోదేవీ రిత్యృచా మంత్రితేషు।
అప్సు ప్రక్షిప్య తిలానేవ తిలోసి
మంత్రేణౌదుంబరైశ్ఛాదయిత్వా॥ ౭౦ ॥
సబ్రాహ్మణం దక్షిణతో నిషాద్య
త్యాది హ్యాధా ఘార సమిన్నిధానం।
ఆఘార హోమా ద్వితయాజ్య భాగ
ముఖాహుతి స్విష్టకృదం ... హోమాన్॥ ౭౧ ॥
ప్రదక్షిణా న్యువ్రజనాఖ్యయో ... పితృ భవ ... 

అనంతరము ప్రోక్షణీ పాత్రాదిసంస్థా... పూర్ణపాత్రమును బర్హిస్సు నందుంచి పిత్ర్యర్ఘ్యపాత్రలను మాతామహార్ఘ్య... ఉత్తానములనుగాచేసి దర్భాన్విత ములగుఆపాత్రములయందు స్వచ్ఛములగు ఉదకములను ఉంచి "శంనోదేవీః"అను ఋక్కు తో అభిమంత్రించి "తిలోసి"యను మంత్రముతో ఆపాత్రలయందుతిలలనుఉంచి మేడిఆ కులతోకప్పవలెను."బ్రాహ్మణందక్షిణతో దక్షిణనిషాద్య" ఇత్యాది ఆజ్యభాగాంతము వరకు అగ్నితంత్రమును చేయవలెను ఆఘారములు ఆజ్యభాగలు ముఖాహుతి స్విష్టకృత్తు మొదలగుహోమములను ప్రదక్షిణము అను వ్రజనమును పితృకర్మలయందును ఉపవీతులై చేయవలెను.

## మాసిశ్రాద్ధము

అథాజ్యభాగాంత ఇహాగతేషు
పిత్ర్యేషు సత్స్వేవ యథాసు రాగాః॥ ౭౨ ॥
గోవింద కీర్త్యాది తతో ద్య మాసి
శ్రాద్ధం కరిష్యే ప ఉపన్యసేత్తు।

ఆజ్యభాగానంతరము భోక్తలువచ్చినతరువాత కర్త ప్రాణాయామముచేసి, గోవిందకీర్తనము చేసి, " అద్యమాసికశ్రాద్ధం కరిష్యే " అని సంకల్పించి ఉదకముస్ప్రశింపవలెను.

యజ్ఞోపవీతీ ప్రథమం పురోరక్షా
ధృవాఖ్య విశ్వామర సంజ్ఞికానాం॥ ౬-౩౩ ॥
భవద్భి రత్రా హావనీయకార్యే
క్షణః ప్రసాదః కరణీయ ఏవ॥
ఇత్యుక్తే సతివక్తవ్య మోంతథే త్యుత్తరం వచః।
ప్రాప్నోతు భవానిత్యుక్తే ప్రాప్నువానీ తి చోచ్చరేత్॥

యజ్ఞోపవీతియై ముందుగా "పురూరవార్ద్రవ సంజ్ఞికానాం విశ్వేషాం దేవానాం స్థానే ఆహావనీయార్థే క్షణం క్రియతాం భవద్భిః క్షణః ప్రసాదః కరణీయః" అని కర్త చెప్పగా "ఓంతథా" అనిభోక్తలు ప్రత్యుత్తరము చెప్పవలెను. "ప్రాప్నోతుభవాన్" అని కర్త చెప్పగా "ప్రాప్నువాని" అనిభోక్త ప్రత్యుత్తరము చెప్పవలెను.

పితుశ్చ గోత్రస్య చ శర్మణో వసు
రూపస్య పత్నీ సహితస్య శ్రాద్ధే॥ ౬-౩౪ ॥
భవద్భి రత్రా హావనీయ కార్యే
క్షణః ప్రసాదః కరణీయ ఏవ॥
పితామహస్య ప్రపితామహస్య
చాయం క్రమో ఏక ఇహా ద్విజ శ్చేత్॥ ౬-౩౬ ॥
పితృ పితామహ ప్రపితా మహానా
మిత్యాది మాతామహ కర్మకృచ్చేత్।
మాతామహానాం పృథ గేక వద్వా
కార్యో వ్యథా సంభవ మేవ వాహుః॥ ౬-౩౭ ॥

అనంతరము ప్రాచీనావీతియై "పితుఃగోత్రస్య శర్మణోవసురూపస్యపత్నీసహితస్య శ్రాద్ధేఆహావనీయార్థే క్షణః ప్రసాదః కరణీయః " అని బహుబ్రాహ్మణ పక్షమునందు పిత్రాదులకు వేఱువేఱుగా చెప్పవలెను. ఏకబ్రాహ్మణ పక్షమునందు "పితృపితామహప్రపి

తామహానాం గోత్రాణాం, శర్మణాం వసురుద్రాదిత్యరూపాణాం, సపత్నీకానాం స్థానే ఆవాహనీయార్థేక్షణం దత్తాభ్యామభిరక్షితక్షణః ప్రసాదఃకరణీయః" అని పితృాదులనుకరించి చెప్పవలెను. అనంతరము భోక్తలు "ఓం తథా" అని ప్రత్యుత్తరము చెప్పవలెను. "ప్రాప్నోతుభవాన్" అని కర్త చెప్పగా "ప్రాప్నవాని" అని భోక్త ప్రత్యుత్తరము చెప్పవలెను. బహుబ్రాహ్మణ పక్షమునందు "ప్రాప్నువంతుభవంతః" అని కర్త చెప్పగా "ప్రాప్నవామ" అని భోక్తలు ప్రత్యుత్తరము చెప్పవలెను. మాతామహశ్రాద్ధాధికారియైన త్రో పితృాదులకు చెప్పినట్లే మాతామహాదులకును చెప్పవలెను.

క్షణః క్రియతాం ఇత్యన్యే పితర్థే క్షణ ఇత్యథ।
పితామహస్య ప్రపితామహస్య క్షణ ఇత్య పి॥ ౭౮ ॥

"పితుఃక్షణః కర్తవ్యః."పితరునకును ఇట్లే పితామహాదులకు చెప్పవలెనని కొందరు చెప్పుచున్నారు.

సదర్భ తిల కుండేషు పాద్యార్థ్యేషు పృథ క్క్రమాత్।
ప్రక్షాళితాం ఘ్రీ నాచాంతా నాసనేషూ పవేశయేత్॥

పదర్భతిలలను వేఱువేఱు పాద్యస్థానములయందు విశ్వేదేవాది క్రమముగా పాద ప్రక్షాళనము చేసి ఆసనములయందు కూర్చుండ బెట్టవలెను.

విశ్వాన్ దేవా న్ప్రాఙ్ముఖాన్ దత్వా పితృాదీంస్త్రీ నుదఙ్ముఖాన్।
మాతామహా నుద గ్వక్త్రా న్నైకం వా యథా క్రమం॥౭౦॥

విశ్వేదేవస్థానమునందు ప్రాఙ్ముఖముగాను, పితృాదివర్గమునందును మాతామహాది వర్గమునందును, ఉత్తరముఖముగాను, బ్రాహ్మణులను కూర్చుండ చేయవలెను. ఏకబ్రాహ్మణమునందును ఇట్లేచేయవలెను.

తిలా న్వికీర్యా పహతే తి దిక్షు
హవ్యాదిరక్షా మిత్యుదకం ప్రసించేత్।
పితృస్థలే దైవదిశం చ దద్యా
త్స్ఫీ పుండరీకా క్ష నుతి ప్రభావాత్॥౭౧॥
బాహ్యాంతరం గ ప్రయతః ప్రసన్న
స్త్వాద్ధార్థ సంపాదిత నత్పదార్థాన్।
వేశ్మాష్ప కాలాచ్ఛ సువాచయో త్తు

స్తైః శ్రాద్ధ సౌభాగ్యా హి భవంత్వితీహ॥ ౬౪౩ ॥

"అపహతాః" అను మంత్రముతో నాలుగు దిక్కులయందును తిలలనుచల్లి, పితృస్థానమునందును విశ్వేదేవస్థానమునందు ఉదకమును చల్లవలెను. అనంతరము "అపవిత్రః పవిత్రోవా" యనుమంత్రముతో పుండరీకాక్షుని స్మరించితద్ధ్యానమువలన బాహ్యాభ్యంతరశుచియై "శ్రాద్ధార్థంసంపాదితాఃపదార్థాః శౌచతః కాలతశ్చ శ్రాద్ధసౌభాగ్యాభవంతు" అని కర్త అడుగగా "శ్రాద్ధసౌభాగ్యాభవంతు" అని భోక్తలు ప్రత్యుత్తరము చెప్పవలెను.

శ్రాద్ధ కాలే గయాం ధ్యాత్వా ధ్యాత్వా దేవం జనార్దనం।
వస్వాదీంశ్చ పితౄన్ ధ్యాత్వా తత శ్శ్రాద్ధం ప్రవర్తయేత్॥

శ్రాద్ధసమయమున గయను, జనార్దనుని, వస్వాది పితృదేవతలను ధ్యానించి శ్రాద్ధమును జరిగించవలెను.

యజ్ఞోపవీతీ భూత్వా తు దద్యా త్పురూరవార్ద్రవ।
సంజ్ఞకానాం చ విశ్వేషాం దేవానా మిద మాసనం॥ ౬౪౪ ॥
దైవే క్షణో త్ర క్రియతాం తతః ప్రాప్నోతు వై భవాన్॥ ౬౪౫॥

యజ్ఞోపవీతియై "పురూరవార్ద్రవసంజ్ఞకానాం విశ్వేషాందేవానామిదమాసనం, దైవేక్షణః క్రియతాం, ప్రాప్నువంతు భవంతః" అని కర్త అడుగగా భోక్తలు "కుశాసనంఓంతథా, ప్రాప్నువామ" అనిక్రమముగా సమాధానము చెప్పవలెను.

పితుశ్చ దర్భా న్ద్విగుణో పభుగ్నా
న్పితామహస్య ప్రపితామహస్య।
దత్వా సనాని హ చ పైతృకేస్మిం
శ్ఛ్రాద్ధే క్షణో త్ర క్రియతా మిహాపి॥ ౬౪౬ ॥
పితృ పితామహ ప్రపితామహానా
మిత్యాది చైక ద్విజ పక్ష ఏవ॥ ౬౪౭ ॥

"పితుః గోత్రస్యశర్మణః వసురూపస్య, సపత్నీకస్య, ఇదమాసనం" అని అనేక బ్రాహ్మణ పక్షమునందు పిత్రాదులకు వేరు వేరుగాను, ఏకబ్రాహ్మణ పక్షమునందు "పితృపితామహప్రపితామహానాం, గోత్రాణాం, శర్మణాం, వసురుద్రాదిత్యరూపాణామిదమాసనం" అనియు చెప్పిఆసనములను వేయవలెను "శ్రాద్ధేక్షణః క్రియతాం, ప్రాప్నువంతుభవంతః" అనికర్తచెప్పగాభోక్తలు "ఓంతథా, ప్రాప్నువామ" అనియుప్రత్యుత్తరము చెప్పవలెను

ఆసాద్యా ర్ఘో విశ్వదేవా ర్ఘ్య పాత్రే
ద్వే దర్భా స్త ర్వ్యర్తినోః పాత్రయోశ్చ॥
శంనోదేవి రిత్యృచా పో వినీయ
తాసు ప్రత్యేక్యే ద్యవా న్యే యవ్రో॥౬౭॥
మంత్రేణ ప్రక్షిప్య గంధాంశ్చ పుష్పం
విశ్వాన్ దేవా నత్ర చావాహయిష్యే।
విశ్వే దేవా స ఇత్యృచా వాహనం స్యా
ద్విశ్వే దేవాశ్చ త్యుపస్థాన ముక్తం॥౬౮॥
ఆగచ్ఛంతు ప్రార్థనా మర్ఘ్య దానం
యాదివ్యా ఇత్యే తయా ర్ఘ్యస్తనంచ॥౬౯॥
యద్వైశ్చ పాదాది శిరోంత ముక్తం
గంధాది వస్త్రా భరణాంత మన్యత్॥

అనంతరము విశ్వేదేవాస్థానమునందు అర్ఘ్యపాత్రలను ఆసాదించి దర్భలను వాటి యందుంచి, "శంనోదేవీః" అనుఋక్కుతో ఆపాత్రలయందు ఉదకమును ఉంచి "యవోసిధార్యరాజోవా" అను మంత్రముతో యవలనుఉంచి, "గంధద్వారాం" అను మంత్రముతో గంధమును ఉంచి పుష్పములను గూడఉంచవలెను. అనంతరము భోక్తలయందు "విశ్వేదేవాసః" అను ఋక్కుతో విశ్వేదేవులను ఆవాహనము చేసి, "విశ్వేదేవాః" అను మంత్రముతో విశ్వేదేవో పస్థానము చేయవలెను. "ఆగచ్ఛంతు" అనుమంత్రముతో ప్రార్థనచేసి "యాదివ్యాఆపః" అను మంత్రముతో అర్ఘ్యమును ఇచ్చిపాదాదిశిరోంతము పూజించవలెను. అనంతరము గంధవస్త్రాభరణాంతము వఱకు చేయువలెను.

పితృ పితామహ ప్రపితామహానా
వాహయిష్యే హ ముశంత ఇత్యృచా॥౭౦॥
ఆవాహ్యా చాయంతు న ఇత్యృచోప
స్థాయా ర్ఘ్య దానాది సమాన మన్యత్।
మాతామహానా మపి చైవ మేవ
శ్రాద్ధాధికారీ యది చేత్స కుర్యాత్॥౭౧॥

పశ్చస్థానమునందు విశ్వేదేవస్థానమునందు వలెనే అర్ఘ్యపాత్రాసాదనాది అర్ఘ్యదానాంతమును వూర్వోక్తప్రకారముగా చేసి "ఉశంతః" అను ఋక్కుతో పిత్రావాహనము చేసి "ఆయంతునః" అను మంత్రముతో ఉపస్థానముచేయవలెను. మిగిలినది సమానము మాతామహశ్రాద్ధాదికారి అయిన యెడల మాతామహార్చనము పిత్రాద్యర్చనము వలెనే చేయవలెను పిత్రాది పూజశిరస్సుమొదలు పాదములువరకు చేయవలెను.

## అగ్నౌకరణము

విప్రా న్స్పృష్ట్వో ద్ధ్రియతామగ్నౌ చ క్రియతా మితి।
కామ ముద్ధ్రియతాం కామ మగ్నౌ చ క్రియతా మితి॥౬౫౩॥

లబ్ధ్వా నుజ్ఞాం పూప దధ్యాది హవ్య
మన్నం పాత్రే కల్పయిత్వా న్యపాత్రే।
మాష క్షౌరా ద్యన్య హవ్యం నిధాయ
హోమం కుర్యా త్తా వదానాచ్చ ధర్మాత్॥౬౫౪॥

"ఉద్ధ్రియతామగ్నౌచక్రియతాం" అను మంత్రముతో కర్త అడుగగా "కామముద్ధ్రియతాంకామమగ్నౌచక్రియతాం" అనుమంత్రముతో భోక్తలు ప్రత్యుత్తరము చెప్పవలెను. ఇట్లు బ్రాహ్మణానుజ్ఞను పొందిఅపూపములు అన్నము, పెరుగు, ఒకపాత్రయందుంచి మఱియొకపాత్రయందు మాషక్షౌరాద్యహవ్యమును ఉంచి అవదానధర్మముగా హోమముచేయవలెను.

కేచి చ్ఛంసం త్యత్ర చోద్ధృత్య హవ్య
మన్నం సంస్థాప్యా గ్నౌ మిధ్మాది కృత్వా।
హోమం కుర్వీతే త్యథై త న్న సాధు
భోక్తౄణాం త ద్బాధకత్వా ద్విలంబాత్॥౬౫౫॥

అన్నమును అగ్నిమీదను ఉంచి, క్రిందకుదింపి ఒకచోటఉంచి, "అగ్నింధనాద్యాజ్యభాగాంతము వఱకు చేసిన పిమ్మట, దేవపిత్రర్చనములను చేసి, హోమము చేయవలెనని కొందఱు చెప్పుచున్నారుగాని బ్రాహ్మణబాధకమగుటవలనను ఆలస్యమగుటవలనను ఆ పక్షము మంచిదికాదు.

ప్రాహ చార్యో త్రా తిస్పష్ట ఉద్ధరే జ్జుహుయాచ్చ తత్।
నాత్రా దప్యవధా నేన కార్య మిత్యేవ గమ్యతే॥౬౫౬॥

"అతిసృష్టఉద్ధరేజ్జుహుయాత్" ఆప-ధ-౨-౧౦-౮౬॥ అనుసూత్రము ఆపస్తంబుడు చెప్పుటవలన అన్నోద్ధరణ హోమములకు వ్యవధానములేకుండునట్లుచేయవలెనని తోచుచున్నది.

తస్మా దాదా వగ్నిమిధ్వా ద్యథాజ్య
 భాగాంతే త్రా హుతే విప్రా ర్చనాది।
వాసో గానాంతే థ విప్రా జ్ఞయా న్న
 ముద్ధృత్యా థో హోమ కర్మారభేత॥౬౫౭॥

ఆ కారణమువలన ముందుగా "అగ్నింధనాద్యాజ్యభాగాంతము వఱకు చేసి, భోక్తలను రావించి విప్రార్చనము అయిన తర్వాత బ్రాహ్మణానుజ్ఞను పొంది అన్నమును అగ్నిమీదనుంచి, క్రిందికిదింపిఅనంతరము హోమమును ప్రారంభించవలెను.

యజ్ఞోపవీతీ దధి పాయసాదిభి
 స్సంమిశ్రితా న్నా దవదాన ధర్మతః।
గృహీత వా న్పార్వణవ త్త దగ్నయే
 స్వాహే తి హుత్వా గ్నిముఖాహుతిం తతః॥౬౫౮॥
ప్రాచీనావీ త్యేవ కుర్వీత హోమం
 యన్మే మాతే త్యాది తత్రో పవీతీ।
భూత్వా కుర్యా త్స్విష్టకృ ద్ధోమ ముష్ణే
 భస్మన్యేవా హూమ్య మన్త్రా వసవ్యాత్॥౬౫౯॥
నవ్యా త్ప్రాయశ్చిత్త హోమాం శ్చహుత్వా
 ప్రాచీనావీ త్యత్ర శేషం సమాప్య।
మంత్రై స్సర్వా న్నా భిసంమర్శనం స్యా
 త్సంస్థా మాసి శ్రాద్ధ మిత్యేవ దంతం॥౬౬౦॥

యజ్ఞోపవీతియైదధిపాయసాదిమిశ్రిత మగుఅన్నమును అవదాన ధర్మముగా గ్రహించి, ప్రతిపత్నీలీపాకమునందువలె "అగ్నయేస్వాహా" అని ముఖాహుతిచేసి, ప్రాచీనావీతియై యన్మేమాతేత్యాదిపదుమూడు హోమములను చేసి, ఉపవీతియైస్విష్టకృద్ధోమమునుచేసి, ప్రాచీనావీతియైఉష్ణభస్మయందు ఘారాదిక మునుహోమమునుచేసి, ఉపవీ

తిర్థై ప్రాయశ్చిత్తహోమములను చేసి, ప్రాచీనావీతిరై హోమశేషమును సమాప్తి పొందింపవలెను. అనంతరము "ఏవతేతత" ఇత్యాది మూడు మంత్రములచే పిత్రాది పాత్రలయందలి అన్నమును ప్రాచీనావీతిరై అభిమర్శనము చేయవలెను. ఇంతవరకే సంస్థామాసి శ్రాద్ధము అని చెప్పబడుచున్నది.

మాసిశ్రాద్ధమునందు అగ్నితంత్ర నిర్ణయము

మాసిశ్రాద్ధే నుక్త్వా నగ్నితంత్రం
తంత్రాపేక్షాయాం చ సత్యాం కిమర్థం।
తంత్రే నుక్తే సత్య వశ్య క్రియాయాం
తంత్ర ప్రాప్తి స్స్యాత్కథం బ్రూత సత్యం॥౬౬౧॥

అగ్నితంత్రాపేక్షకలిగియున్నను మాసిశ్రాద్ధమువందు అగ్నితంత్రమును ఆపస్తంబుడు ఎందులకు చెప్పలేదు? అవశ్యముగా చేయవలసిన కర్మయందు అగ్నితంత్రమును చెప్పనిచో తంత్రము ఎట్లు సిద్ధించునో నిజమును చెప్పుడు?

* దర్శాదికాదిష్వఖిలేషు కర్మసు
శ్రాద్ధేషు చాగ్నౌకరణ ప్రవృత్తయే।
అనుక్త్వా నగ్నిముఖాది చాఖిలం
హ్యాచార్య ఇత్యత్ర చ సుష్ఠు గమ్యతే॥

దర్శాదిసమస్తశ్రాద్ధకర్మలయందు అగ్నౌకరణము చేయుటకును, అగ్నితంత్రముచేయకుండా ఉండుటకును మాసిశ్రాద్ధమునందు అగ్నితంత్రము ఆపస్తంబుడు చెప్పియుండలేదని స్పష్టముగాతోచుచున్నది.

పాకయజ్ఞ ఇతి వై కరోతి య
శ్రాద్ధ కర్మ యది మాసి మాస్యపి।
సర్వథాగ్నిముఖ కర్మ చాఖిలం
తేన కార్య మితి శాస్త్ర నిశ్చితం॥ ౬౬౩ ॥

ప్రతిమాసమువందును చేయబడుపాకయజ్ఞమగు సంస్థామాసిశ్రాద్ధమునందే అగ్నితంత్రమునంతను చేయవలయునని శాస్త్రమువందునిశ్చయింపబడినది.

---

* దర్శాబ్దికాదిష్వితి పాఠాంతరం

స్విష్టకృత్ప్రభృతి నైసమాన మి
  త్యుత్తరత్ర విధి వాక్య దర్శనాత్।
పాక యజ్ఞ కరణ ప్రసంగతో
  స్మాక మగ్నిముఖ మత్ర లభ్యతే॥

"స్విష్టకృత్ప్రభృతి సమానమా పిండనిధానాత్" అప-గృ-౨.౭-౧౫ అని ముందు విధివాక్యము ఉండుటవలనను పాకయజ్ఞ ప్రశంసవలనను సంస్థామాసిశ్రాద్ధమునందు అగ్నితంత్రము సిద్ధించుచున్నది.

వివాహాదిషు సర్వేషు కర్మసు స్మ పునః పునః।
అగ్నే రుప సమాధానా దీ త్యుక్త్వా హోమ ముక్తవాన్॥

వివాహాదిసమస్తశుభకర్మలయందు మాటిమాటికి "అగ్నేరుపసమాధానాది" అని చెప్పి హోమమును చెప్పియున్నాడు. అట్లుచెప్పనిచో ఆకర్మలయందు అగ్నితంత్రము సిద్ధించకపోవును.

ప్రత్యాబ్దికాదులయందు అగ్నితంత్రము లేదు

ప్రత్యాబ్దికాదిషు శ్రాద్ధే ష్వగ్ని కరణ సిద్ధయే,
మాసి శ్రాద్ధే గ్న్యుప సమాధానా దీతి వ్యాచ ష్టవాన్॥౬౬౬॥

ప్రత్యాబ్దికాదిశ్రాద్ధములయందు అగ్నితంత్రాభావము ఇష్టాపత్తియగుటవలన అపస్తంబుడు మాసిశ్రాద్ధమునందు 'అగ్నేరుపసమాధానాది' అని అగ్నితంత్రమును చెప్పలేదు

తస్మా త్ప్రత్యబ్దాదిషు శ్రాద్ధ కృత్యే
  ష్వగ్నౌ కుర్యా దగ్నిమిధ్యా ద్యభావః।
పూర్వేద్యు ర్వా వా పరేద్యు శ్చ విప్రా
  నామంత్ర్యా థ స్నాన సంప్రేషణాంతే॥౬౬౭॥

స్నాత్వా నిత్యంకర్మ నిర్వర్త్య వైశ్వ
  దేవం యజ్ఞా స్పంచ దేవార్చనంచ।
కృత్వా తత్రా హూత విప్రా ర్చనాది
  వాసో దానాంతే థ విప్రా జ్ఞయా స్మిం ॥౬౬౮॥
హస్తావ్యాం పాత్రే కల్పయిత్వా ప్యహస్తావ్యాం

ప్రాచీనావీత్యేవ చౌపాసనాగ్నిం।
తూష్ణీం పర్యుక్ష్య స్రుచా వా కరేణ
యన్మేమాతా ద్వ్యాస్త్రియోదశ్య హుతా॥౬౯॥
హుతాత్వాన్నాచ్చ హ్యుష్ణ భస్మ న్యహోమ్యం
హుత్వా పర్యుక్ష్య స్న సంస్పృశ్యనాది।
కర్మ గ్రాస ప్రాశనాంతం సమానం
సర్వం కర్తవ్యం మ్నాతాహాదిషు స్యాత్ ॥౭౦॥

అంకువలం ప్రత్యాబ్దికాది సమస్త శ్రాద్ధములయందు అగ్నితంత్రమును చేయూవను. అగ్నౌకరణము చేయవలెను శ్రాద్ధపూర్వదినముననాని, శ్రాద్ధదినమునగాని, బ్రాహ్మణులను నిమంత్రించి మధ్యాహ్నసమయమున వారిని స్నానమునకుపంపి, కర్తయు స్నానము చేసి, నిత్యకర్మలను చేసుకొని, వైశ్వదేవమును, పంచమహాయజ్ఞములను, దేవతార్చనమును చేసి, బ్రాహ్మణులు వచ్చినతర్వాత విప్రార్చనాంతమునందు బ్రాహ్మణానుజ్ఞను పొంది అన్నము, దధి, పాయసము ఒకపాత్రయందుంచి, క్షౌరాదికమును మఱియొక పాత్రయందుంచుకొని, ప్రాచీనావీతియై ఔపాసనాగ్నికి మంత్రరహితముగా పర్యుక్షణము చేసి స్రుక్కుతోగాని, హస్తముతోగాని, "యన్మేమాతా" ఇత్యాది త్రయోదశాహుతులను, చేసి, ఉష్ణభస్మయందు క్షౌరాదికమును హోమముచేసి, అగ్నికి మఱల పర్యుక్షణము చేసి, "ఏషతేతత" అను మూడుమంత్రములచే అన్నాభిమర్శనమును చేసి, శేషగ్రాసప్రాశనాంతమువఱకు చేయవలెను ప్రత్యాబ్దికాదులయందును, మాసిశ్రాద్ధమునందును, అగ్నితంత్రముగాక మిగిలినది అంతయూ సమానముగా చేయవలెను.

అగ్నౌకరణ మంత్రములయందుఊహ లేదు

మాతా పిత్రో ర్మాతృ పిత్రోః పితృవ్య
జ్యేష్ఠ భ్రాత్రో శ్రాద్ధ కృత్యేషు పత్న్యాః।
కర్తుః పిత్రా ద్వ్యాస్త్రియో దేవతా స్యు
రగ్నౌ హోమే హోమమంత్రేషునోహా॥౭౧॥

తల్లిదండ్రులు, మాతామహీమాతామహులు, పినతండ్రి పెదతండ్రులు, జ్యేష్ఠభ్రాత, పత్ని వీరలప్రత్యాబ్దికాదిశ్రాద్ధకర్మలయందు కర్తృ పిత్రాదులే దేవతలు అగుటవలన అగ్నౌకరణమంత్రములయందు ఊహచేయకూడదు.

ఉదీరితా నుశంత స్త్వా యే చే హేంతి తిలోసిచ।
యస్మైమాతా ప్రభృ త్యేతేమంత్రా శ్శానూహితాస్స్మృతాః॥

"ఉహేతాం, ఉశంతస్త్వ, యేచేహా, యస్మైమాతా ప్రభృతులగు మంత్రములను ఊహించకూడదు

పిత్రాదీ నాం దేవతా త్వా త్ర్యయాణాం
అస్వత్రో హాూ కార్య ఊహ్యాం యది స్యాత్।
శాస్త్రాచ్ఛిష్టా చారతః పాప కృ త్స్యాత్
స్తోత్రి ప్రిత్యయే పలాప క్రియాన్వాః।

పిత్రాదులు ఆగ్నౌకరణదేవతలగుటవలన ఊహించకూడకపోయినను శాస్త్రీయముల వలనగాని, శిష్టాచారములవలనగాని, ఊహించతగిన స్థానయుపల మహాలయామావాస్యాది శ్రాద్ధోంగములకు శ్రాద్ధములయందు ఊహించవచ్చును. స్వతంత్రించి కర్మలను చేయువాడు పాపాత్ముడగును.

సోమ్యాం మృత్వా ప్రేత భావం గతానాం
పిత్రాదీనాం ప్రేతభావస్య ముక్త్యై॥౬౭౭॥
తేషాం కర్తవ్యా సపిండీ క్రియా స్యా
త్తస్యా మూహూా యుజ్యతే స్వతంత్ర స్యాత్॥

మరణించినవారలకు ప్రేతత్వవిముక్తికొఱకు చేయబడుసపిండీకరణమునందు ఊహ చేయవచ్చునుగాని తదితరత్ర చేయకూడదు.

మాన్య ష్టకా శ్రాద్ధ మహాలయా మా
వాస్యాసు పిత్రో రపి మాతృ పిత్రోః॥
పత్న్యాః పితృవ్య గ్రిజయో ర్మృతాహే
సపిండనే గ్నౌకరణం త్వనూహాం।
కర్తవ్య ముక్తం త్విహ కర్మ కర్తుః
పిత్రాదయో గ్నౌకరణా ధిదేవతాః॥ ౬౭౮ ॥

మాసిశ్రాద్ధము, అష్టకా, మహాలయము, అమావాస్య, తల్లిదండ్రులయొక్కయు మాతామహీ మాతామహులయొక్కయు, పత్నియొక్కయు, పితృవ్యులయొక్కయు, అ

గ్రహణనిమిత్తకము ప్రత్యాబ్దికశ్రాద్ధములయందును, సపిండీకరణమునందును. కర్తయొక్క పితామహులు దేవతలగుటవలన అగ్నౌకరణమంత్రములు ఊహింపకూడదని చెప్పబడియున్నది

పితుస్సపిండీకరణక్రియాయాం
జీవత్పితా మాతృసపిండనే చ।
కృత్వా ద్వ్యగ్నౌ మధ్య ద్వ్యథ హోమకాలే
పితామహ్యా మూహేన పితుః పితేతి॥ ౭౮౦॥

పితృసపిండీకరణమునందును, జీవత్పితృకకర్తృకమగు మాతృసపిండీకరణమునందును అగ్నౌ ద్వ్యనాదిభాగలవలను చేసి అగ్నౌకరణసమయమున "పితుఃపితా" అని ఊహచేయవలెను.

పితుస్సపిండీకరణాదృతే స్యా
దూహో న కార్యః కృతిభిః కదాచిత్॥ ౭౮౧॥

తల్లితండ్రుల సపిండీకరణములు గాక ఇతరశ్రాద్ధములయందు ఊహ చేయకూడదు.

అదో యస్మై పితుర్మాతా ప్రలులోభేతి చోహయేత్।
రేతః పితుః పితా వృఙ్క్తామిత్యూహశ్చైవమూర్ధ్వయోః॥
పితుః పితామహీ చేతి స్యాత్పితుః ప్రపితామహీ।
పితుః పితామహో వృఙ్క్తాం స్యాత్పితుః ప్రపితామహః॥

"యస్మై పితుర్మాతా ప్రలులోభ రేతః పితా వృఙ్క్తాం॥ యస్మై పితుః పితామహీ రేతః పితుః పితామహో వృఙ్క్తాం "యస్మై పితుః ప్రపితామహీ రేతః పితుః ప్రపితామహో వృఙ్క్తాం" అని ఊహించి చెప్పవలెను.

యే చే హేత్యృగనూహస్స్యాత్ పిత్రే స్వాహేత్యనూహితాః।
సూత్రే తస్మాదృచనోహే * దిత్యాసేధ వచశ్శ్రుతం॥ ౭౮౨॥

"యేచేహ" అను ఋక్కును, పిత్రే స్వాహా ఇత్యాదిమంత్రములు ఊహించకూడదని చెప్పబడియున్నది.

---

* ౭౮౨ శ్లోకమునందలి నాలుగవపాదము నాకు దొరకిన ప్రతులలో భిన్న భిన్నముగా నున్నందున ఎట్లు సవరణ చేయుటకును శక్యము కానందున యథామాతృకముగానే ముద్రింపించినాను ఎవరైనను శుద్ధపాఠమును తెలుపుదురు చేసినచో సవరణ చేయుచున్నాను

విప్రైస్సృష్టే మద్రియతా మగ్నౌ చక్రియతామితీ।
కామ ముద్ధ్రియ్యతాం కామ మగ్నౌ చక్రియతామితీ॥౭౦॥

అగ్నౌకరణమును చేయువరకు ఘృతప్లుతము అగు అన్నమును పట్టుకొని, "అగ్నౌకరణంకరిష్యే" అని అడుగగా భోక్తలచే "కురుష్వ" అని అనుజ్ఞాతుడై పిండపితృయజ్ఞోక్త ప్రకారముగా చేయవలెనని యాజ్ఞవల్క్యుడు చెప్పుచున్నాడు యాజ్ఞవల్క్య మాత్రముగా ఆపస్తంబశాఖవారలు చేయుకూడదు. కర్త "ఉద్ధ్రియతాం అగ్నౌచక్రియతాం" అని అడుగగా "కామముద్ధ్రియతాం కామమగ్నౌచక్రియతాం" అని భోక్తలు ప్రత్యుత్తరము చెప్పి పిమ్మట అగ్నౌకరణము చేయవలయునని యీ తద్విధానమును మన ఆచార్యుడు చెప్పుచున్నాడు.

అతో విప్రైస్సృష్ట ఉద్ధరేజ్జుహుయాచ్చేత్యనుక్రమాత్।
త్రిమోదశాహుతిమితం సూత్రోక్తమథ కేచన॥ ౭౧ ॥
సూత్రోక్తమగ్నౌ కరణం సూత్రం త్యక్త్వాన ధీత్యచ।
శాఖాంతరాగ్నౌ కరణం కుర్వంత స్సంత ఉత్తమాన్॥
దూషయంతో వయం శ్రేష్ఠా ఇహాపస్తంబశాఖినః।
ఇతి బ్రువంత......చారమేవా చారంతిహి॥ ౭౩ ॥

"అతిసృష్ట ఉద్ధరేజ్జుహుయాత్" ఆప-ధ-౨-౧౪-౭౦-॥ అన్నమును అబ్రాహ్మణులకోఅను మరియొకపాత్రయందు వేఱుగా నుంచి హోమముచేయవలెను అని క్రమము చెప్పబడినది త్రయోదశాహుత్యాత్మకము సూత్రోక్తము అగు అగ్నౌకరణమును విడచి, సూత్రమును చదువుకొనక, శాఖాంతరాగ్నౌకరణమును చేయుచున్న కొందఱు విద్వాంసులు సూత్రోక్తాగ్నౌకరణమును చేయుచున్న ఉత్తములను నిందించుచూ, ఆపస్తంబశాఖులమగు మేము శ్రేష్ఠులము అని చెప్పుచున్న వారై శాఖాంతరాచారమునే చేయుచున్నారు

నానాగ్నౌకరణము

* వ్యాఖ్యాతృభిః ప్రోక్తన గృహ్యావిద్భి

---

* ప్రాచ్చంద్రికాకృద్భిర్హైవముక్తం । వ్యాఖ్యాతృభిః ప్రోక్తనగృహ్యావిద్భిః।
ఉక్తంతథాసంగ్రహకారికాసు । ప్రసంగ[illegible]స్తాన్సముదాహరిష్యే॥ ఇతిపాఠాంతరం

[illegible]ప్రకారముగా ఇధ్మతంత్రమును విడిచి మాసిశ్రాద్ధవిధానముగా అగ్నౌకరణమును మా[illegible]త్రము చేయుచున్నారు.

"నుచిన్మంత్రవతః" ఆప-గృ-౨౧. ౫॥ అన్యస్యోత్తరాభిర్జుహోతి" ఆప.గృ- ౨౧-౩॥ అని [illegible]ప్పుటవలనను, మాసిశ్రాద్ధమునందు అగ్నితంత్రము చెప్పబడక పోవుటవలనను, మృతాహాదుల [illegible]యందు అగ్నిముఖము చేయక, బ్రాహ్మణానుజ్ఞను పొంది "యన్మేమాతా" ఇత్యాదిపదమూడు [illegible]మంత్రములుగల అగ్నౌకరణమును చేయవలెను.

స్మృత్యుక్తాహ్నిక కృద్భిర్ద్విజైర పరపక్షే మాసిమాస్యహ్నిత
త్కర్తవ్యాగ్నిముఖాదిశేషక బలాన్నప్రాశనాంతంహి యత్,
మాసిశ్రాద్ధ మితిస్మృతం పృథగిదం హోమాది భక్షాంతకృ
న్మాసిశ్రాద్ధ విధానమిత్యభిహితం యత్రస్మృతాహాదిషు॥

[illegible]బ్రాహ్మణులచే ప్రతిమాసకృష్ణపక్షమునందును చేయబడునట్టి యు, ఇధ్మతంత్రము [illegible]ప్రాశనముగలిగినట్టి శ్రాద్ధమునకు మాసిశ్రాద్ధము అని పేరు. ప్రత్యాబ్దికాది శ్రాద్ధము[illegible] హోమాదిశేషగ్రాసప్రాశనమువరకు చేయవలెనని చెప్పబడినది మాసిశ్రాద్ధవిధాన[illegible]ముమన్నది.

[illegible]మృతాహాద్యఖిల శ్రాద్ధే ష్వాపస్తంబశాఖినాం।
[illegible]త్రాదయస్త్రయః ర్తు రగ్నౌకరణదేవతాః॥౧౯౯॥

ప్రత్యాబ్దికాదిసమస్తశ్రాద్ధములయందును ఆపస్తంభశాఖులకు పిత్రాదులే అగ్నౌకరణ[illegible]గా తెలియవలెను.

ఇత్యాదివాక్యైర్బహుభిర్బహూక్తిభి
ర్బహుప్రకారైర్బహు వారవాదరాత్।
[illegible]చ్ఛృణ్వతాంనో బధిరోపమానకం
కిమర్థ మత్రప్రతిపాద్యతేత్వయా॥౨౦౦॥

సూత్రోదితాగ్నౌకరణం సంప్రదాయపరంపరాత్।
[illegible]మధునా దృష్ట్వా శాఖాభిమానతః॥౨౦౧॥
[illegible]క్తం హి పూర్వపూర్వోక్తం తదునుక్త ప్రలాపవత్।
తతోస్థుంసూరయోనూయం సమర్థానాం కృతాగసం॥

పూర్వోక్త ప్రకారముగా అనేకులగు కారికాకారులు అనేక విధములుగా అనేక పర్యాయములు తమతమ గ్రంథములయందు వ్రాసియుంచిరి. పూర్వోక్త కారికలను వినియున్న మాకు నీవు చెప్పినట్లు తిరిగి చెప్పుట నిష్ప్రయోజనము అని మీరు తోచవచ్చును. ఆపస్తంబసూత్రోక్తమగు అగ్నౌకరణము సంప్రదాయపరంపరనుండి ఆచారోత్పన్నమై పొరపాటును చూచి కారిక్యాభిమానము వలన ఉన్మత్తప్రలాపముల వలె చెప్పినదానినే తిరిగి తిరిగి చెప్పినవన్నియు సమర్థులగు మీరలు క్షమించెదరు గాక.

## పరివేషణ ప్రకారము.

అన్నాభిమర్శాత్పురస్తు కేచి
  త్తృతీయయామంత్రణమాచరంతి।
హోమావశిష్టాన్న ఘృతం పితౄణాం
  పాత్రేషు కృత్వా ధవహావిష్యమన్నం॥ ౨౦౩॥
సతర్పాయసాపూప ఘృతాదిశాకాం
  స్సూపోంతిమన్నైనం ధవయుగ్దధిస్యాత్।
స్వయంచకుర్యాత్పరివేషణాది
  పుత్రాశ్చశిష్యా అపివావిశిష్టాః॥ ౨౦౪॥

అన్నాభిమర్శనమునకు పూర్వమునందు తృతీయామంత్రణమును కొందరు ఆచరించుచున్నారు. హోమశేషములగు అన్నమును ఘృతమును పితృపాత్రలయందు ఉంచి అనంతరము మొదటగా అన్నమును తర్వాత పరమాన్నము, అప్పములు, నెయ్యి, కూరలు, పప్పు, దధి సహితము అగు ఉప్పును క్రమముగా కర్త గాని, పుత్రులు గాని, శిష్యులు గాని, శ్రోత్రియులు గాని, వడ్డించవలెను.

## అన్నత్యాగ ప్రకారము

గాయత్రియాద్భి రఖిలాశన పూర్ణపాత్రా
  ణ్యభ్యుక్ష్య దైవ ఉదగాస్య ఇహోపవీతీ।
భూత్వాథ దేవ సవితః ప్రసువేతిపాత్రం
  పర్యుక్ష్య దక్షిణక జానునిపాత్య భూమ్యాం॥ ౨౦౫॥
పాత్రం ప్రగృహ్య పృథివీయజుషాభిమంత్ర్య

మాతామహశ్రాద్ధకృతోయదిస్యు
ర్వేద్యాందిశిప్రాక్తిలవారిపిండాన్।
దద్యుర్హిఃపిత్రోర్మృతవాసరాదౌ
పిండార్ఘ్యదానేద్విజజగ్ధదేశే॥౨౩౦॥
స్యాద్యేచవైపాత్రేతిహిపిత్ర్యప్రస్థితి
స్యాన్యద్వాశ్చవైపాత్రేతిచమాతృప్రస్థితిః।
పిత్ర్యాంశ్చతేచేత్యథతాశ్చమాతృాః
పిత్ర్యాశ్చతృప్యంతుభవంపవ॥౨౩౧॥
మాతృాశ్చతృప్యంతుభవత్యఊర్ధ్వం
తథోభయోస్తృప్యతతృప్యతేతి॥౨౩౨॥
పుత్రాసపాత్రానిత్యృచాభాజనేనా
విచ్ఛిన్నాంబుత్రిఃప్రసవ్యంప్రసించేత్।
సర్వాన్పిండాంశ్చార్ఘ్యహోమాధఃపాత్రా
ణీహన్యాగ్భూతానికృత్వాతఊర్ధ్వం॥౨౩౩॥
అనుచ్ఛ్వసంస్తృప్యతతృప్యతేతి
యజుస్త్రిరుక్త్వోత్క్ష్యచభాజనాని।
ద్వంద్వంవిసృజ్యాత్రచపిండపూజాం
కృత్వాపితృాన్ప్రార్థ్యథవర్తమానే॥౨౩౪॥
ఇత్యాదిచోక్త్వాప్సుపివాద్విజేగ్నౌ
పిండాన్క్షిపేద్గవ్యథపిండదేశే।
సంప్రోక్ష్యచాన్నాదఖిలాద్గృహీత్వా
గ్రాసావరార్ధ్యంగ్రసితవ్యమత్ర॥౨౩౫॥
మంత్రేణచాథహ్యుపవీతినైవ
కర్తవ్యమత్రాచమనంతదాసీం॥౨౩౬॥

ఫాలే ధృత్వా భస్మమచ్ఛందనం వా
శిష్టైః శిష్టైర్బంధుభిః ప్రోష్యవర్గైః ।
నిత్యశ్రాద్ధే నైవసార్ధం సుహృద్భి
ర్భుంజీతైవాభ్యాగతానాన్నైధనాభిశ్చ ॥౨౩౮॥

బ్రాహ్మణవిసర్జనానంతరము కర్త, పిండప్రదానప్రదేశమునకు వచ్చి, పూర్వవదాచమనము చేసి, దక్షిణాభిముఖుడై ప్రాచీనావీతము చేసికొని, ప్రాణాయామము చేసి "అస్మిన్మాసిశ్రాద్ధే పిండప్రదానం కరిష్యే" అని సంకల్పించి, వేదికయందు మూలములు కలిగినట్టియు, అగ్రములు కలిగినట్టియు దర్భలను దక్షిణాగ్రములుగాను, రెండు పంక్తులుగాను పరవవలెను. తనకు పూర్వదిక్కున పిత్రాదులకును, తనకు పశ్చిమ భాగమున మాత్రాదులకును, మంత్రప్రశ్నోక్త పాఠక్రమముగా "మార్జయంతాంమమపితరః" ఇత్యాదిమంత్రములతో పితృతీర్థమునుండి తిలోదకమును దక్షిణసమాప్తిగా ఇవ్వవలెను. అనంతరము ఎడమమోకాలిని భూమిమీద మోపి హుతభుక్తశేషములను కలిపి పితృతీర్థముతో దక్షిణసమాప్తిగా పిండప్రదానము చేసి పూర్వోక్తప్రకారముగా తిరిగి తిలోదకమును ఇవ్వవలెను. మాతామహశ్రాద్ధాధికారియైనచో వేదికయందు తూర్పుకొనలో [illegible]కమును పిండములను ఇవ్వవలెను. మాతాపితరుల ప్రత్యాబ్దికశ్రాద్ధాదులయందు, బ్రాహ్మణభోజన ప్రదేశమునందే పిండప్రదానము చేయవలెను. "యేచవోఽత్రయేచాస్మాస్వనుగసంతే, [illegible]వోఽత్రయాశ్చాస్మాస్వనుగసంతే" ఇత్యాది మంత్రములచే పిండోపస్థానము చేసి "పుత్రాన్పౌత్రానభితర్పయంతీః" అను ఋక్కుతో అరులో నీళ్లుపోసి అచ్ఛిన్నధారగాను అప్రదక్షిణముగాను పిండములకు ముమ్మారు చుట్టూ త్రిప్పవలెను. తర్వాత [illegible]పాత్రలను హోమపాత్రలను బోర్లించి, అనంతరము ఊపిరి విడువకుండా "తృప్యత తృప్యత తృప్యత" అను మంత్రమును ముమ్మారు ఉచ్చరించి, ఆకులను బోర్లించిన పాత్రలను ప్రోక్షించి బోర్లించిన పాత్రలను రెండుచేసి [illegible] మరియొకచోట ఉంచి పిండములను పూజించి "ఓం అద్య-పూర్వోక్తనామా[illegible]శ్రాద్ధే[illegible]పితామహప్రపితామహాః" ఇత్యాది, గయాపిండసదృశాభి[illegible] చేసి ధ్యానించి, ఉదకములయందుగాని, అగ్నియందుగాని, ఉంచవలెను. లేక గోవులకుగాని, బ్రాహ్మణునకుగాని, పెట్టవలెను. తర్వాత పిండప్రదానప్రదేశమునందు ప్రోక్షించి సమస్తమును [illegible] ప్రాచీనావీతియై "ప్రాణేనివిష్టో" అను మంత్రముతో భక్షించి, ఉపవీతియై ఆచమనము చేసి అనంతరము ఫాలమునందు భస్మమునుగాని, మృత్తునుగాని, చందనమునుగాని, ధరించి,

శిష్యులు, ఇష్టులు, బంధువులు, ప్రావ్యవస్థము, మిత్రులు, అభ్యాగతులు, అవ్యార్థులు మొదలగువారితో కలసి భుజింపవలెను.

అష్టకాశ్రాద్ధము

మాఘేమాసేకృష్ణపక్షేష్టమియాం
జ్యేష్ఠానక్షత్రాన్వితానన్వితావా।
విఘ్నేతత్పన్నే ఫాల్గునేమాసికృష్ణా
ష్టమ్యాందధ్నాహోమపర్వాత్రకార్యః ॥౨౩౮॥

మాఘబహుళాష్టమినాడు జ్యేష్ఠానక్షత్రమున్నను లేకపోయినను అష్టకాశ్రాద్ధము చేయవలెను. మాఘమాసములో విఘ్నము సంభవించినయెడల ఫాల్గునబహుళాష్టమినాడు చేయవలెను. అష్టకాశ్రాద్ధమునందు దధిహోమముచేయవలెను.

ప్రాతఃకృత్వాబ్రాహ్మణామంత్రణాని
స్నాత్వాకాలేకర్మనిర్వర్త్యనిత్యం।
స్థిత్వాప్రాచీనావీత్యపోదక్షిణాస్యః
ప్రాణానాయమ్యాష్టకాశ్రాద్ధకర్మ ॥౨౩౯॥

కరిష్యఇత్యగ్నిముఖాద్యథాజ్య
భాగావసానేధ గృహాగతేషు।
విప్రేషుసంకల్పముఖాదివాసో
గానాంతపర్యాప్తియుతామితీర్య ॥౨౪౦॥

లబ్ధ్వాభ్యనుజ్ఞాం దధిసంగృహీత్వా
దధ్నైవకార్యాగ్నిముఖాహుతిస్తు।
ఆజ్యేనకేచిత్తదసాధుచాత్రా
గ్నిస్విష్టకృద్భ్యాంహవిషోపృథక్త్వాత్ ॥౨౪౧॥

అష్టమినాడు ప్రాతఃకాలమున బ్రాహ్మణులను నిమంత్రించి, మధ్యాహ్నకాలమున స్నానముచేసి, నిత్యకర్మను చేసికొని, ప్రాచీనావీతియై దక్షిణాభిముఖుడుగా కూర్చుని, ప్రాణాయామముచేసి "అష్టకాశ్రాద్ధంకరిష్యే,, అని సంకల్పించి,అగ్నిం ధనాద్యాజ్యభాగాంతమువఱకు చేసి, బ్రాహ్మణులురాగా సంకల్పాది వస్త్రప్రదానాంతము వఱకుచేసి

"శ్రద్ధియతామగ్నౌచక్రియతాం" అని అడిగి భోక్తలవలన అనుజ్ఞను పొందినవాడై దధి చేత ముఖాహుతి చేయవలెను. అన్నముతో ముఖాహుతిని చేయవలెనని కొందఱు చెప్పు చున్నారు గాని అగ్నిస్విష్టకృత్తులకు హవిస్సు ఒక్కటే అగుటవలన అపక్షము శాస్త్ర సమ్మతము కాదు.

ఆచార్యవాచః కిల పార్వణేనా
  తో న్యాని కర్మాణి తదాది శబ్దాః ।
యథోపదేశం త్వితి దేవతాన్య
  రగ్నిర్గ స్విష్టకృతం చాంతరేణ ॥౭౮౨॥
ఇత్యంతముద్దిశ్య హవిష్య మేకం
  ఆచార్య ఏవాహ పృథఙ్నతస్మాత్ ।
ఏకం హవిస్త్వగ్ని ముఖాహుతిప్ర
  ధానాహుతిస్విష్టకృదాహుతీనాం ॥౭౮౩॥
తస్మాద్ధినర్వేషు కృతాన్నహోమే
  ష్వన్నేన కార్యాగ్ని ముఖాహుతిస్స్యాత్ ।
తతః ప్రధానాహుతయ స్తతోగ్ని
  స్స్విష్టకృత్స్యాదితి వా క్రమోయం ॥౭౮౪॥

"పార్వణేనాతోన్యాని కర్మాణి" ఇది మొదలగునవన్నియు ఆచార్యవాక్యములే. యథోపదేశం దేవతాః ఇత్యాది అగ్నిర్గ స్విష్టకృతంచాంతరేణ, ఇశ్యంతము వఱకు ఉద్దేశించి ఆచార్యుడు ఒకహవిస్సునే చెప్పియున్నాడు. వేఱుగా చెప్పలేదు. అందువలన అగ్నిముఖాహుతి, ప్రధానాహుతి, స్విష్టకృదాహుతులకు ఒక్కహానిస్సునే చేయవలెను. అందువలననే చరుహోమములయందు అన్నముతో ముఖాహుతిని చేసి, ప్రధానహోమములను చేసి, అనంతరము స్విష్టకృద్ధోమముచేయావలెను. ఇట్లుహోమక్రమము చెప్పబడినది.

యజ్ఞోపవీతిజుహుయాదాఘార్యాద్యదితాస్త్రమాత్ ।
  దధిహోమమిహాప్రాయశ్చిత్తహోమాంతమిత్యత ॥౭౮౫॥

ఆఘారాదులను, ప్రాయశ్చిత్తహోమసహితము అగు దధి హోమము యజ్ఞోపవీతియై చేయవలెను.

ప్రాహ్ణేతు దధ్యంజలిహోమకర్మ
తస్మాత్పరాహ్ణే బ్రాహ్మణ భోజనం జగుః।
కేచిత్ప్రధానత్రయ యుక్త మష్టకా
శ్రాద్ధం వినాగ్నౌకరణం కథం భవేత్ ॥ ౨౦౬ ॥

పూర్వాహ్ణే కర్తవ్య విధేరభావత
స్సూత్రేతు కాలప్రతిషిధ్యనుక్తేః।
కార్యోయ మగ్నౌకరణస్య సిద్ధయే
పరాహ్ణకాలే దధిహోమ ఈరితః ॥ ౨౦౭ ॥

పూర్వాహ్ణకాలమున దధ్యంజలిహోమమును చేసి, బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెనని కొందఱు చెప్పుచున్నారు గాని అది యుక్తము గాదు. ప్రధానత్రయయుక్తమగు అష్టకాశ్రాద్ధము అగ్నౌకరణము వినాగా ఎట్లు చేయనగును? అదియుగాక అష్టకాశ్రాద్ధము పూర్వాహ్ణమునందు చేయవలెను అను విధిలేకపోవుటవలనను, సూత్రమునందు కాల ప్రతిషిద్ధి చెప్పబడకపోవుటవలనను, అగ్నౌకరణము సిద్ధించుటకై అపరాహ్ణమునందు దధి హోమము చేయవలెనని చెప్పబడినది.

అతో ష్టకాఖ్యేయుష పైతృదైవతం
తద్దధ్నఏవాంజలినాజుహోతి।
స్థానేష్వపూపాదిక హోమకర్మణాం
హవామ్యస్య పైతృప్రతినిధ్యుదీరితం॥ ౨౦౮ ॥

అష్టకాశ్రాద్ధదేవతలకు దధ్యంజలిచేతనే హోమము చేయవలెను. అపూపాది హోమస్థానమునందు ప్రతినిధిగా దధి చెప్పబడినది.

అపూపమాంస స్నవపాజ్యహోమ
పిష్టాన్న హోమా ఇతిపంచకానాం।
స్థానేయమేకో దధిహోమ ఏవా
చార్యేణ తూక్తో హికలాయుగేస్మిన్ ॥ ౨౦౯ ॥

అపూప, మాంసా, న్న, వపా, జ్య, పిష్టాన్న హోమములు అను అయిదు హోమములకు కలియుగమునందు ప్రతినిధిగా దధిహోమము చేయవలెనని ఆచార్యుడు చెప్పియున్నాడు

అస్యైనచోపస్తరణా వదానా
భిఘారణాన్యేవహికారయిత్వా।
కర్తవ్యకధ్యంజలి హోమమంత్ర
స్సాద్యాం జనాఇత్యథతేనదత్వా ॥౭౫॥
దర్వ్యాతతస్స్విష్టకృతంచహుత్వా
తల్లేపయోరాద్యఖిలంసమాప్య।
అన్నాభిమర్శద్విజభోజనాది
శిష్టేనదధ్నాసహపిండదానం ॥౭౬॥

ఉపస్తరణము, అవదానము, అభిఘారణము, ఇతరునిచే చేయించి "యాంజనాః" అను మంత్రముతో దధ్యంజలిహోమము చేసి, దర్విచే స్విష్టకృద్ధోమమును చేసి, లేపయోశ్చ త్యాగ తంత్ర శేషమును సమాప్తిపొందించవలెను. అన్నాభిమర్శనముత బ్రాహ్మణ భోజనమైనతరువాత మిగిలిన దధితో పిండప్రదానము చేయవలెను.

అన్వష్టకాశ్రాద్ధవిధిస్తుమాసి
శ్రాద్ధేనవిజ్ఞేయఇహావికారః।
సర్వేషుహోమేష్వపిపైతృకేషు
తూష్ణీంప్రసవ్యంనిరృఋతేర్దిశంహి॥౭౭॥
ఆరభ్యతాద్దక్షిణతోపవర్గాన్మాత్యా
త్సమంతాత్పరిషేచనంస్యాత్।

అన్వష్టకాశ్రాద్ధము మాసిశ్రాద్ధమువలెను. వికృతి ఏమియు లేదు. సమస్తపైతృక హోమములయందు నైఋతి దిక్కున ప్రారంభించి దక్షిణాపవర్గముగాను మంత్రరహితముగాను సమంతపరిషేచనము చేయవలెను.

ప్రత్యాబ్దికాదులయందుఇధ్మతంత్రము లేదు.

పిత్రోస్సపిండేకరణాత్క్రియాయా
మేవాగ్నిమిధ్మాద్యఖిలంచకుర్యాత్ ॥౭౮॥
తయోర్మృతాహాదిషునాగ్నితంత్రం
కర్తవ్యమగ్నౌకరణాదిసర్వం ॥౭౯॥

మాతాపితరులు సపిండీకరణము నందు ఇంధ్మకాంత్రము చేయవలెను. ప్రత్యాబ్దికాములయందు ఇంధ్మతంత్రము మాని అగ్నౌకరణాది సమస్తము చేయవలెను.

సంస్థామాసిశ్రాద్ధపవేధ్మతంత్రం
కర్తవ్యంస్యాన్నేమ్మృతాహాదిషునా కృ।
యస్మైకరాత్రేత్యాదిహోమప్రభృత్యా
శేషగ్రాసప్రాశనాంతంసమానం ॥౭౫౫॥

సంస్థామాసిశ్రాద్ధమునందే ఇంధ్మతంత్రమును చేయవలెను గాని ప్రత్యాబ్దికాదులయందు చేయగూడదు. అగ్నౌకరణాది శేషగ్రాసప్రాశనము వఱకు మాసిశ్రాద్ధమునందు ప్రత్యాబ్దికాదులయందు చేయవలెను.

శ్రాద్ధమునందుప్రధానత్రయనిరూపణము

ప్రసంగాదధునాసమస్త
శ్రాద్ధక్రియాణాంక్రియతేవిచారః॥

ప్రసంగమువలన సమస్త శ్రాద్ధకర్మలు వివరింపబడుచున్నవి

శ్రాద్ధేత్రీణిప్రధానానిబ్రాహ్మణానాంచభోజనం।
హోమానాగ్నౌకరణంపిండదానమమూనిషు ॥౭౫౬॥

శ్రాద్ధములయందు బ్రాహ్మణభోజనము, అగ్నౌకరణము, పిండప్రదానము, అనునవి ప్రధానములు అని చెప్పబడుచున్నవి.

దర్శయందు మాతామహశ్రాద్ధవిచారము

శ్రాద్ధేష్వప్యేతాదృశేష్వేవమేవ
పిత్రోశ్చైకంచాత్రమాతామహానాం।
రాజ్యాదేకంభోజయేచ్ఛోభయోర్హి
త్యేషోర్ధ్వోక్తో............ఏవ ॥౭౫౭॥

ఏకంవిప్రం భిన్నగోత్రేషుపిత్ర్యే
దైవత్యేషుప్రాశయేన్నోదపాది।
ఇత్యేషోఽర్థోదృశ్యతేనూత్రభాష్య
స్మృత్యర్థేషుప్రాహతంయాజ్ఞవల్క్యః ॥౭౫౮॥

దర్శశ్రాద్ధాదులయందు మాతాపితరులకొక బ్రాహ్మణుని మాతామహులకు ఒక్క బ్రాహ్మణుని భుజింపచేయవలెను. భిన్నగోత్రములగు పితృమాతామహస్థానములయందు ఒక బ్రాహ్మణుని భుజింపచేయకూడదు. అని సూత్రములయందు, భాష్యమునందు, స్మృతులయందు చెప్పబడియున్నది.

ద్వౌదైవే ప్రాక్త్రయః పిత్ర్యే ఉదగేకైకమేవవా।
మాతామహానామప్యేవం తంత్రంవా వైశ్వదైవికం ॥౭౫౯॥

విశ్వేదేవస్థానమునందు ఇద్దరిని పితృస్థానమునందు ముగ్గురిని కూర్చుండబెట్టవలెను లేదా ఒక్కొక్కరిని ఐనను కూర్చుండబెట్టవలెను. మాతామహస్థానమునందును ఇట్లే చేయవలెను. బ్రాహ్మణులు ఇద్దరు దొరికినచో విశ్వేదేవస్థానమునందు తంత్రము చేయవలెను. అని యాజ్ఞవల్క్యుడు చెప్పియున్నాడు. ఆ౧౦-శ్లోకమునందు వివరించబడినది.

లభ్యేతే చేద్బ్రాహ్మణౌ ద్వౌ పితృభ్య
శ్చైకం చైకం చాపి మాతామహానాం।
ఏవం యోజ్యం స్థండిలం వైశ్వదేవం
కార్యం విజ్ఞానేశ్వరేణైవముక్తం ॥౭౬౦॥

ఇద్దరు బ్రాహ్మణులు లభించినయెడల పితృస్థానమునందొకనిని, మాతామహస్థానమునందొకనిని కూర్చుండబెట్టి విశ్వేదేవస్థానమునందు స్థండిలవిధానముగా చేయవలెనని పూర్వోక్త యాజ్ఞవల్క్యవచనమునకు విజ్ఞానేశ్వరుడు టీకను వ్రాసియున్నాడు.

సూత్రేపిత్ర్యం శ్రాద్ధకర్మవచోక్తం
దోషాభావాన్నాత్ర మాతామహానాం।
యద్యప్యేకో బ్రాహ్మణో లభ్యతేతం
పిత్రర్థం వా భోజయేద్వైశ్వదేవం ॥౭౬౧॥

కృత్వాతత్ర స్థండిలం క్లుప్తమన్నం
ప్రాశ్యేద్వాగ్నౌ బ్రహ్మచారిభ్య ఏవ।
సద్యో ద్విద్యార్థిభ్య ఏవం వసిష్ఠః
ప్రాహేత్యుక్తం తత్రసౌదర్శనాద్యైః ॥౭౬౨॥

యద్యేకం భోజయేచ్ఛ్రాద్ధే దైవంతత్రకథంభవేత్।
అన్నం పాత్రేసముద్ధృత్య సర్వస్యప్రకృతస్యచ ॥౭౬౩॥
దేవతాయతనే కృత్వా తత్రశ్రాద్ధం ప్రకల్పయేత్।
ప్రాస్యేదగ్నౌ తదన్నంతు దద్యాద్వా బ్రహ్మచారిణే॥

సూత్రమునందు పితృశ్రాద్ధము చెప్పబడినది విధించబడకపోవుట వలనదోషములేదు గనుక మాతామహశ్రాద్ధము చేయనక్కఱలేదు. ఒక్కబ్రాహ్మణుడే లభించిన యెడల అతనిని పితృవర్గమునకు భుజింపచేసివిశ్వేదేవస్థానమునందు స్థండిలమును కల్పించి ఒక ... ను వేఱుగాఉంచి ఆఅన్నమునుఅగ్నియందు వ్రేల్చవలెను. లేదా ... బ్రహ్మచారికి యియ్యవలెను అనిసుదర్శనాదులు "యద్యేకం", ఇత్యాది ... ను తమభాష్యాదులయందుఉదాహరించి వ్రాసియున్నారు.

"... శ్రాద్ధం గయాశ్రాద్ధం శ్రాద్ధంచా పరపక్షికం।
ఏకమష్టాకశమే ద్విప్రం పిండానర్ఘ్యం పృథక్పృథక్॥
ఇదంవచనమత్రాపిసిత్రృవర్గద్వయాత్మకం। మాతామ
హావచోభావా ల్లోకేస్మిన్నధ గౌతమః॥౭౬౬॥ పితరో
యత్ర పూజ్యంతే తత్రమాతామహోధ్రువం। అవిశేషే
ణకర్తవ్యం విశేషాన్నరకంవ్రజేత్ ॥౭౬౭॥
ఇత్యాది వాక్యాని బహూని సంతి
మాతామహశ్రాద్ధపరాణి తేషాం।
అర్థో యమేతే ష్వసుతస్య మాతా
మహస్య యచ్ఛ్రాద్ధకృదేవతస్య ॥౭౬౮॥
తస్మాద్ధి పుత్రీకృత పుత్రికాత్మజా
మాతామహస్యాఖిల రిక్థహారిణః।
అథాసురోద్వాహిత పుత్రికాత్మజా
స్తచ్ఛ్రాద్ధకృత్యే హ్యధికారిణ స్త్రయః ॥౭౬౯॥

"... శ్రాద్ధము, గయాశ్రాద్ధము, మహాలయ శ్రాద్ధము, వీనియందు ఒక బ్రా

హ్మణుని భుజింపచేసి పిండములను అర్ఘ్యమును వేఱువేఱుగా ఇయ్యవలెను,, అను ఈపక్షమునందు మాతామహశబ్దము లేకపోవుటవలన మాతాపితృవర్గములనే బోధించుచున్నది. మాతాపితరులను పూజించునపుడు మాతామహాదులను కూడపూజింపవలెను అట్లు చేయని యెడల నరకప్రాప్తి అగును అని గౌతముడు చెప్పుచున్నాడు మాతామహశ్రాద్ధ విధాయకములగు గౌతమాదివాక్యములు అనేకములు గలవు. పుత్రహీనుడగు మాతామహునకు శ్రాద్ధమును చేయు దౌహిత్రునకు మాతామహశ్రాద్ధమును చేయవలెనని విధించుచున్నవి ఈశ్లోకముల కర్థము, నిరుక్తస్పష్టార్థమేమనగా, పుత్రీకృత పుత్రికాత్మజులు,మాతామహునిసమస్తధనమునకు అధికారులు అనురోధ్యాపహిత పుత్రికాత్మజులు, అను యీముగ్గురు మాతామహశ్రాద్ధమును చేయుటకు అధికారులుగాని ఇతరులకు గాచేయవలసిన అగత్యములేదు నాందీశ్రాద్ధము గయాశ్రాద్ధము, మహాలయము ప్రయాగాదితీర్థశ్రాద్ధము. మొదలగు శ్రాద్ధములను దర్శాదిశ్రాద్ధములను ఈముగ్గురేచేయవలెను.

నప్రత్యవాయో కరణే కృతేభ్యుదయ ఇత్యపి।
ఉక్తం సుదర్శనాచార్యైస్సూత్రేనుక్త హేతుతః॥ ౭ ౭ ౦॥

సూత్రమునందు చెప్పకపోవుటవలన మాతామహశ్రాద్ధము చేయనిచో ప్రత్యవాయము లేదనియు చేసిన అభ్యుదయము కలుగుననియు సుదర్శనాచార్యుడు తనభాష్యములో వ్రాసియున్నాడు.

దర్శయందు సంక్రాంత్యాది శ్రాద్ధ నిర్ణయము.

సంక్రాంతి మన్వాది యుగాది వైధృ
త్యలభ్య యోగా వ్యతిపాతముఖ్యాః।
దర్శేనయుక్తా యది తత్రదర్శం
త్యక్త్వోత్తరం త్వాగత మాచరేత్తు ॥ ౭ ౭ ౧॥
ఏవం పురాతన నిబంధన కృద్భిరుక్తం
మన్వాద్యశేష తిథయః ఫలకామ్యయుక్తాః।
దర్శస్య చాకరణ ఏవ మహాంశ్చదోష
ఇత్యాదరేణ బహుభిస్స్మృతికృద్భిరుక్తం ॥ ౭ ౭ ౨॥

సంక్రాంతులు,మన్వాదులు, యుగాదులు, వైధృత్యలభ్యయోగములు దర్శగా కు వచ్చినయెడల దర్శశ్రాద్ధమును మాని ఆగంతుకములగు సంక్రాంత్యాదిశ్రాద్ధమును

చేయవలెనని ప్రాచీన నిబంధన కారులు చెప్పుచున్నారు. సంక్రాంతి మన్వాదిశ్రాద్ధములు కామ్యశ్రాద్ధములనియు దర్శశ్రాద్ధము చేయనియెడల ప్రత్యవాయము కలుగుననియు అనేకులగు స్మృతికర్తలు.

"ననిర్వపతి యశ్శ్రాద్ధం ప్రమీతపితృకోద్విజః।
ఇందుక్షయే మాసి ప్రాయశ్చిత్తీయతే హిసః॥
అమావాస్యా వ్యతీపాత పౌర్ణమాస్యష్టకాసుచ।
విద్వాం శ్ఛ్రాద్ధమకుర్వాణః ప్రాయశ్చిత్తీయతేహిసః"

అని స్మృతులయందు వ్రాసియున్నారు. ఈశ్లోకములకు అర్థము దర్శశ్రాద్ధావశ్యకతయందు వ్రాయబడుటవలన తిరిగి ఇచ్చట వ్రాసిన గ్రంథవిస్తరభయముచే వ్రాయలేదు

సమాన దైవత్య సమానకాల
సమాన కర్మైక ఫలాధికానంతి।
శ్రాద్ధాని చాయాంతిదినేచ యస్మిం
స్తేనైవ సర్వాణి కృతార్థకాని ॥౭౭౩॥

సమానదైవత్యములు, సమానకాలములు, సమానకర్మలు, తుల్యఫలములు అగు అనేక శ్రాద్ధములుఒకదినమునందు సంభవించినయెడలవానిలో ఒకశ్రాద్ధమును చేసిన మిగిలిన శ్రాద్ధములు కృతార్థములు అగును.

దర్శస్య కర్మాధిక కారణత్వా
ద్దర్శేన సిద్ధిస్భవతీ తరేషాం।
స్వల్పక్రియావన్మను సంక్రమాద్యై
ర్దర్శోనసిధ్య త్యథతైఃకదాచిత్ ॥౭౭౪॥

దర్శశ్రాద్ధము అధికకర్మకలది అగుటవలన దర్శశ్రాద్ధముతో సంక్రాంత్యాదిశ్రాద్ధములుసిద్ధించును గాని స్వల్పకర్మగల సంక్రాంత్యాది శ్రాద్ధములతో దర్శశ్రాద్ధము సిద్ధించదు.

సత్యత్వదోష శ్రవణప్రథాన
త్రయాత్మకత్వాగ్రత ఈరితత్వాత్।
సర్వాసు శాఖాస్వవిగీతశిష్టా

చారాచ్ఛ దర్శేన సమానకించిత్ ॥౨౨౫॥

నిత్యకర్మ యగుటవలనను, ప్రధానత్రయ యుక్తమగుటవలనను, ప్రథమమున చెప్పబడుటవలనను, సమస్తశాఖీయ శిష్టులచే ఆచరింపబడుచుండుటవలనను దర్శశ్రాద్ధము సంక్రాంత్యాదిశ్రాద్ధములకంటె అధికమైనది. దానితో సమమైనశ్రాద్ధములేదు.

దర్శః ప్రధాన త్రితయేన యుక్త
స్సంక్రాంతి కాద్యా ద్విజభోజనాంతాః।
స్యాత్ప్రత్యవాయో హ్యకృతేతు దర్శ
శ్రాద్ధేన దోషశ్రవణం పరేషాం ॥౨౨౬॥

దర్శశ్రాద్ధము ప్రధానత్రయముతో గూడినది. సంక్రాంత్యాదిశ్రాద్ధములు బ్రాహ్మణభోజనము మాత్రము కలవి. దర్శశ్రాద్ధముచేయుని యెడల ప్రత్యవాయము కలుగును. సంక్రాంత్యాది శ్రాద్ధములు చేయనియెడల ప్రత్యవాయములేదు.

దర్శే ఆబ్దికనిర్ణయము

పిత్రోర్మృతాహే యదిచేత్కుహూదినే
హ్యాద్యామృతాహం కుతపేసమారభేత్।
శ్రాద్ధంసమాప్యాథపితుః క్రతుస్తతో
మాశ్రాద్ధమిత్యుక్తమనాహితాగ్నిభిః ॥౨౨౭॥
చేదాహితాగ్నిస్తుకృతాబ్దికస్తతో
న్వాధానకృత్స్యాచ్చతతఃపితుః క్రతుః।
తతఃప్రధానత్రయయుక్త దర్శ
శ్రాద్ధంహికుర్యాచ్చతురగ్నికోర్ధాత్ ॥౨౨౮॥

అమావాస్యనాడు మాతాపితరుల ప్రత్యాబ్దికశ్రాద్ధములు సంభవించినయెడల కర్త అనాహితాగ్ని అయినయెడల కుతపకాలమునందు ప్రత్యాబ్దికశ్రాద్ధమును ప్రారంభించి, సమాప్తిపొందించిన పిమ్మట పిండపితృయజ్ఞమునుతర్వాత దర్శశ్రాద్ధమును జరిగింపవలెను. ఆహితాగ్ని అయినయెడల ప్రత్యాబ్దిక శ్రాద్ధమును జరిగించిన తర్వాత అన్వాధానమును, తర్వాత పిండపితృయజ్ఞమును, పిమ్మట ప్రధానత్రయయుక్తదర్శశ్రాద్ధమును చేయవలెను.

పిత్రుద్దేశేనై వకర్తవ్యనిత్య

శ్రాద్ధేష్వేకః పాకఏకో౽గ్నిహోమః।
పత్నీయుక్తా న్యోజనే భోజనేతు
వర్గం వర్గం పిండదానే పృథక్స్యాత్ ॥ ౨౭౯ ॥

పితృదేవతలను ఉద్దేశించి చేయబడు నిత్యశ్రాద్ధమునందు పాకము ఒకటే. అగ్నౌకరణము ఒకటే. భోజనమునందు సపత్నీకులనుగా చెప్పి పిండప్రదానము వేఱువేఱుగా చేయవలెను.

యస్మిన్ శ్రాద్ధే మాతృపితామహాద్యా
యేయే ప్రోక్తాస్తేభ్యఏవ ప్రదద్యాత్।
వృద్ధిప్రత్యాబ్దాష్టకాసు గయాయాం
దద్యాన్మాతృభ్యః పృథగ్దత్తమేవ ॥ ౨౮౦ ॥
అష్టకాసుచవృద్ధౌచగయాయాంచమృతేహని।
మాతుఃశ్రాద్ధంపృథక్కుర్యాదన్యత్రపతినాసహ ॥ ౨౮౧ ॥

పితృమాతృపితామహాది శ్రాద్ధములయందు పితృమాతృమాతామహాదులను ఉద్దేశించి పెట్టవలెను. నాందీశ్రాద్ధము ప్రత్యాబ్దికశ్రాద్ధము, అష్టకాశ్రాద్ధము, గయాశ్రాద్ధము, వీనియందు మాతృశ్రాద్ధము వేఱుగా జరిగించవలెను. అని స్మృతులయందు చూడబడుచున్నది. అష్టకలయందు, నాందీశ్రాద్ధమునందు, గయాశ్రాద్ధమునందు, ప్రత్యాబ్దికశ్రాద్ధమునందు మాతృశ్రాద్ధము వేఱువేఱుగా చేయవలెను.

ఏకదినమందుమాతాపితృప్రత్యాబ్దికనిర్ణయము.

అత్రాష్టకాస్వితి బహువచనా దన్యశాఖినాం
తిస్రోస్మచ్ఛాఖినాంద్వేవైహ్యష్టకాన్వష్టకేపిచ ॥ ౨౮౨ ॥
అన్వష్టకాయాంమేవైకే పిండానుపదిశంతిచ
సూత్రేణైవద్వయోరహ్నా శ్రాద్ధంకర్తవ్యమేవహి ॥ ౨౮౩ ॥

"అష్టకాసుచ,, అను శ్లోకమందు "అష్టకాసు,, అని బహువచన నిర్దేశమువలన అన్యశాఖలవారికి అష్టకలుమూడు అనియు ఆపస్తంబసూత్రానుసారులకు అష్టకలు రెండనియు స్పష్టమగుచున్నది. "అన్వష్టకాయా మేవైకే పిండనిదానముపదిశంతి,, ఆప-గృ-౨౨-౫ అను సూత్రము వలన అష్టకాన్వష్టకలయందు శ్రాద్ధమునుచేయవలెను.

వృద్ధిశబ్దేనవిజ్ఞేయం నాందిశ్రాద్ధంశుభాగమే।

తత్ప్రకారంతూత్తరత్ర వర్ణయిష్యామ్యసంశయం॥ ౭౮౪॥

వృద్ధిశబ్దముచేశుభకర్మలయందు చేయబడు నాందీశ్రాద్ధము చెప్పబడుచున్నది. ఆ నాందీశ్రాద్ధవిధానము ముందు నిస్సంశయముగా చెప్పబడును.

గయాయామితిశబ్దేన ప్రయాగాద్యఖిలేష్వపి।
గంగాకృష్ణాదితీర్థేషుమాతృశ్రాద్ధంపృథక్చరేత్ ॥ ౭౮౫॥

"గయాయాం,, అను శబ్దముచే ప్రయాగాది క్షేత్రములయందును, గంగాకృష్ణాది పుణ్యనదులయందును చేయబడు తీర్థశ్రాద్ధమునందు మాతృశ్రాద్ధము వేఱుగా చేయవలెను.

మృతేహనీతివచనాత్స్వపిత్రోరేకదామృతిః।
అనుయానేపివాతస్మిన్దినేకాలాంతరేమృతిః॥ ౭౮౬॥
మాతుశ్శ్రాద్ధేపృథక్పాకఃపృథగ్బ్రాహ్మణభోజనం।
పిండదానంపృథక్కార్యంపాకైక్యంచాదిషుత్రిషు॥ ౭౮౭॥

"మృతేహని,, ఇతివచనమువలన తలితండ్రులు ఒక్కమారే మరణించినను, సహగమనముచేసినను, తల్లి తండ్రులలో ఒకరొకరొందు మరణించగా కాలాంతరమున ఆరోజుననే మిగిలినవారు మరణించినపుడును, మాతాపితరుల ప్రత్యాబ్దికశ్రాద్ధములు ఒకరోజుననే చేయవలసియుండును గనుక మాతృశ్రాద్ధమునందు పృథక్పాకమును, పృథగ్బ్రాహ్మణభోజనమును, వేఱుగా పిండప్రదానమును చేయవలెను. గాని మాతాపితరులకు ఒకపాకముచే ప్రత్యాబ్దికము జరిగించకూడదు. అష్టకాశ్రాద్ధమునందును నాందీశ్రాద్ధమునందును తీర్థశ్రాద్ధమునందును ఒకపాకముతోనే శ్రాద్ధమును జరిగించవచ్చును.

మృతేహనిపృథక్పాకఃహ్యాగ్నౌకరణసిద్ధయే।
పిత్రోరాబ్దికయోఃపాకఃపృథక్కర్తవ్యఏవహి॥ ౭౮౮॥

మాతాపితరుల ప్రత్యాబ్దికశ్రాద్ధము ఒకరోజుననే సంభవించినయెడల అగ్నౌకరణముకొఱకు పృథక్పాకము చేయవలసి యున్నది.

మాత్రాదీనాంవై పృథగ్భుక్త్యభావే
ప్యుక్తంతాభ్యఃపిండదానంతుతాసాం।
భుక్తిస్సాకంభర్తృభిర్విద్యతేత
త్షడ్దైవత్యందార్శికేస్మన్మతేతు॥ ౭౮౯॥

దర్శశ్రాద్ధమునందు పిత్రాదులతో కలిపి ఒక బ్రాహ్మణునికే పెట్టుటచే మాత్రాదుల కు వేఱుగా భోజనము లేకపోయినను పిండప్రదానమును వేఱుగాచేయవలెను. ఆ కారణము వలన దర్శశ్రాద్ధము షడ్దైవత్యము అని మామతము.

ఆచార్యేణానుక్తమాతామహానాం
స్మృత్యుక్తేన శ్రాద్ధమంగీకృతం చేత్।
మత్తోన్యేషాం శాఖినామేవ తత్స్యా
త్షడ్దైవత్యం తస్మృతే నో కదాచిత్॥ ౨౯౦॥

ఆపస్తంబాచార్యునిచే చెప్పబడనట్టియును, ఇతరస్మృతికర్తలచే చెప్పబడినట్టియును మాతామహశ్రాద్ధమును అంగీకరించినయెడల ఆశ్రాద్ధము మనకు విధాయకము గాకపోవుట వలన ఆశ్వలాయనాదిశాఖీయులగువారలకు దర్శశ్రాద్ధము షడ్దైవత్యమగునుగాని షడ్దైవత్యము ఎన్నటికిని కాదు.

తస్మాత్పిత్రాదయస్త్రయస్స్యుర్మాసి దర్శే
మాత్రాదయస్త్రయస్సర్వే స్యుర్మాతామహాదయోఽర్చ్యాః।
ప్రత్యబ్దే తు స్యాత్త్రిదైవత్యమేవ
వృద్ధౌ దైవం నవకం స్యాచ్చ కామ్యే॥ ౨౯౧॥

క్షేయం ద్వాదశదైవత్యం గయాశ్రాద్ధం మహాలయం।
పిండాగ్నౌకరణాభ్యాం యుక్తశ్రాద్ధస్యైష విధిస్స్మృతః॥ ౨౯౨॥

ఆ కారణమువలన మాసిశ్రాద్ధదర్శశ్రాద్ధములయందు పిత్రాదులుమూగ్గురును, మాత్రాదులు మూగ్గురును దేవతలు, ప్రత్యాబ్దికశ్రాద్ధము త్రిదైవత్యము, నాందీశ్రాద్ధము నవదైవత్యము. మహాలయశ్రాద్ధము, గయాశ్రాద్ధము మొదలగు కామ్యశ్రాద్ధము ద్వాదశదైవత్యములు. పిండప్రదానము అగ్నౌకరణము గలిగిన శ్రాద్ధముల విధి ఇట్లు స్మృతులయందు చెప్పబడినది.

వ్యతీపాతవైధృత్యాదులయందు శ్రాద్ధవిధి
వ్యతీపాతే వైధృతౌ సంక్రాంతిమన్వాద్యాదిషు సర్వదా।
పిండాగ్నౌకరణే త్యక్త్వా కర్తవ్యం విప్రభోజనం॥ ౨౯౩॥

వ్యతీపాతవైధృతిమన్వాదిసంక్రాంతియుగాదులయందు చేయబడు శ్రాద్ధమునందు పిండప్రదానమును అగ్నౌకరణమును విడిచి బ్రాహ్మణులకు భోజనము మాత్రము పెట్టవలెను.

సంకల్పశ్రాద్ధకృత్యేషు సహ మాతామహైః పితౄన్।
భోజయేదతిశంసంతి గృహ్యాజ్ఞా సూరయోఖిలాః॥ ౭౯౪॥

సంకల్పశ్రాద్ధములయందు మాతామహులతో పిత్రాదులను కలుపవచ్చును అని గృహ్యశాస్త్రజ్ఞులగు విద్వాంసులు చెప్పుచున్నారు.

కర్కటకమకరసంక్రాంతిపుణ్యకాలనిర్ణయము

సంధ్యాకాలోర్ధ్వమర్కేయది మకరగతే స్నానదానం పరేహ్ని
కర్కిణ్యర్కోదయస్యాత్ప్రాక్సవితరి యది పూర్వేహ్ని కర్తవ్యమేవ।
న్యక్కే సూర్యే కుళీరే హనితదహని పూర్వాహ్న్యరన్యేషు కుర్యా
త్పూర్వంచేదర్ధరాత్రాదుపరి పరదినే శ్రాద్ధమేవాపరాహ్ణే

"ఉదయాత్ప్రాక్తనీ సంధ్యా ఘటికాత్రయముచ్యతే। సాయం సంధ్యా త్రిఘటికాహ్యస్తాదుపరిభాస్వతః" ఇతి స్కాందపురాణే॥ సూర్యోదయాత్పూర్వము ఘటికాత్రయము ప్రాతస్సంధ్యాకాలము, సూర్యాస్తమయానంతరము మూడుఘటికలవఱకు సాయంసంధ్యయని యీ సంధ్యాకాలనిరూపణము చేయబడియున్నది. సాయంసంధ్యానంతరము సూర్యుడు మకరమును ప్రవేశించినయెడల మకర సంక్రమణ ప్రయుక్త స్నాన దానాదికము పరదినమునందు చేయవలెను. సాయంసంధ్యయందు మకరసంక్రమణమైనయెడల పూర్వదినమునతప్పి యుక్త స్నానదానాదికమును చేయవలెను. ప్రాతస్సంధ్యాకాలాత్పూర్వము కర్కటక సంక్రమణము అయినయెడల పూర్వదినమునందు దక్షిణాయన ప్రయుక్త స్నాన దానాదికము చేయవలెను. ప్రాతస్సంధ్యయందు కర్కటక ప్రవేశమైనయెడల పరదినమునందు స్నానదానాదికమును చేయవలెను. కర్కటక మకర సంక్రమణములు పగటియందైనయెడల ఆదినమునందే తత్ప్రయుక్త స్నానదానాదిక చేయవలెను. ఇతర సంక్రమణములు అర్ధరాత్రాత్పూర్వము అయినయెడల పూర్వదినమునందును అర్ధరాత్రాత్పరమునందు అయినయెడల పరదినమునందును అర్ధరాత్రమునందైనయెడల ఉభయదినములయందును తత్తత్సంక్రమణప్రయుక్త స్నానదానాదికమును చేయవలెను. సంక్రమణశ్రాద్ధము అపరాహ్ణకాలమునందు చేయవలెను.

ఆమశ్రాద్ధవిధి

అన్నశ్రాద్ధాసంభవేజాతుమాసి
శ్రాద్ధాహేతు శ్రాద్ధమామేన విప్రః
అగ్నౌకార్యం పిండదానం చకుర్యా

దిత్యేవ్రోక్తంస్యాత్స్మృతిష్వేవసిద్ధం॥ ౭౯౬॥

మాసిశ్రాద్ధము మొదలగు శ్రాద్ధములయందు అన్నము సంభవముకానియెడల ఆమద్రవ్యముచేతనే శ్రాద్ధమును జరిగించవలెను. అగ్నౌకరణము, పిండప్రదానము, ఆమద్రవ్యముచేతనే చేయవలెనని స్మృతులయందు చెప్పబడియున్నది

ఉదాహరంత్యత్రబృహాత్రిప్రచేతో
బృహస్పతివ్యాసవసిష్ఠవాచః
క్రమేణహారీతవచోపివృద్ధా
స్సూత్రార్థతాత్పర్యవిదఃప్రసంగాత్॥ ౭౯౭॥

సూత్రార్థతాత్పర్యవిదులగు వృద్ధులు ప్రసంగవశమువలన బృహాత్రిప్రచేతోబృహస్పతివ్యాసవసిష్ఠ వచనములను యీవిషయమైఉదాహరించియున్నారు.

ఆపద్యనగ్నౌతీర్థేచచంద్రసూర్యగ్రహేయది।
ఆమశ్రాద్ధంద్విజఃకుర్యాచ్ఛూద్రఃకుర్యాత్సదైవహి ॥ ౭౯౮॥
ఇతిబృహస్పతిప్రచేతసౌ

ఆపదయందును, అగ్న్యభావమందును, తీర్థశ్రాద్ధమునందును, చంద్రసూర్యగ్రహణములయందును, బ్రాహ్మణుడు ఆమశ్రాద్ధమును చేయవచ్చును. శూద్రుడు ఎల్లప్పుడు ఆమశ్రాద్ధమును చేయవలెను. అని బృహస్పతి బృహాత్రిప్రచేతసులు చెప్పుచున్నారు.

ఆవాహనంచకర్తవ్యమర్ఘ్యదానంతథైవచ।
ఏవమేవతిథిర్యత్రఆమశ్రాద్ధంవిధీయతే ॥ ౭౯౯॥

ఆమశ్రాద్ధమునందు ఆవాహనము అర్ఘ్యదానము గలవు.

యద్యద్దదాతివిప్రేభ్యశ్శృతంవాయదివాశృతం
తేనాగ్నౌకరణంకుర్యాత్పిండాంస్తేనైవనిర్వపేత్ ॥౮౦౦॥

బ్రాహ్మణులకు ఆమద్రవ్యము ఇచ్చినయెడల ఆమద్రవ్యముతోను అన్నమును పెట్టినయెడల అన్నముతోను అగ్నౌకరణమును పిండప్రదానమును చేయవలెనని వ్యాసుడు చెప్పియున్నాడు.

ఆమశ్రాద్ధంయదాకుర్యాత్పిండదానంకథంభవేత్।
గృహాదాహృతపక్వాన్నాత్పిండదానంతిలైస్సహ ॥౮౦౧॥

ఆమశ్రాద్ధము చేయవలసివచ్చినప్పుడు పిండప్రదానము ఇంటినుండి తీసుకురాబడిన అన్నముతో చేయవలెనని షట్త్రింశన్మతమునందు చెప్పబడినది.

శ్రాద్ధవిఘ్నే ద్విజాతీనామామశ్రాద్ధంవిధీయతే।
అమావాస్యాదినియతంమాసిసాంవత్సరాదృతే ౧౦౨॥

శ్రాద్ధవిఘ్నము సంభవించినపుడు అమావాస్యాది నిత్యశ్రాద్ధములను బ్రాహ్మణుడు ఆమద్రవ్యముతో చేయవచ్చును. మాసికప్రత్యాబ్దికములు మాత్రము చేయకూడదు అని హారీతుడు చెప్పియున్నాడు.

ఏతేషాంవచనానాంతుతాత్పర్యార్థ ఇహోచ్యతే।
సంక్షేపేణైవవిద్వద్భ్యోయథామతియథాశ్రుతం ॥౧౦ ॥

పూర్వోక్త బృహస్పత్యాదివచనములకు యథామతిగాను, యథాశ్రుతముగాను తాత్పర్యార్థము సంగ్రహముగా చెప్పుచున్నాను.

రోగోద్దేశోపప్లవౌరాజబాధా
ద్యాపద్ద్రవ్యాలాభ ఇత్యేవమాద్యాః
శ్రాద్ధాపత్నీపుత్రహీనోద్విజశ్చే
న్నో చేదన్నశ్రాద్ధకృత్స్యాత్సపుత్రః ॥౧౦౪॥

రోగము, దేశోపప్లవము, రాజబాధ ద్రవ్యము దొరకకపోవుట మొదలగు ఆపదల యందును శ్రాద్ధాపత్నీపుత్రులు లేనప్పుడును బ్రాహ్మణుడు ఆమశ్రాద్ధమును చేయవచ్చును, పత్నీపుత్రులు ఉన్నప్పుడు అన్నశ్రాద్ధము చేయవలెను.

పత్న్యాయుక్తస్తీర్థయాత్రాంగతశ్చే
దన్నశ్రాద్ధంతేనకర్తవ్యమేవ
యద్యేకశ్చేచ్ఛ్రాద్ధమామేనకుర్యా
దుక్తోర్థస్స్యాదాపదాద్రిత్రయాణాం ॥౧౦౫॥
శబ్దానాంవైచంద్రసూర్యగ్రహే
యద్యేతస్యార్థోవిస్తరేణోచ్యతేత్ర।

బ్రాహ్మణుడు పత్నీయుతుడై తీర్థయాత్రకు వెళ్లినయెడల అన్నశ్రాద్ధమును చేయవలెను. పత్నిని ఇంటిదగ్గిరయుంచి ఒకడే తీర్థయాత్రవెళ్లిన యెడల ఆమశ్రాద్ధమును చేయవలెను. ఇట్లు ఆపద నగ్ని తీర్థములను మూడుశబ్దములకు అర్థము చెప్పబడినది. ఇకను

చంద్రసూర్యగ్రహే,, అను శబ్దమునకు విస్తరముగా అర్థము చెప్పబడుచున్నది.

దర్శశ్రాద్ధేర్కగ్రహశ్చేద్యదీహ
ప్రాతఃకాలేబ్రాహ్మణామంత్రణాది ॥౨౦౬॥
కృత్వాస్నాత్వాపిండయజ్ఞంసమాప్య
విప్రానాహూయాత్రసంకల్పకాది।
వాసోదానాంతేద్విజానుజ్ఞయామం
చాజ్యంసంగృహ్యామమౌపాసనాగ్నౌ ॥౨౦౭॥
యస్మైమాతేత్యాదిసప్తాశఊర్ధ్వా
మాజ్యంహుత్వాభోజనం ద్విత్రయామే॥
సాజ్యంపాత్రేష్వేవసంస్థాప్యదత్వా
విప్రేభ్యస్తచ్ఛ్రాద్ధశేషంసమాప్య ॥౨౦౮॥
సిద్ధాన్నమాదాయగృహాద్ధుతావ
శిష్టేనసంయోజ్యహిపిండదానం।
కర్తవ్యమేవేతిసుదర్శనాద్యై
ర్ద్విజామదానక్రమఉక్తఏవం ॥౨౦౯॥

అమావాస్యనాడు సూర్యగ్రహణము సంభవించినయెడల దర్శశ్రాద్ధమును ఆమతో చేయవలెను. అమావాస్యనాడు ప్రాతఃకాలమున బ్రాహ్మణులను పిలచి, స్నానము చేసి కొని, పిండపితృయజ్ఞమును జరిగించి, బ్రాహ్మణులను పిలిపించి, వారు వచ్చినతర్వాత సంకల్పాది వస్త్రప్రదానాంతమువఱకుచేసి బ్రాహ్మణానుజ్ఞనుపొంది, ఆమముతో ఆజ్యముతోను "యస్మైమాతా" ఇత్యాది త్రయోదశమంత్రాత్మకమగు అగ్నౌకరణమును ఔపాసనాగ్నియందు చేసి, రెండవయామమున బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. శ్రాద్ధశేషమును సమాప్తి పొందించి, హోమముచేయగా మిగిలినట్టి అన్నము ఇంటిలోనున్న అన్నమును కలిపి పిండప్రదానము చేయవలెనుఅని ఇట్లు ద్విజామ శ్రాద్ధవిధానము సుదర్శనాచార్యాదులు తమ గ్రంథములయందు వ్రాసియున్నారు

మాసిశ్రాద్ధాదిష్విదంనోమృతాహే
త్వత్యంతాపద్యేవకుర్యాద్ధిరణ్యాం।

విప్రేభ్యోయత్సంభవంసర్వధర్మ
రాహిత్యంతద్ధానమాత్రంత్వధాహుః ౮౧౦॥

మాసిశ్రాద్ధాదులు ఆమశ్రాద్ధవిధానముగా చేయవచ్చును గాని మృతాహాదులయందు చేయకూడదు. మృతాహమునఁ అధిక ఆపద వచ్చినయెడల హిరణ్యశ్రాద్ధము చేయవచ్చును. శ్రాద్ధకర్మములు వినాగా సంభవమగు ద్రవ్యమును విప్రులకు ఇచ్చుట దానమనబడును.

ఆమంతుద్విగుణంప్రోక్తంహిరణ్యంతుచతుర్గుణం।
అన్నమాతృప్తిపర్యంతమిత్యుక్తంశ్రాద్ధలక్షణం॥౮౧౧॥

ఆమద్రవ్యము ద్విగుణముగాను హిరణ్యము చతుర్గుణముగాను ఇవ్వవలెను. అన్నము తృప్తి అగునటుకు పెట్టవలెను. అని ఆమహిరణ్యఅన్నశ్రాద్ధముల లక్షణము చెప్పబడినది.

పిండాగ్నౌకరణాభావశ్రాద్ధేష్వప్యఖిలేషుచ।
ససంకల్పవిధానేనబ్రాహ్మణాన్భోజయేదితి ॥౮౧౨॥

అగ్నౌకరణము, పిండప్రదానము లేని శ్రాద్ధములయందు సంకల్పవిధానముగా బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను.

స్యాద్దర్శామశ్రాద్ధకాలోపరాహ్ణో
యేషాంసూత్రేపిండక్రియోక్తా।

ఎవరిసూత్రమునందు పిండపితృయజ్ఞము చేయవలెనని చెప్పబడినదో వారు అమావాస్యనాడు ఆమశ్రాద్ధవిధానముగా చేయవలసి వచ్చినయెడల అపరాహ్ణమునందు చేయవలెను.

గ్రస్తేభానౌతంచదృష్ట్వాసరిత్సు
స్నాత్వాగ్రాహశ్రాద్ధమామేనకార్యం ॥౮౧౩॥
దర్శేనాలంచాపరాహ్ణేగ్రహశ్చే
న్నోచేత్పార్థక్యేనకర్తవ్యమేవ।

సూర్యగ్రహణము సంభవించినయెడల గోదావర్యాది నదులయందు స్నానము చేసి గ్రహణశ్రాద్ధము ఆమశ్రాద్ధవిధానముగా జరిగించవలెను అమావాస్యనాడు అపరాహ్ణసమయమున గ్రహణము సంభవించినయెడల దర్శశ్రాద్ధము చేసిన చాలును. గ్రహణశ్రాద్ధము పెట్టనక్కఱలేదు. అపరాహ్ణమునందు గ్రహణము సంభవించక ఇతరకాలములయందు సంభవించినయెడల గ్రహణశ్రాద్ధము వేఱుగా చేయవలెను.

గ్రహణే ప్రత్యాబ్దిక శ్రాద్ధనిర్ణయము.

ప్రాప్తేపి త్రోరాబ్దికేతు గ్రహేపిహ్ని
ముక్త్వాన త్వాం శ్రాద్ధమన్నేన కార్యం ॥౮౧౪॥

గ్రహణదినమునందు మాతాపితరుల ప్రత్యాబ్దిక శ్రాద్ధము సంభవించినయెడల ముక్త్యనంతరము అన్న శ్రాద్ధము జరిగించవలెను.

గ్రస్తే సూర్యేస్తంగతే చేత్తదాస్మిం
జ్యోతిశ్శాస్త్రాత్తస్య విజ్ఞాయ ముక్తిం।
శ్రాద్ధం కర్తవ్యం తదా సింహినోచే
చ్చండాలస్స్యాత్కోటిజన్మస్వధోక్తిం ॥౮౧౫॥

గ్రస్తాస్త సూర్య గ్రహణము సంభవించినపుడు జ్యోతిశ్శాస్త్రమువలన ముక్తిని తెలిసికొని, ముక్త్యనంతరము ప్రత్యాబ్దిక శ్రాద్ధము జరిగింపవలెను. అట్లు జరిగించనియెడల కోటిజన్మములవరకు చండాలుడై పుట్టును అని స్మృతులయందు చెప్పబడినది.

జ్ఞానినః పండితా వాపి మూర్ఖా యోషిత ఏవ వా।
యో మృతాహమతిక్రమ్య చండాలః కోటిజన్మసు ॥౮౧౬॥

జ్ఞానులు, పండితులు, మూర్ఖులు, స్త్రీలు, వీరిలో నెవరైనను మృతాహమును అతిక్రమించినయెడల కోటిజన్మలవరకు చండాలుడై పుట్టుదురు.

చంద్రసూర్యగ్రహే నిత్యభోజనే విషయే స్మృతౌ।
గృహస్థస్యాధికారోహ దృశ్యతే నిర్ణయామృతే ॥౮౧౭॥

చంద్ర సూర్యగ్రహణములయందు గృహస్థునకు భోజనముచేయుటకు అధికారము గలదని నిర్ణయామృతమునందు మాడబడుచున్నది.

చంద్రసూర్యగ్రహే నాద్యాత్ పూర్వం యామచతుష్టయం (?)
రాహోర్విముక్తిం విజ్ఞాయ స్నాత్వా కుర్వీత భోజనం ॥౮౧౮

చంద్ర సూర్య గ్రహణములు సంభవించినపుడు గ్రహణాత్పూర్వము భుజింపకూడదు ముక్త్యనంతరము స్నానముచేసి, భుజింపవలెను.

గ్రస్తే చంద్రేతూదితే తస్య ముక్తిం
దృష్ట్వా తత్ర శ్రాద్ధమన్నేన కుర్యాత్।

రాత్రేస్తుస్యాఃపూర్వయామే గ్రహశ్చే
త్ప్రాతఃకార్యామేపౌర్ణమాస్యాంవిధేయం॥౧౯॥
యామాదూర్ధ్వంమధ్యరాత్రాదధశ్చే
త్పూర్వాంమధ్యాహ్నేచ్చకర్తవ్యమేవ।
తస్మాదూర్ధ్వంచేద్గ్రహశ్చాపరాహ్ణే
కర్తవ్యంస్యాత్పౌర్ణమాస్యాంస్మృతాహం ॥౨౦॥
గ్రస్తే చంద్రేచాస్తగే చేత్తదహ్ని।
కుర్యాత్ప్రత్యబ్దంయథాకాలమేవ॥

గ్రస్తోదయచంద్రగ్రహణము సంభవించినయెడల రాత్రిముక్త్యనంతరమః అన్న శ్రాద్ధ చేయవలెను. పూర్ణిమనాడు రాత్రి ప్రథమయామమున గ్రహణము సంభవించినయెడల పూర్ణిమనాడు ప్రాతఃకాలమున ప్రత్యాబ్దిక శ్రాద్ధముజరిగింపవలెను. జాముర్రాత్రి అయినతర్వాతను రెండుజాములరాత్రిలోపునను గ్రహణము సంభవించినయెడల పూర్ణిమనాడు మధ్యాహ్నత్పూర్వము ప్రత్యాబ్దికశ్రాద్ధము పెట్టవలెను. అర్ధరాత్రానంతరము చంద్రగ్రహణము పట్టినయెడల పూర్ణిమనాడు అపరాహ్ణకాలమునందు ప్రత్యాబ్దికశ్రాద్ధము పెట్టవలెను. గ్రస్తాస్త చంద్రగ్రహణము సంభవించినయెడలపూర్ణిమనాడుయథాకాలమునందు ప్రత్యాబ్దిక శ్రాద్ధము జరిగించవచ్చును.

రాత్రిశ్రాద్ధనిషేధోత్ర దృశ్యతేసనుతత్కథం। నచన
క్తగ్ శ్రాద్ధంకుర్వీతేత్యాచార్యేణచోదితం॥౨౨॥ రా
త్రౌశ్రాద్ధంనకుర్వీతేత్యుక్తంహిమనునాపిచ। రాత్రౌ
శ్రాద్ధంనకుర్వీత రాహోరన్యత్రదర్శనాత్ ॥౨౩ ఇత్య
న్యత్రాపిదృష్టంతునిషేధాబహవస్మృతాః। ఏతావత్సత్య
మేవోక్తంతథాప్యుత్తరముచ్యతే ॥౨౪॥ ఉపరాగోప
ద్రవాదిదైవికంరాజకంవినా। నకార్యమితితత్రోక్తా సం
వత్సరప్రాహనిశ్చయం॥౨౫॥ రాత్రావపిప్రకర్తవ్యం
గ్రహణేచంద్రసూర్యయోః। ప్రత్యాబ్దికంప్రమాదాద్వా
శ్రాద్ధంకుర్యాద్విధానతః॥౨౬॥ ఏవం వ్యాసోప్యాహాపి

శ్రోత్రవ్యపదేఽబ్దికఆపది। స్వకాలాతిక్రమేకుర్యాద్రాత్రేః
పూర్వాంయథావిధి॥౨౭॥

"నచనక్తం శ్రాద్ధంకుర్వీత" ఆప-ధ-౨-౧౦-౧౫-॥ రాత్రియందు శ్రాద్ధముజరిగించకూడదని ఆపస్తంబుడును, "రాత్రౌ శ్రాద్ధంనకుర్వీత" మను.స్మృ ౩-౨౮౦॥ అనిమనువును, రాహుదర్శనమైనప్పుడు గాక ఇతరత్ర రాత్రియందు శ్రాద్ధము జరిగించకూడదు. అని గ్రంథాంతరమునందును, రాత్రిశ్రాద్ధనిషేధము కనుపడుచుండగా రాత్రిశ్రాద్ధము చేయవచ్చునని నీవెట్లుచెప్పుచున్నావు? అని మీకుసందేహము కలుగవచ్చును. అదినిజమేఆసందేహమునకు సమాధానము చెప్పుచున్నాను. దైవికరాజికోపద్రవములు చంద్రసూర్యగ్రహణములుగాక రాత్రియందు శ్రాద్ధము చేయకూడదని సంవర్తుడు స్పష్టముగా చెప్పియున్నాడు. చంద్రసూర్యగ్రహణములు సంభవించినపుడు రాత్రియందును ప్రత్యాబ్దికశ్రాద్ధము యథావిధిగా జరిగించవచ్చును. అని వ్యాసుడుచెప్పియున్నాడు. ఆపద వచ్చినపుడు కాలాతిక్రమణము అయినయెడల రాత్రికాకుండా ప్రత్యాబ్దికశ్రాద్ధము జరిగించవలెను.

సత్యాముక్తంహిసన్యత్రనిషేధోదృశ్యతేపరః॥౨౮॥ గ్రహణేతుద్వితీయేహ్నిరజోదోషాత్తుపంచమే। మృతకేతుత్రయోదశ్యాంజాతేత్వేకాదశేహ్నిచ॥౨౯॥ కాగతిర్వచనస్యాస్యవక్తవ్యంసమ్యగుత్తరం। అపిరావిషయం త్వేతత్తథావ్యస్యార్థఉచ్యతే। పతిపుత్రవిహీనాయాః కర్త్ర్యాస్తుగ్రహణేదినే॥౩౦॥ ఉపవాసవిధానాశ్చద్వితీయేహ్నిమృతాహకం। అయనేవిషువేచైవగ్రహణేచంద్రసూర్యయోః ॥౩౧॥ ఉపవాసంయతిఃకుర్యాదపుత్రావిధవాపిచ। రజస్వలాచేచ్ఛుద్ధాచ్చతుర్థేహానిమజ్జనాత్॥ శ్రాద్ధాధికారిణీచస్యాద్దైవే పిత్ర్యేచపంచమే। సపిండానాంమృతేపిత్రోస్స్యాక్క్రియాచేద్భవేద్యది॥౩౩॥ త్రయోదశేహ్నికుర్వీతక్షత్రియాణీతికేచన। జాతేచైకాదశేహ్నితిసూతకాంతోపలక్షణం ॥౩౪॥

రాత్రియందు శ్రాద్ధమును జరిగించకూడదు అను వచనములకు సరియగు సమాధానమును చెప్పియున్నావు గాని యింకనొక నిషేధముకనపడుచున్నది. అదియేదనగా? గ్రహ

ణము సంభవించినప్పుడు ద్వితీయదినమునందును, రజోదర్శనము అయినయెడల పంచమదినమునందును, మృతాశౌచము వచ్చినప్పుడు పదుమూడవరోజునను, జాతాశౌచము వచ్చినపుడు పదునొకండవరోజునను శ్రాద్ధము జరిగించవలెను. అను శ్లోకమునకుగతిఏది. బాగుగ సమాధానమును చెప్పుము అని మీరుఅడుగుచున్నారా? యీవచనము పతిపుత్రవిహీనయగు శ్రాద్ధకర్త్రియు అగు స్త్రీవిషయము అయినను ఈవచనమునకు అర్థము చెప్పుచున్నాను. పతిపుత్రవిహీనయు శ్రాద్ధకర్త్రియు అగు స్త్రీకి గ్రహణదినమునందు ఉపవాసము నిషిద్ధ పబడుటవలన గ్రహణ ద్వితీయ దినమునందు ప్రత్యాబ్దిక శ్రాద్ధమును జరిగించవలెను. ఉత్తరాయణ దక్షిణాయనములయందును, విషువత్పుణ్యకాలమునందు, గ్రహణముసంభవించినప్పుడు యతియు పతిపుత్రవిహీనయగు స్త్రీయు ఉపవాసమును చేయవలెను. అని స్మృతులయందు చెప్పబడియున్నది. రజస్వలయగు స్త్రీ చతుర్థదినమున స్నానముచేయుటచే శుద్ధురాలు అగును పంచమదినమున స్నానముచేసినయెడల దైవపితృకర్మలయందు అధికారిణి యగును. క్షత్రియస్త్రీ మాతాపితృశ్రాద్ధకర్త్రియైనయెడల జ్ఞాత్యాశౌచమునందు మాతాపితరుల ప్రత్యాబ్దికములు వచ్చినపుడు పదుమూడవరోజున జరిగించవలెనని కొందరు చెప్పుచున్నారు. జ్ఞాత్యాశౌచమువచ్చినప్పుడు పదునొకండవదినము జరిగించవలెను. అగునది మూలకారుతోపలకులాయుఅగా బ్రాహ్మణస్త్రీ పదునొకండవదినమునను క్షత్రియస్త్రీ పదుమూడవదినమునను శ్రాద్ధమును జరిగించవలెను.

## ఆమశ్రాద్ధాదికాలనిర్ణయము.

ఆమశ్రాద్ధంనో మృతాహేకదాచి
దర్శేమాస్యేవాపరాహ్ణేచకార్యం।
మన్వాద్యాదౌసంగవేకాలఉక్త
మామశ్రాద్ధంహేమవాపిద్విజానాం॥౧౩౫॥

ప్రత్యాబ్దిక శ్రాద్ధమునందు ఆమశ్రాద్ధము ఎప్పుడు చేయగూడదు. దర్శశ్రాద్ధము మాసిశ్రాద్ధము, ఆమవిధిగా చేయవలసివచ్చినయెడల అపరాహ్ణమునందు చేయవలెను. మన్వాదిశ్రాద్ధములు ఆమద్రవ్యవిధానముగా చేయునెడల సంగవకాలమున జరిగించవలెను. బ్రాహ్మణులకు ఆమశ్రాద్ధముగాని హిరణ్యశ్రాద్ధముగాని పూర్వోక్తకాలములయందు జరిగించవలెను.

శూద్రోన్నైనైవకుర్యాన్మృతాహ
శ్రాద్ధంమాసావాస్యాదికంచాదరేణ।

సత్యాంతిథ్యాంషణ్ముహూర్తస్థితాయాం
పూర్వాహ్ణే వైశ్రాద్ధమామేన కుర్యాత్ ॥౮౩౬॥

శూద్రుడు మృతాహాది సమస్తశ్రాద్ధములయందు ఆమశ్రాద్ధము నే చేయవలెనుగాని అన్నశ్రాద్ధము చేయకూడదు. తిథి ఆరుముహూర్తములున్నప్పుడు ఆరోజున నే పూర్వాహ్ణమునందు ఆమశ్రాద్ధము జరిగింపవలెను.

ఆమశ్రాద్ధం తు పూర్వాహ్ణే ఏకోద్దిష్టం తు మధ్యమే।
పార్వణం చాపరాహ్ణే తు ప్రాతర్వృద్ధినిమిత్తకం ॥
ఇతి శ్రాద్ధచతుష్కస్య కాలస్స్వీకృతస్స్మృతౌ।
వర్షదేశవ్యవస్థాభ్యాం కార్యః ప్రోచ్యతే బుధైః ॥౮౩౭॥

ఆమశ్రాద్ధము పూర్వాహ్ణమునందును, ఏకోద్దిష్టము మధ్యాహ్నమునందును, పార్వణశ్రాద్ధము అపరాహ్ణమునందును నాందీశ్రాద్ధము ప్రాతఃకాలమునను జరిగించవలెనని స్మృతులయందు చెప్పబడుచున్నది. ఈవచనమునకు దేశవ్యవస్థానుసారముగా విద్వాంసులు అర్థమును చెప్పియున్నారు.

అన్నశ్రాద్ధం బ్రాహ్మణానాం నిత్యమామం తు సంకటే।
ఆమశ్రాద్ధం తు శూద్రాణాం బహ్వాపత్సు స్మృతిషూదితం ॥౮౩౮॥

బ్రాహ్మణులు ఎప్పుడు అన్నశ్రాద్ధము చేయవలెననియూ ఆపదవచ్చినప్పుడు ఆమశ్రాద్ధము చేయవచ్చుననియూ శూద్రులు ఎప్పుడూ ఆమశ్రాద్ధము నే చేయవలెననియూ స్మృతులయందు చెప్పబడియున్నది

ఆపద్యనగ్నౌ తీర్థే చ చంద్రసూర్యగ్రహే యది।
ఆమశ్రాద్ధం ద్విజః కుర్యాచ్ఛూద్రః కుర్యాత్సదైవహి ॥౮౩౯॥

ఆపదయందు అగ్న్యభావమునందు తీర్థశ్రాద్ధమునందు చంద్రసూర్యగ్రహణములయందు బ్రాహ్మణుడు ఆమశ్రాద్ధము చేయవచ్చును, శూద్రుడెప్పుడూ ఆమశ్రాద్ధమే చేయవలెను.

ఆపద్యనగ్నౌ తీర్థే చ ప్రవాసే పుత్రజన్మని।
ఆమశ్రాద్ధం ద్విజః కుర్యాచ్ఛూద్రః కుర్యాత్తు సర్వదా ॥౮౪౦॥

ఆపదయందు, అగ్న్యభావమునందు, తీర్థశ్రాద్ధమునందు, ప్రవాసమునందు, పుత్రజన్మయందు, ద్విజుడు ఆమశ్రాద్ధము చేయవచ్చును శూద్రుడు ఎప్పుడూ ఆమశ్రా

శూద్రులు పూర్వాహ్ణమునందును, బ్రాహ్మణులు అపరాహ్ణమునందును, ఆమశ్రాద్ధము చేయవలెనని స్మృతులయందు చెప్పబడియున్నది. ఇట్లువర్ణవ్యవస్థను మునులు చెప్పిరి.

ఏకోద్దిష్టశ్రాద్ధము

అథ దేశవ్యవస్థాతు ప్రోచ్యతే బహుధర్షిభిః।
వర్షేవర్షేతు కర్తవ్యా మాతాపిత్రోస్తుసత్క్రియా ॥౧౫౫॥

ఋషులు దేశవ్యవస్థను అనేక విధములుగా చెప్పుచున్నారు. ప్రతిసంవత్సరమున మాతాపితరులకు కర్మచేయవలెను.

అథైకంభోజయేచ్ఛ్రాద్ధే పిండమేకంతునిర్వపేత్।
సపిండీకరణాదూర్ధ్వం ప్రతిసంవత్సరంసుతః ॥౧౫౬॥

సపిండీకరణానంతరము ప్రతిసంవత్సరమున మాతాపితరుల మృతతిథియందు ఏకోద్దిష్ట విధానముగా శ్రాద్ధముచేయవలెను.

మాతాపిత్రోః పృథక్కార్యం ఏకోద్దిష్టం మృతేహని।
ఏకోద్దిష్టం పరిత్యజ్య పార్వణం కురుతే నరః ॥౧౫౭॥
అకృతం తద్విజానీయాద్భవేచ్చ పితృఘాతుకః।

మాతాపితరులకు ఏకోద్దిష్టశ్రాద్ధము వేరుగా చేయవలెను. ఏకోద్దిష్టశ్రాద్ధమును చేయకుండా పార్వణశ్రాద్ధము చేసినను ఆశ్రాద్ధము చేయబడనట్టుల తెలుసుకొనవలెను. ఇంతేకాకుండా పితృఘాతుకుడుకూడ అగును.

ప్రత్యబ్దం పార్వణేనైవ విధినా క్షేత్రజౌరసౌ ॥౧౫౮॥
కుర్యాతామితరే కుర్యురేకోద్దిష్టం సుతాదశ।

క్షేత్రజ ఔరసులు ప్రత్యబ్దమున పార్వణవిధిగా మాతాపితరుల ప్రత్యాబ్దికశ్రాద్ధములను జరిగించవలెను, మిగిలిన పది పుత్రులు మాతాపితరుల ప్రత్యాబ్దికశ్రాద్ధమును ఏకోద్దిష్ట విధానముగా చేయవలెను.

ఏకోద్దిష్టంతు కర్తవ్యమౌరసేన మృతేహని ॥౧౫౯॥
సపిండకరణాదూర్ధ్వం మాత్రోః పిత్రోశ్చ పార్వణం।

సపిండీకరణానంతరము ఔరసపుత్రుడు మాతాపితరుల ప్రత్యాబ్దికశ్రాద్ధమును ఏకోద్దిష్టవిధానముగా చేయవలెను. గాని పార్వణవిధిగా చేయకూడదు.

వర్షేవర్షేసుతః కుర్యాత్పార్వణం యోగ్నిమాన్ద్విజః ॥౧౬౦॥

పిత్రోరనగ్నిమాన్ కుర్యాదేకోద్దిష్టం మృతేహని।
బహ్వగ్నయస్తుయే విప్రాయేచైకాగ్నయ ఏవచ ॥౮౬౧॥
తేషాం సపిండనాదూర్ధ్వమేకోద్దిష్టం న పార్వణం।

ఆహితాగ్ని ద్విజుడు ప్రతిసంవత్సరమున మాతాపితరుల ప్రత్యాబ్దిక శ్రాద్ధమును పార్వణవిధిగాను అనాహితాగ్నియగు ద్విజుడు ఏకోద్దిష్టవిధానముగాను చేయవలెను. బహ్వగ్నులు గాని, ఏకాగ్నులుగాని, అగు బ్రాహ్మణులు సపిండీకరణాదూర్ధ్వమునందు మాతాపితర మృతాహమునందు ఏకోద్దిష్టవిధానముగా శ్రాద్ధమును జరిగించవలెను. గాని పార్వణవిధిగా చేయకూడదు.

ఇతివిజ్ఞానేశ్వరేణోదాహృతానివచాంసిచ ॥౮౬౨॥
ఏకోద్దిష్టపరాణ్యేవస్మృతిసూక్తానిసూనిచ ॥౮౬౩॥

అని స్మృతులయందు చెప్పబడినట్టివియు ఏకోద్దిష్ట శ్రాద్ధవిధాయకములు అగు వచనములు విజ్ఞానేశ్వరునిచే యాజ్ఞవల్క్యస్మృతి వ్యాఖ్యానమందు ఉదాహరించబడినవి.

ఏకోద్దిష్టమునీరితంస్మృతిషుతత్పిత్రోర్మృతాహేక్వచి
ద్దేశేసంప్రతిసంప్రవర్తితఇదంమధ్యాహ్నకాలేస్మృతం
పత్నీభ్రాతృసహోదరీప్రభృతిగుర్వంతాబ్దికానామయం।
కాలఃప్రోక్తఇదంసమాసముదితందేశేషుసర్వేష్వపి ॥౮౬౪॥

మాతాపితరుల మృతాహశ్రాద్ధమునందు ఏకోద్దిష్టవిధానముగా చేయవలెనని స్మృతులయందు చెప్పబడియున్నది. ఆప్రకారముగా కొన్నిదేశములయందు ఇప్పటికి జరుగుచున్నది. ఏకోద్దిష్ట శ్రాద్ధము మధ్యాహ్నకాలమునందు చేయవలెను. పత్నీభ్రాతృసహోదరీగురు ప్రభృతుల ప్రత్యాబ్దిక శ్రాద్ధములు మధ్యాహ్నకాలమునందు జరిగింపవలెనని స్మృతులయందు చెప్పబడియున్నది. ఆప్రకారముగా సర్వదేశములయందు ఆచరింపబడుచున్నది.

ఏకోద్దిష్టంయతేర్నాస్తి త్రిదండగ్రహణాదిహ
సపిండీకరణాభావాత్పార్వణంతస్యసర్వదా ॥౮౬౫॥

త్రిదండగ్రహణముచేయుటవలన యతికి ఏకోద్దిష్ట శ్రాద్ధము చేయకూడదు. సపిండీకరణము లేక పోవుటవలన ఏకాదశాహమునాడు సపిండీకరణస్థానమునందు పార్వణశ్రాద్ధము చేయవలెను. అని ప్రచేతసుడు చెప్పియున్నాడు.

ఆహన్యేకాదశేప్రాప్తే పార్వణంతువిధీయతే।

కుర్వీత దర్శవచ్ఛ్రాద్ధం మాతాపిత్రోః క్షయేఽహని ॥౮౬౫॥

ఔరసపుత్రుడు ఋద్ధాదిగా సపిండీకరణము చేసి, ప్రతిసంవత్సరమున మాతాపితరుల మృతాహమునందు దర్శశ్రాద్ధమువలె శ్రాద్ధమును జరిపించవలెను అని జమదగ్ని చెప్పుచున్నాడు.

సపిండీకరణం కృత్వా కుర్యాత్ పార్వణవత్సదా।

ప్రతిసంవత్సరం విద్వాంశ్ఛాగలేయోదితో విధిః ॥౮౬౬॥

సపిండీకరణానంతరము ప్రతిసంవత్సరమునందు దర్శశ్రాద్ధమువలె మాతాపితరుల మృతాహమునందు ప్రత్యాబ్దికమును జరిగించవలెను. అని ఛాగలేయుడు చెప్పియున్నాడని శాతాతపుడు చెప్పుచున్నాడు.

ఏతాని ... ప్రత్యాబ్దికపరాణి చ।

అపి విజ్ఞానేశ్వరేణోదాహృతాన్యత్ర ద్విజాః ॥౮౬౭॥

అని ప్రత్యాబ్దికపరములగు వచనములను విజ్ఞానేశ్వరుడు తన యాజ్ఞవల్క్య స్మృతి వ్యాఖ్యానమందు వ్రాసియున్నాడు.

## ప్రత్యాబ్దికాది శ్రాద్ధకాలము.

ప్రారభ్య కుతపే శ్రాద్ధం కుర్యాదారౌహిణం బుధః।

విధిజ్ఞో విధిమాస్థాయ రౌహిణం తు న లంఘయేత్ ॥౮౬౮॥

ఊర్ధ్వం ముహూర్తాత్ కుతపాద్యన్ముహూర్త చతుష్టయం।

ముహూర్తపంచకం హ్యేతత్ స్వధాభవనమిష్యతే ॥౮౭౦॥

ఏతద్ద్వివచనే జ్ఞేయే ప్రత్యబ్దవిషయే త్వథ।

కుతపకాలము (దివసము యొక్క ఎనిమిదవ ముహూర్తము) నందు శ్రాద్ధమును ప్రారంభించి రౌహిణమునందు చేయవలెను. రౌహిణమును అతిక్రమించకూడదు. కుతపకాలానంతరము ముహూర్తచతుష్టయముగాని, ముహూర్తపంచకముగాని, స్వధాభవనమని చెప్పబడుచున్నది. ప్రారభ్య "ఊర్ధ్వం" ఇత్యాది రెండువచనములు ప్రత్యాబ్దిక శ్రాద్ధవిషయములు.

అపరాహ్ణే సమభ్యర్చ్య స్వాగతేనాగతాంస్తు తాన్।

ఇత్యుక్తం యాజ్ఞవల్క్యేన హ్యమావాస్యాష్టకాదిషు ॥౮౭౧॥

దర్శ మాసి శ్రాద్ధాది శ్రాద్ధములయందు అపరాహ్ణకాలమున వచ్చిన బ్రాహ్మణ బ్రాహ్మణులను పూజించి శ్రాద్ధమును జరిగించవలెను. అని యాజ్ఞవల్క్యుడు చెప్పుచున్నాడు

ప్రారంభః కుతపే మృతాహవిషయే శ్రాద్ధేషు దర్శాష్టకా
మాసిశ్రాద్ధమహాలయేషు తదుపక్రామోపరాహ్ణస్స్మృతః।
ప్రాతర్వృద్ధినిమిత్తకస్స్మృతమిహ స్మార్తేషువా సంగవే
శ్రౌతే తూక్తవిధిక్రమానుసగతే కాలేచ నాందీముఖం ॥౮౭౩॥

ప్రత్యాబ్దిక శ్రాద్ధము కుతపకాలమునందును దర్శాష్టకా మాసిశ్రాద్ధ మహాలయములు అపరాహ్ణమునందును ప్రారంభించవలెను. స్మార్తకర్మలయందుచేయబడు నాందీశ్రాద్ధము ప్రాతఃకాలముననగాని, సంగవకాలముననగాని, ప్రారంభించవలెను. శ్రౌతమునందు చేయబడు నాందీశ్రాద్ధము కర్మక్రమముగా ఎప్పుడు వచ్చునో అప్పుడే చేయవలెను.

తీర్థే విప్రనిమంత్రణాదినియమాభావాచ్చ కాలస్తథా
పిండాగ్నౌకరణప్రయుక్తవిహీనశ్రాద్ధేషు కాలస్స్మృతః।
సంక్రాంతివ్యతిపాతవైధృతియుగేభచ్ఛాయామన్వాదిక
శ్రాద్ధానామిహ పిండహోమరహితానాం చోదితానామపి॥
సర్వేషాం విషువాయనద్వితయయోః కాలోఽపరాహ్ణస్స్మృతో
నిత్యశ్రాద్ధమలభ్యయోగ ఉపరాగశ్చేతి తాత్కాలికాః।
యః కాలస్స్మృతిషూదితోఽశన హావిశ్శ్రాద్ధస్య దర్శాదిషు
స్యాద్ధి బ్రాహ్మణకర్తృకామహవిశ్శ్రాద్ధస్య కాలోఽపి సః ॥౮౭౪॥
ఇత్యుక్తం స్మృతికృద్భిరంఘ్రిజవరైః కార్యామదానక్రియా
కాలో దర్శమృతాహకాదిషు సదా పూర్వాహ్ణకాలస్స్మృతః

తీర్థశ్రాద్ధమునందు బ్రాహ్మణ నిమంత్రణనియమము లేక పోవుటవలన ప్రధాన క్రియయొక్క శ్రాద్ధకాలమగు అపరాహ్ణమునందు తీర్థశ్రాద్ధము జరిగించవలెను. అగ్నౌకరణ పిండప్రధాన రహితములగు సంక్రాన్తి, వ్యతిపాత, వైధృతి, యుగాది, గజచ్ఛాయా, మన్వాది శ్రాద్ధములకును విషువత్పుణ్యకాల దక్షిణోత్తరాయణ పుణ్యకాలములయందు చేయబడు శ్రాద్ధములకును, అపరాహ్ణము ముఖ్యకాలము నిత్యశ్రాద్ధ లభ్యయోగ పుణ్యకాల కర్తవ్య శ్రాద్ధ, గ్రహణ శ్రాద్ధములు తత్కాలములయందు చేయవలెను. దర్శాదిశ్రాద్ధకాలము అగు అపరాహ్ణమునందు బ్రాహ్మణుడు ఆమశ్రాద్ధమును చేయవలెను. శూద్రుడు అమావాస్యా ప్రత్యాబ్దికాది శ్రాద్ధములను ఆమశ్రాద్ధవిధానముగా పూర్వాహ్ణమునందు చేయవలెనని స్మృతులయందు చెప్పబడియున్నది.

## శ్రాద్ధవిఘ్నములు

శ్రాద్ధవిఘ్నే ద్విజాతీనామిత్యస్యార్థశ్చ కథ్యతే।
విఘ్నాస్సంత్యత్ర బహవః కాంశ్చిద్వక్ష్యే తథాపిహి ॥౮౭౬॥

"శ్రాద్ధవిఘ్నే ద్విజాతీనాం" అను శ్లోకమున కర్థము చెప్పుచున్నాను. విఘ్నములు అనేకములు కలవు. వానిలో కొన్నిటిని చెప్పుచున్నాను.

శ్రాద్ధేషు దర్శాదిషు భోజనార్థం
నిమంత్రిత బ్రాహ్మణపుంగవానాం।
అశౌచ రోగాగ్ని నృపోత్థమార్గ
చోర ప్రభృత్యాపదుపాగతేషు ॥౮౭౭॥

ప్రాప్తేష్వముక్తాస్తమితోపరాగే
గ్రస్తాస్తగే సత్యపి సంకటేషు।
క్వచిత్సమీపేషు గృహేషు కశ్చి
ద్విప్రో మృతశ్చేద్యది వాపి యోషిత్ ॥౮౭౮॥

ప్రాక్పిండదానాద్వమనం యదా చే
ద్రజస్వలా చేద్యది కర్తృపత్నీ।
తత్పిండయజ్ఞానధికారహేతో
ర్దర్శస్య పిండక్రతుపూర్వకత్వాత్ ॥౮౭౯॥

విఘ్నేషు సత్స్వేవముపస్థితేష్వమా
వాస్యాన్వితం శ్రాద్ధమిహాపరాహ్ణే।
ఆమేన కుర్యాద్ద్విగుణేన యత్నతో
నో చేద్ధిరణ్యం విభవానుసారతః ॥౮౮౦॥

దర్శాది శ్రాద్ధముల యందు నిమంత్రిత బ్రాహ్మణులకు ఆశౌచము, రోగము, అగ్నిబాధ, రాజపీడ ఋణపీడ, చోరబాధ, మొదలగు ఆపదలు వచ్చినపుడును, గ్రస్తోదయ, గ్రస్తాస్తగ్రహణములు వచ్చినపుడును, సంకటము వచ్చినపుడును, సమీపగృహములయందు బ్రాహ్మణుడు గాని స్త్రీగాని, మరణించినపుడును, శ్రాద్ధభోక్త, పిండప్రదానపూర్వము నందు వమనము చేసికొనినను, కర్తృపత్ని రజస్వల అయినయెడల పిండపితృయజ్ఞము లేదు

[illegible] లేదు కనుక పిండపితృయజ్ఞము చేయకుండా దర్శశ్రాద్ధము [illegible] ము లేకుండుటను, ఇత్యాదివిషయములు వచ్చినప్పుడు దర్శాదిశ్రాద్ధములు అపరాహ్ణమునందు [illegible] ద్ధవిధానముగాగాని, హిరణ్యశ్రాద్ధవిధానముగాని, చేయవలెను.

## నాందీశ్రాద్ధము

అసిష్ట్వాతుపితౄన్ శ్రాద్ధే దైవికంకర్మనారభేత్।
ఇతిస్మృతేస్తుకర్తవ్యం శ్రౌతస్మార్తాదికర్మసు॥౮౮౧॥

పితృదేవతలను పూజించకుండా దైవకర్మలు చేయకూడదు అనిస్మృతులయందు చెప్పబడుటవలన శ్రౌతస్మార్తకర్మలయందు నాందీశ్రాద్ధము చేయవలెను.

సీమంతాన్నప్రాశనోపాయనాఖ్య
చౌలాఖ్యేషు బ్రాహ్మణాన్భోజయిత్వా।
ఇత్యుక్తత్వాత్తేషుకర్తవ్యమేవ
వృద్ధిశ్రాద్ధంచాఖిలేష్వాహుకేచిత్॥౮౮౨॥

సీమంతము, అన్నప్రాశనము, ఉపనయనము, చౌలము, ఇత్యాది కర్మలయందు "బ్రాహ్మణాన్భోజయిత్వా" అని చెప్పబడుటవలన పూర్వోక్త కర్మలయందు నాందీశ్రాద్ధమును చేయవలెను. సమస్తకర్మలయందు చేయవలెనని కొందఱు చెప్పుచున్నారు.

సర్వార్థికరకర్మభ్యః పూర్వేద్యుస్సద్య ఏవవా।
బ్రాహ్మణాన్భోజయేదష్టౌ హిరణ్యేనాదనేనవా॥౮౮౩॥

సమస్తవృద్ధికర్మలయందు పూర్వదినమునగాని, తత్కాలమునగాని, ఎనమండ్రుగురు బ్రాహ్మణులకు హిరణ్యశ్రాద్ధవిధానముగాగాని, అన్నశ్రాద్ధవిధానముగాని, పెట్టవలెను.

సీమంతోన్నయనేకర్మణ్యన్నప్రాశనచౌలయోః।
ఉపాయనేచగోదానేచాదావేవవిశేషతః॥౮౮౪॥
బ్రాహ్మణాన్భోజయిత్వాథపుణ్యాశిషోవాచయేదితి।
వివాహేకన్యకాయాశ్చవరస్యైకగృహేపిచ॥౮౮౫॥
నాందీశ్రాద్ధంహిపూర్వేద్యుః కర్తవ్యంస్మృతిశాసనాత్॥

సీమంతోన్నయనము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, గోదానము, ఈ కర్మలయందు ముందుగా నాందీశ్రాద్ధముచేసి కర్మణః పుణ్యాహవాచనమును చేయవలెను.

కన్యాకాగ్నహమునందు కన్యకయు, వరగృహమునందు వరుడును వివాహపూర్వదినమున నాం దీశ్రాద్ధమును చేయవలెనని స్మృతులయందు వ్రాయబడియున్నది.

మాతుశ్శ్రాద్ధంతుపూర్వంస్యాత్పితౄణాంతదనంతరమ్॥౮౮౬॥

తతోమాతామహానాంతువృద్ధౌశ్రాద్ధత్రయంస్మృతమ్॥

నాందీశ్రాద్ధమునందు ముందుగా మాతృశ్రాద్ధమును, తర్వాతపితృశ్రాద్ధమును, అనం తరము మాతామహశ్రాద్ధమును, చేయవలెను.

నాందీముఖేవివాహేచప్రపితామహపూర్వకం ॥౮౮౭॥

నామసంకీర్తయేద్విద్వానన్యత్రపితృపూర్వకం।

నాందీశ్రాద్ధమునందును, వివాహమునందును, ప్రపితామహపూర్వకము చెప్పవ లెను. ఇతరకర్మలయందు పితృపూర్వకముగా చెప్పవలెను.

ప్రదక్షిణంచోపచారాస్తిలార్థేతుయవాస్స్మృతాః ॥౮౮౮॥

అస్మద్రూపంతిలాన్దర్భానపసవ్యంస్వధాపిచ।

నాందీశ్రాద్ధేత్యజేద్విద్వాన్మాతృపూర్వంతుసర్వదా ॥౮౮౯॥

ప్రదక్షిణము ఉపచారములు నాందీశ్రాద్ధమునందు కలవు. తిలలకు మాఱుగా యవలను వేయవలెను. అస్మచ్ఛబ్దము, రూపము, తిలలు, దర్భలు, అపసవ్యము, స్వధా, అనునవి నాందీశ్రాద్ధమునందు పరిత్యజించవలెను. నాందీశ్రాద్ధమునందు మాతృపూర్వక ముగాచెప్పవలెను.

జీవత్పితుర్నాందీశ్రాద్ధేవిశేషము

అపిజీవత్పితానాందీశ్రాద్ధంకుర్యాచ్ఛుభాగమే।

పితుశ్చప్రపితామహ్యాదీనుద్దిశ్యయథావిధి ॥౮౯౦॥

యేభ్యఏవపితాదద్యాత్తేభ్యోదద్యాత్స్వయంసుతః ॥౮౯౧॥

జీవపితరుడును శుభకర్మలయందు తండ్రిప్రపితామహ్యాదులను ఉద్దేశించి నాందీ శ్రాద్ధమును చేయవలెను. తండ్రి ఎవరినుద్దేశించిచేయునో వారలను ఉద్దేశించియే జీవపి తరుడు నాందీశ్రాద్ధమును చేయవలెను.

నాందీముఖేకర్మణిసంప్రవృత్తే

పితర్యతోజీవతియస్యపుంసః

యేభ్యశ్చదద్యాత్సపితాన్వయంచ

తేభ్యశ్చదద్యాదితిశాస్త్రనిశ్చయః ॥౮౯-౨

జీవపితరుడు నాంద్రీశ్రాద్ధము చేయవలసి వచ్చినపుడు తండ్రిఎవరిని ఉద్దేశించిచే యునో వారలనుద్దేశించియే తాను నాంద్రీశ్రాద్ధము చేయవలెనని శాస్త్రముల నిశ్చయమై యున్నది.

సత్యాంమాతరిజీవంత్యాం శేషవర్గాసమర్చయేత్॥
మాతామాతామహౌసంతౌజీవంతౌపితరంయదేత్।

తల్లి జీవించియుండినయెడల పితృశ్రాద్ధమును మాతామహశ్రాద్ధమును చేయవలెను మాతృశ్రాద్ధము చేయకూడదు. తల్లియు, మాతామహుడును, జీవించి యుండినయెడల మాతృశ్రాద్ధమును మాతామహశ్రాద్ధమును మాని పితృశ్రాద్ధమును మాత్రము చేయవలెను.

అనగోత్రస్సగోత్రో వాయఆచార్యఉపాయనే ॥౮౯-౩॥
సతూపనేయపిత్రాదీనుద్దిశ్యాభ్యుదయంచరేత్ ।

ఉపనయనకర్తయగు ఆచార్యుడు సగోత్రుడైనను అన్యగోత్రుడైనను వటుని పిత్రాదుల నుద్దేశించియే నాంద్రీశ్రాద్ధమును చేయవలెను.

కన్యకాయాఅయంమార్గోమునిభిస్సముదాహృతః ॥౮౯-౪॥
ఇత్యుక్తంయాజ్ఞికైర్గృహ్యవిద్భిర్వృద్ధైఃపురాతనైః ॥౮౯-౫॥

కన్యకకుకూడ ఇదియేవిధమని మునులు చెప్పియున్నారు. అని యాజ్ఞికులు, గృహ్యవిదులు, వృద్ధులు, అగు ప్రాచీనులు చెప్పియున్నారు.

నాంద్రీశ్రాద్ధే బ్రాహ్మణసంఖ్య

ద్వౌద్వౌవేకైకస్యవిప్రౌచవృద్ధి
శ్రాద్ధేమాతృశ్రాద్ధపవంనియుంజ్యాత్।
షణ్మాతౄణాంషట్పితౄణాంచమాతుః
పిత్రాదీనాంషట్చవిశ్వేచదేవాః ॥౮౯-౬॥
చత్వారస్స్యుర్బ్రాహ్మణానాంచసంఖ్యా
వృద్ధ్యాదౌద్వావింశతిర్ముఖ్యపక్షః।
ద్వౌద్వౌవైకైకస్యవర్గస్యవిప్రా
వష్టౌసంఖ్యాగౌణపక్షోద్విజానాం ॥౮౯-౭॥

నాందీశ్రాద్ధమునందు మాత్రాదివర్గములో ఒక్కొక్కనికి ఇద్దరిద్దరుగా మాత్రాదులకు ఆరుగురును, పిత్రాదులకు ఆరుగురును, మాతామహాదులకు ఆరుగురును, విశ్వేదేవులకు నలుగురును మొత్తము ఇరువదియిద్దరు బ్రాహ్మణులను నిమంత్రించుట ముఖ్యపక్షము. అథవా మాత్రాదివర్గమునకు ఇద్దరును, పిత్రాదివర్గమునకు ఇద్దరును, మాతామహాదివర్గమునకు ఇద్దరును, విశ్వేదేవులకు ఇద్దరును మొత్తము ఎనమండ్రుగురు బ్రాహ్మణులను నిమంత్రించుట గౌణపక్షము.

## నాందీశ్రాద్ధకాలము

నాందీశ్రాద్ధస్యోదితో ముఖ్యకాలః।
ప్రాతస్సద్భిస్సంగవో గౌణకాలః।
తస్మాదూర్ధ్వం నోపచారాదికుర్యా
త్తూష్ణీం విప్రాన్భోజయేద్వృద్ధికామః ॥౮౯౮॥

నాందీశ్రాద్ధమునకు ప్రాతఃకాలము ముఖ్యము. సంగవకాలము గౌణము అని విద్వాంసులు చెప్పుచున్నారు. సంగవకాలము దాటినతర్వాత నాందీశ్రాద్ధము చేయునెడల ఉపచారాదికము చేయకూడదు. మంత్రరహితముగా బ్రాహ్మణులను భుజింపచేయవలెను.

## నాందీశ్రాద్ధవిధి

ప్రాతస్సముత్థాయ కృతాహ్నికస్సం
త్సుగంధపుష్పాక్షతభూషణాద్యైః।
అలంకరిష్ణుః కృతవైశ్వదేవ
స్సపంచయజ్ఞో హరిపూజనాంతే ॥౮౯౯॥
సమాహితాన్మంత్రవతస్స్వలంకృతా
న్విప్రాంత్సమాహూయ తదోపవేశయేత్।
తాన్ప్రాఙ్ముఖాంత్సత్యవసూసమన్వితా
న్ద్వావింశతిర్వాష్టహిమాతృపూర్వకం ॥౯౦౦॥
ఆసాద్య గంధాక్షతపుష్పధూప
యవానపోచ్ఛాభవకోఫలాని।

ప్రదక్షిణం ప్రాగపవర్గమేత
త్సర్వం హ్యుదగ్వాఖిలకర్మకార్యం ॥౭౦౧॥

ప్రాతఃకాలమున లేచి ఆహ్నికములగు స్నానసంధ్యావందనాదులను చేసికొని, గంధపుష్ప భూషణాదులతో నలంకరించికొని, వైశ్వదేవమును పంచమహాయజ్ఞములను చేసి, దేవపూజానంతరము వేదవిదులు, సమాహిత చిత్తులు, అలంకృతులు అగు బ్రాహ్మణులను ఇరువదియొక్కరినిగాని, ఎనమండ్రుగురినిగాని, నిమంత్రించి, ప్రాఙ్ముఖులనుగా ఆసీనులను చేసి, మాతృపూర్వకముగా గంధమును, అక్షతలను, ధూపమును, యవలను, స్వస్త్యోదకమును, రేగుపండ్లను, ఆసాదించి, ప్రదక్షిణముగాను, ప్రాక్సమాప్తిగాగాని, ఉత్తరసమాప్తిగాగాని సమస్తము చేయవలెను.

ఉదఙ్ముఖస్సన్నఖిలోపచారై
రావాహనాద్యైశ్చ సమర్చయేత ॥౭౦౨॥

ఉత్తరాభిముఖుడై ఆవాహనము మొదలగు సమస్తోపచారములతో పూజించవలెను.

తత్ప్రధానానుసమయః కాండానుసమయోపివా।
ద్రష్టవ్యస్తత్రపూజాయాం సర్వకర్మసునిశ్చయః ॥౭౦౩॥

ఆ నాందీశ్రాద్ధపూజయందు పదార్థానుసారముగాగాని, కాండానుసారముగాగాని, చేయవలెనని శాస్త్రములయందు నిశ్చయముగా చెప్పబడియున్నది.

యజ్ఞోపవీతే ప్రపితామహీంతి
పితామహీమాతర ఇత్యథాపి॥
పిత్రేపివర్గే ప్రపితామహాది
తద్దైవమాతుః ప్రపితామహాదౌ॥
మాతామహాదీతివదంతి కేచి
త్పత్నీయుతాంత్సత్యవసూచవిశ్వే ॥౭౦౪॥
క్రతౌ చ దక్షక్రతుసంజ్ఞకౌ చ
దేవాస్స్యురగ్రేచ ఉదాహరంతి।
తస్మాత్పూర్వం ప్రపితామహీంతి
క్రమేణకుర్యాదఖిలోపచారాన్ ॥౭౦౫॥

యజ్ఞోపవీతియై "ప్రపితామహీపితామహీమాతరః, అనిమాతృవర్గమునందును, ప్రపితామహాపితామహాపితరః" అని పితృవర్గమునందును మాతుఃప్రపితామహామాతుఃపితామహామాతామహాస్సదారాః, అనిమాతామహవర్గమునందును "సత్యవసుసంజ్ఞకవిశ్వేదేవాః" అని విశ్వేదేవస్థానమునందును చెప్పుచు సకలోపచారములతో పూజించవలెను. మాతామహ మాతుఃపితామహ మాతుఃప్రపితామహాస్సదారాః" అని మాతామహాదిగా కొందఱు చెప్పుచున్నారు. శ్రౌతమునందు చేయబడు నాందీశ్రాద్ధమునందు క్రతుసంజ్ఞక విశ్వేదేవులను చెప్పవలెను.

ఏకైకస్యైదేవతాయైవిభవేసతిపూజనం।
అపివావర్గవర్గస్యకుర్వీతైవయథావిధి ॥౯౦౬॥

సామర్థ్యము ఉన్నయెడల వేఱుగా వేఱుగా ఒక్కొక్కరికిగాని, అథవా ఒక్కొక్క వర్గమునకు గాని యథావిధిగా పూజచేయవలెను.

మాతౄశ్చయుష్మాసుపితౄన్భవత్సు
మాతామహాన్ త్వత్సకళత్రయుక్తాన్।
భవత్సువిశ్వానితిచాసనాది
కుర్వీతదీపాంతమనుక్రమేణ ॥౯౦౭॥

మాత్రాదివర్గమును, పిత్రాదివర్గమును, మాతామహాదివర్గమును బ్రాహ్మణులయందావాహనముచేసి, ఆసనాది దీపాంతముపచారములు యథాక్రమముగా అర్చింపవలెను.

తతస్సాద్యంహావిష్యాన్నమాదాయాపాసనానలే।
నాందీముఖేభ్యస్స్వాహేతియన్మేత్యేవత్రయోదశ ॥౯౦౮॥
ఆహుతీర్జుహుయాత్తత్రతూష్ణీంనేసనుపాణినా।
భక్ష్యభోజ్యాదిచాన్నానియథాసంభవమాదరాత్ ॥౯౦౯॥
దత్వోపాసేస్మగాయతేతిపంచర్చోక్తమన్నమిత్యృచం।
దధ్నాక్షతైశ్చబదరీఫలమిశ్రౌదనేనచ ॥౯౧౦॥
ఆదౌతుప్రపితామహ్యాపితామహ్యాతతఃపరం।
మాత్రేచేతిక్రమేణైవంశేషవర్గద్వయాయచ ॥౯౧౧॥
దద్యాద్వాఏకైకస్యపిండౌదాతవ్యాసాక్షతోదకం।
తత్రశేషంనకార్యంస్యాద్భుంజీరన్సహబంధుభిః ॥౯౧౨॥

అనంతరము ఆజ్యసహితము అగు అన్నముతో ఔపాసనాగ్నియందు "యదస్య కర్మణో" ఇత్యాది త్రయోదశ మంత్రాత్మకమగు అగ్నౌకరణమును చేసి, అనంతరము భక్ష్య భోజ్యాదులతో అన్నమును యథాసంభవముగా బ్రాహ్మణులకు పెట్టి "ఉపాస్మైగాయత" ఇత్యాది అయిదు ఋక్కులను "అక్షన్నమీమదంత" అను ఋక్కును జపించి, దధి, అక్షతలు, రేగుపళ్లు, యావన్నములతో మిశ్రితమగు అన్నముతో ముందుగా ప్రపితామహికిని, తర్వాత పితామహికిని, అనంతరము మాతకును, ఇట్లనే పితృమాతామహవర్గములకును, ఒక్కొక్కరికి రెండేసి రెండేసి చొప్పున పాత్రతోదకపూర్వకముగా పిండప్రదానమును చేయవలెను. తంత్రశేషమును సమాప్తి చేయక అంతట ఆపివేసి బంధువులతో భుజింపవలెను.

ఆవాహనాసనేపాద్యమర్ఘ్యమాచమనీయకం।
వస్త్రగంధాక్షతాఃపుష్పధూపదీపాస్సుభోజనం ॥౯౧౩॥
తాంబూలందక్షిణాదానంప్రదక్షిణనమస్కృతీ।
అత్రాభ్యుదయికేశ్రాద్ధేషోడశైతేప్యుపచారకాః ॥౯౧౪॥
స్యాత్పదార్థానుసమయఃకాండానుసమయోపివా।
ద్రష్టవ్యస్తత్రపూజాయాంసర్వేషుస్మార్తకర్మసు॥

ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనము, వస్త్రము, గంధము, అక్షతలు, పుష్పము, ధూపము, దీపము, భోజనము, తాంబూలము, దక్షిణాదానము, ప్రదక్షిణము, నమస్కారము, అని ఈనాంది శ్రాద్ధమునందు ఉపచారములు పదునారు.

పక్షాంతరనాందీశ్రాద్ధము

అథపక్షాంతరంవక్ష్యేత్రాపిస్యాన్మాతృపూర్వకం।
నాందీముఖాఃపితరఇతికుర్యాత్సర్వోపచారకాన్ ॥౯౧౫॥

పక్షాంతరనాందీశ్రాద్ధమును చెప్పుచున్నాను, పక్షాంతరనాందీశ్రాద్ధమునందును మాతృపూర్వకముగానే "నాందీముఖాఃపితరః" అనిషోడశోపచారములతో పూజించవలెను.

నాందీముఖాఖ్యాంశ్చపితౄంస్త్రివర్గా
నావాహయిష్యేత్రభవత్సుసత్సు।
తతోయథాసంభవవిప్రపూజాం
కుర్యాదథస్వస్త్యయనంజపిత్వా ॥౯౧౬॥

నాందీముఖానాంభవతాంపితౄణా

మిమానిపాస్యామిసుఖాసనాని।

దైవేతుణోత్రక్రియతాంసమస్తా

స్త్రైపాపు ఽవ స్వగ్రభవంతపవ ॥౯౧౭॥

నాందీముఖాఖ్యాఃపితరస్త్విదంవః

పాద్యంతతోంభఃకలశేభిమంత్ర్యా॥

యథ్రాసిదేవదేవేభ్యఃపుష్ట్వానాందీముఖాన్పితౄన్।

ఇమాన్లోకాన్ప్రణతూహినస్వాహేతియవాన్క్షిపేత్॥౯౧౮॥

సుగంధగంధాక్షతపుష్పజాతా

న్యంభస్సువిన్యస్యచతాభిరద్భిః ॥౯౧౯॥

నాందీముఖాఖ్యాఃపితరో ర్ఘ్యమేతి

న్నాందీముఖాఖ్యాఃపితరఃప్రియంతాం।

ఇత్యేవమర్ఘ్యంక్రమశఃప్రదద్యా

ర్దాతవ్యమత్రాచమనీయమేవ ॥౯౨౦॥

అత్రార్చతప్రార్చతమంత్రముక్త్వా

క్షతైశ్చపుష్పైరపిచార్చయేయుః।

వస్త్రాణ్యలంచందనకుంకుమాక్షత

స్రగ్ధూపదీపాంశ్చసమర్పయేత్త్ర ॥౯౨౧॥

సాజ్యాన్నమగ్నౌజుహుయాచ్చపూర్వవ

ద్భుక్త్వాన్నభోజ్యాద్యఖిలంప్రదాపయేత్।

తదాప్యాయస్వాఇతిపంచచాక్షు

న్నమీమదంతేత్యృచపవజప్త్వా॥౯౨౨॥

విచిత్రనానావిధరంగవల్లీ

విచిత్రితాలంకృతవేదికాయాం।

దధ్నాహారిద్రాబదరీఫలాక్షతై
ర్మిశ్రౌదనేనైవహిదేవతీర్థతః ॥౧౩॥
నాందీముఖేభ్యఃపితృభ్యస్స్వాహేతి
ద్వౌద్వౌతుపిండౌయుగపత్ప్రదద్యాత్ ॥
ఏకైకస్యైదేవతాయైక్రమేణ
షణ్మాతృభ్యఃపితృభ్యోథమాతుః ॥
పిత్రాదిభ్యస్త్రపత్నీయుతేభ్య
షట్పిండాస్స్యుర్ముఖ్యపక్షేపిగౌణే ॥౧౪॥
తేషాంపూజాగంధపుష్పాక్షతాద్యైఃకర్తవ్యైవస్యాత్ ॥

నాందీముఖాఖ్యులగు వర్గత్రయ పితృదేవతలను, బ్రాహ్మణులయందు ఆవాహనము చేసి సంధి వించినప్పుడు బ్రాహ్మణులను పూజించి స్వస్తిపుణ్యాహవాచనమును జపించవలెను. "నాందీముఖాఖ్యానాంపితౄణామిమాన్యాసనాని" అనిఆసనములనిచ్చి, "దైవే క్షణఃక్రియతాం" అని క్షణమునుయిచ్చి "ప్రాప్నువంతు భవంతః" అనిచెప్పి, "నాందీముఖాఖ్యాఃపితర ఇదం వఃపాద్యం" అని పాద్యమునిచ్చి, పాదప్రక్షాళనము చేయవలెను. అనంతరము "యవోసి "అనుమంత్రముతో యవలను అర్ఘ్యపాత్రలయందుంచి, చందనము, అక్షతలు, పుష్పములు వానియందుంచి, "నాందీముఖాఃపితరఇదంవోర్ఘ్యం" అని అర్ఘ్యమును ఇచ్చి, అనంతరము ఆచమనీయమును ఇవ్వవలెను. "అగ్నౌకరిష్యే" అను మంత్రమును చెప్పి అక్షతలతోను పుష్పములతోనుపూజించి, వస్త్రములు, అలంకారములు చందనము, కుంకుమ, అక్షతలు, పుష్పమాలికలు, ధూపము, దీపము, అనువానిని ఇచ్చిన తర్వాత ఆజ్యముతోను అన్నముతోను అగ్నౌకరణము చేయవలెను. బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. అనంతరము "అపాస్మి" ఇత్యాది ఐదుఋక్కులను "అక్షన్నమీమదంత" అనుఋక్కును జపించి, అనేకవిధములగు ముగ్గులచే అనేకవిధములుగా అలంకరింపబడిన వేదికయందు పెరుగు, పప్పు అక్షతలు, రేగుపండ్లు కలసిన అన్నముతో "నాందీముఖేభ్యఃపితృభ్యస్స్వాహా" అని దేవతీర్థముపలన రెండేసి రెండేసి పిండములను ఒక్కమారుఉంచవలెను. ఇట్లు ఒక్కొక్క దేవతకు రెండేసి రెండేసిగా మాతృవర్గమునకు ఆరును, పితృవర్గమునకు ఆరును, సపత్నీకమాతామహవర్గమునకు ఆరును, ముఖ్యగౌణపక్షములందు పిండములనుఇచ్చి ఆపిండములను గంధపుష్పాక్షతాదులతో పూజింపవలెను.

నాందీముఖాఖ్యాః పితరో యథాసుఖం
జుషధ్వముక్త్వైవహి భోజయేద్ద్విజాన్।
తాంబూలదానంత్వథ దక్షిణాంతతః
ప్రదక్షిణం చాపి సమస్క్రియాస్తతః॥౯౨౯॥

తైర్వాచయిత్వాశిష ఏవ బంధుభి
ర్భుంజీత శిష్యైరశనార్థిభిస్సహ॥

"నాందీముఖాః పితరః యథాసుఖం జుషధ్వం" అని చెప్పి బ్రాహ్మణులను భుజింప చేయవలెను. తాంబూలమును ఇచ్చి, దక్షిణను ఇచ్చిన తర్వాత ప్రదక్షిణమును నమస్కారమును చేసి. వారివలన ఆశీర్వాదముపొంది బంధువులతోను, శిష్యులతోను అన్నార్థులతోను కలిసి భుజింపవలెను.

శ్రాద్ధప్రసంగాదభ్యుదయశ్రాద్ధమక్తం యథామతి॥
సనిమిత్తాదిచాస్థూణావిరోహాంతమసంశయః ॥౯౩౦॥

శ్రాద్ధప్రశంసవలన నాందీశ్రాద్ధము యథామతిగా చెప్పబడినది. "సనిమిత్తో వ్రాజేత్" ఆప.గృ.౨౨-౧౩॥ ఇత్యాది అగారస్థూణాః విరోహేత్" ఆప.గృ.౨౩-౯ వరకు సందేహములు లేవు.

అద్భుతోత్పాత శాంతివిధి

స్థూణావిరోహణాదిష్ప్రోక్తోత్పాతాద్భుతాన్యథ॥
తేషామన్యేషు చోత్పాతేష్విత్యుక్తం తత్ప్రయోజనం ॥౯౩౧॥

ఇతరోత్పాతములయందు శాంతిని చేయుటకుగాను స్థూణావిరోహణము మొదలగు అద్భుతోత్పాతములను చెప్పియున్నాడు.

అన్యేషు చేతి వచనాదుపనాయజాత
కర్మాఖ్యశావహుతభుక్షువినాశనేషు॥
సచ్ఛ్రోత్రియస్య భవనాహ్రుతవీతిహోత్రే
స్యాద్వక్ష్యమాణఘృతహోమమిహైవకార్యం ॥౯౩౨॥

"అన్యేషు" ఆప.గృ.౨౩-౯॥ అను వచనమువలన ఉపనయనాగ్నియు, జాతకర్మాగ్ని, శావాగ్నియు నష్టములయినయెడల శ్రోత్రియగృహమునుండి తీసుకొని రాబడిన అగ్నియం

దు వక్ష్యమాణప్రకారముగా ఆజ్యహోమమును చేయవలెను.

నక్షత్రసంఘపతనాసనపృష్ఠయుక్త
తారోదయాదిధరణీచలనాదికేషు॥
ప్రత్యఙ్ముఖేచకదళీయది సూయతేవా
యామ్యాననాథదృశివాయసమైఘనాదా ॥౩౩॥
రాత్రేంద్రచాపదృశిగౌర్యదిసూయతేవా
భార్యాయమాయదిసదంతజనోచతేషు॥
ఔపాసనేత్రగృహిణోప్యజినాపనుత్త్యే
కుర్వంతితత్రవిధురాఅపిలౌకికాగ్నౌ ॥౩౪॥

నక్షత్రపతనము లోకదృక్క తారోదయములు, భూకంపము, అరటిచెట్లు, పడమట ముఖముగా గాని, దక్షిణముఖముగా గాని, గెలవేయుట, కాకమైథునము చూచుట రాత్రియందు ఇంద్రచాపము కనపడుట, ఆవు రెండుదూడలను ఈనుట, భార్య కవలపిల్లలను కనుట, శిశువు దంతసహితముగా పుట్టుట, మొదలగు ఉత్పాతములు సంభవించినప్పుడు తద్దోషపరిహారముకొరకు ఔపాసనాగ్నియందు గృహస్థులును, విధురులు లౌకికాగ్నియందును హోమము చేయవలెను.

తత్రాగ్నిమిద్ధ్వాద్యాజ్యభాగావసానకే॥
ఇమంమేవరుణేతిద్వేత్వన్నోఅగ్న ఇతిద్వయం ॥౩౫॥
త్వమగ్నేఅయాస్యంచ తథైవైకంప్రజాపతే॥
సంమ్రాజంచవ్యాహృతయఆజ్యేనైకాదశాహుతీః ॥౩౬॥
హుత్వాశమ్యాస్స్వజకాయాదిసమమాపరిషేచనాత్।
నిమిత్తేమరణేచేయంక్రియాచేత్పరిధింశిలాం ॥౩౭॥
నిదధ్యాద్దక్షిణేనాగ్నింఇమంజీవేభ్యఇత్యృచా।

అగ్నింధనాద్యాజ్యభాగాంతమున్నందు, ఇమం మేవరుణ, తత్వాయామి, త్వంనో అగ్నే, సత్వంనో అగ్నే, త్వమగ్నే, ప్రజాపతేనత్వదేతా, సమ్రాజంచ, భూః, భువః, సువః, భూర్భువస్సువః” అను మంత్రములతో పదునొకండు ఆహుతులను చేయవలెను. శాంతులయందు శమ్యలను వేయవలెను. జయాది తంత్రశేషమును సమాప్తిపొందింపవలెను. పుత్రాదులనేకులు మరణించుచున్నపుడు పూర్వోక్తప్రకారముగా శాంతిని చేసి, అగ్నికి దక్షిణభాగమున “ఇమం జీవేభ్యః” అను ఋక్కుతో మృత్యునివారకమగు శిలనుంచవలెను.

## ఉపసంహారః

యథామతీత్థం సుబోధసిద్ధ్యై కృతా వివిక్తా యకారికేశతః ఉక్తా ర్థసారం పరిగృహ్య ద్విత్రిభి ర్వా త్రైతమక్రం భవతి స్ఫుటం యథా ॥౯౩౮॥ శంకా స్థానా న్నిరస్య స్ఫుటి రిహ రచితా కారికావృత్తిరస్యా స్త్వా ధ్యాయేన స్వీయాన్ విహితసదాచారనిష్ఠావతాంహి। రాద్ధాంతః ప్రోచ్యతేథోపజ్వలనము ఖవిధాదగ్నిసంఖ్యాన చోక్తా యత్రాత్రైస్ప్రోక్షణే తజ్జుమభిముఖతో త్వాపసంప్రాకార్యా ॥౯౩౯॥ కర్తవ్యం స్రుక్స్రువా ప్రణీతాల తహన దర్భాగ్రసంమృష్టతాః ప్రోక్షణీకమ్నానస్యార్థిత మిహాకదాస్రువమగ్ర్యప్రభృతి। అథాద్యాదివ్యాస్త్రకధ్మః పరిధయః ఇటినా న్యాసమిత్యాస్యార్థదాచి స్థాలీపాకేషు చాంతేజ యుపిధిషుయదస్యాత్రై చాస్విష్టకృత్యాత్ ॥౯౪౦॥ ఆగ్నేయే వైశ్వదేవాగ్రయణే ఫణిబలిశ్రా వమాస్య ష్టకాసు, నో శమ్యా నో జయాద్యాః క్వచి దపిచ సపిండీ క్రియాయాం చ పిత్ర్యే। స్నానం కర్మాదగే ర్వే ప్రథమ మూపయమ శ్చోదగర్వే వసాతే జేష్టేనా శైశిరే నో క్వచి దథ తు వివాహా క్రియా ద్వష్టసు స్మా॥౯౪౧॥ ప్రాణాయామా యతాసూత్ర్రత ఇహా న రో గ్రాహ్యాణో ద్వాసనాస్త్రం హ్యశీనస్వాకర్మాన్యపిఖలువర ఏవా వపే దత్రలాజాన్। సత్రభాతా జాతు త్రిష్ఠన్నహి భవతి తతో రుంధతీ దర్శనాంతే స్థాలీపాకో ధ చౌపాసన పితురుభయోః కాలయో రగ్ని రేవ॥౯౪౨॥ ప్రాతః స్నాత్వా చౌపాసన దిన *పరతః పౌర్ణమాస్యాంచ సత్యాం స్యాదన్వారంభణీయ శ్చరు విధి రుదితో ధాం గ్నిముఖాత్ర హుతిస్తు స్థాలీపాకా వదానా ద్విహితి విధిముఖ్యనోపదిష్టాతిదిష్టః స్థాలీపా కేషు నశ్వేష్వ పిచ ఘృత హవిష్యేషు నాగ్న్యాహుతిస్స్యాత్ ॥౯౪౩॥ పర్వాణ్యన్వారంభణీయా గ్రయణ హృదయ సర్గ క్రియా వైశ్వదేవ మాసి శ్రాద్ధాష్టకేశ గ్రహ మఖ గణ హోమా మహారాజయా గః॥ స్థాలీపాకేషు చైషాం విధిషు తు జుహుయా దగ్ని పక్త్రిం ప్రధాన దేవా గ్ని స్విష్టకృద్భ్య పిచ ఖలు హవిషై కేన చో ద్యోతసేవేచ॥౯౪౪॥

---

* తతఃపరంతి ఇతి పాఠాంతరం.

ఉద్వాహో దూర్ధ్వ రాకా హని కృత నియమో వైశ్వదేవార్థ సిద్ధ్యై
స్థాలీపాకో త్ర కార్యో ధ్యయన పఠన తో౽గ్న్యాది రౌద్రాం తమం
త్రైః। దోష్ణా సంమార్జనా ఘ్రాతుణ బలి పరిషేకా న్ప్రక్రమేణైవ కు
ర్యాత్ స్థానం స్థానం ప్రతిష్ఠం తదను చ బలి దేశేషు తేష్వానుపూ
ర్వ్యాత్॥౧౮౫॥ పశ్చిమ స్థాన యోః స్యా శమన దిశి బలీ పిత్ర్య సాగ్రా
ప్రసవ్య సవ్యాభ్యా మేవ సాంగ్యాత్ముపరి పరిషేకౌ చ తద్వస్మ భేదాత్।
కాండా ధ్యాయ ప్రపాఠో పాకరణ విశేషు చో త్సర్జనేషు ప్రయత్నా న్నో
పస్థానం న సూక్తం సనన జయ విధయ స్త్రీశే సౌమ్యేస్య ఆహుః।
॥౧౮౬॥ మౌంజీ బంధో వసంతే వృధగశన భుగే వాత్ర మాత్రా
న సాకం భుక్త్వా వా స్యా త్కుమారా నల విధి సమిధ స్సు త్రయో
దశ్య ఉక్తాః। వ్యాహృత్యా సాక మేవా ప్యుదగయన శుభ ర్తేనమా
వర్త్యం స్యా త్కర్తవ్యం శుక్ల పక్షే హని సుత జననే కార్య మేకా
దశే హ్ని ॥౧౮౭॥ జాతేష్టిర్నా మజాతం త్రితయ మపితతో నామకర్మాహ్య
మంత్రంచాంగాదాది ప్రవాసా ద్వ్యవనమభిసమేత్యాభిమంత్ర్యాది కార్యం॥
మాసి శ్రాద్ధ క్రియాయాం జ్వలన ముఖవిధి శ్చాజ్య భాగా వసానే
సంకల్పా ద్యంబరాంతే ద్విజ గణ సమనుజ్ఞాత ఆదాయహా మ్యం॥౧౮౮
అగ్న్యాది స్విష్టకృద్భ్యో హవి రిహ జుహుయా ల్లేపయో రాది విప్రాన్
సంభోజ్యో త్సృజ్య పిండాన్ (ద్విజనహుతశిష్టా) ద్దాపిస భుక్త్వేష్ట భు
క్స్యాత్। పిత్రోః ప్రత్యాబ్దికాదౌ కృత వృధగశనా ద్వైశ్వదేవం చ
పంచయజ్ఞా న్నిర్వర్త్య చాగూః ప్రభృతి వసన దానాం తిమే విప్ర
వాక్యాత్॥౧౮౯॥ హోతవ్యా అంధసా జ్యేనచహుత భుజి దర్వ్యా
త్రయోదశ్య ఉక్తాః యస్మై మాతా ప్రభుస్యః పర మిహ కబల ప్రా
శనాంతం సమానం। నిత్యో ధార్యోయమగ్ని ర్యది సమనుగతో మం
థ్య ఇత్యాది నోక్తా వహ్న్యు త్పత్తి స్త దేనో నిరసన ముపవాసేన ప
త్న్యా శ్చ పత్న్యాః ౧౯౦॥ నాశే చైవా పహారే జ్వలన ముప సమాధా
య సంస్కృత్య సర్పి శ్చాయాశ్చ వ్యాహృతీ ద్వే హుతభుజి జుహు
యా త్స్రుక్స్రువాభ్యాం క్రమేణ। భూయ స్సంధాన మేత న్మదభిమత మ
యా శ్చేత్ప్రపంచం వ్యాహృతి శ్చేన్నాన్య త్కించి త్స్వశాఖాంతర హి

కరణే తస్య దృష్టం ప్రమాణం ॥౯౧॥ ఉక్తం స్యాజ్జాతకర్మోపనయ
న శేష కర్మస్వపి హోమః ప్రమాదాన్నష్టశ్చేచ్ఛ్రోత్రియాగారద
మరణి భవం వా నలం స్థాపయిత్వా। తంత్రం కుర్యాదిమం మే వరుణ
తదితి చార్యా ఇత్యేకాదశాపి హోమాంత వ్యాహృత్య ప్రయాద్యా అపి ఘృత
హోవిషాన్యేషు చేత్యేవ సూత్రాత్ ॥౯౨॥ బహ్వల్పం వా స్వగృ
హ్యోక్తం యస్య కర్మ ప్రచోదితం। తస్య తావతి శాస్త్రార్థే కృతే
సర్వం కృతం భవేత్ ॥౯౩॥ ఇత్యుక్తం మనునా గర్భాధాన నామా
న్న కర్మసు। హోమో నోక్తో నామ్నా మంత్రాస్తావదేవాల మి
ష్యతే ॥౯౪॥ అనుక్త మన్యతో గ్రాహ్య మవిరుద్ధ మపేక్షితం। ఇత్యే
వాన్యత్ర సంస్కార హోమ మంత్రేభ్య ఉచ్యతే ॥౯౫॥

అవశ్యకరణీయశిష్టాచారకర్మలు.

ఆచార్యైర్వ్యనుక్తా సకరణ దురితావశ్య కార్యా విగీత
శిష్టాచారాంశ్చ వక్ష్యే గ్రహమఖ సరబంధాంకురారోపణాని
స్మార్తం పుణ్యాహకర్మాభ్యుదయిక సరణిర్వ్యంశ దేవ ప్రతిష్ఠా స్నా
నం యజ్ఞోపవీతాహత వసన మహాభూషణానాం వరాయ ॥౯౬॥
ఉద్వాహే గ్నిప్రతిష్ఠాపన మరణి భవం శ్రోత్రియాగార జం వా దం
పత్యోశ్శోభమోర్వారణ వసన విశిష్టదీపికా బ్యంగ పాత్రే। ల
గ్నం మాంగళ్యసూత్రాభరణ వసన బంధాత్క్షుతారోపణాని జా
యాపత్యోర్న్నఖోత్కృంతనమపి హరిద్రాణ్యగ్నసంచాంబి
కాయాః ॥౯౭॥ పాత్రాణాం నామదర్వీప్రభృతి హుత వహాధ్యా
స పూజా తథోపస్థానం చోపాసనాగ్నేర్భసిత ధృతిరథో పూర్ణ
పాత్రోత్ క్షేణం చ। బ్రహ్మాగ్న్యాప్తో ద్విభార్యాద్వ్యలన యుగళ సం
సర్గ మాధ్యాహ్నికే చ హోమ ద్రవ్యప్రమాణం ప్రథమ చరు కథో
దుష్ట నక్షత్ర శాంతిః ॥౯౮॥ కార్పాసం కర్ణవేధో హ్యుపనయన విధేః
ప్రాగనాచార దోష ప్రాయశ్చిత్తం చ తంతుం నవ గుణ మపి య
జ్ఞోపవీతస్య కాలః మాహూర్తం మాతృభిక్షాచరణమథ చతుర్థేష్వపాలాశ
పూజా మాంజీ దండాదినానాం నిరసన మక్షతస్నాతనానాం చ కార్యం ॥౯

ఆచార్యైఃకథితంహిసర్వబుధవర్యైర్వైవాహికస్యేతియత్తస్యార్థోద్వివిధో
వ్యవస్థితవికల్పైర్నోచ్యతేసూరిభిః।యస్యాస్త్యనయుతోవివాహకవిధిస్తస్యా
యనేచోత్తరేత్యవేషాంతునృణాంహిసర్వబుధవర్యైర్గాహ్యమివాహా
త్మనే ॥౯౬౦॥

గ్రంథకర్తృప్రార్థనా

సూత్రాణ్యాపస్తంబ గృహ్యస్య గూఢ సందేహ వ్యానాతి కాని తాని సంక్షిప్య లోచ్చైనసంక్షేపతస్తు ప్రోక్తాత్ర శ్లోకరూపేణ వృత్తిః ॥౯౬౧॥ ఇత్యాపస్తంబీయ గృహ్య మిష్టి మావేదితం మయా సత్యే స్సారం తు వై గ్రాహ్య మసారం త్యజ్యతా మిహ ॥౯౬౨॥ మంత్ర ప్రశ్న ద్వితీయ వ్యాఖ్యాస్తి యేషాం గృహ్య ప్రశ్నస్యార్థతాం ప్రర్థ్య జ్ఞానం। వ్యాఖ్యాస్యాంతాం కారికావృత్తి రేషా నాధ్యా నాన్యే మా క్వచిత్కేవలానాం ॥౯౬౩॥ అర్థా త్స్వాత్రే శ్లోక రూపైః పఠత్తే స త్యాంగాదౌ భంగతా ప్రాయశః స్యాత్। తత్స్వాత్రార్థా చిత్యక ర్మాభిపిత్స్య త్వంత్వాత్పూర్వామే పరాధో మహాన్తః ॥౯౬౪॥ నమో లక్ష్మీ నృసింహాభ్యా మాపస్తంబాయ వై నమః। భాష్యకృద్భ్యో నమో మాతాపితృభ్యాం చ నమో నమః ॥౯౬౫॥ ఆనంద వర్షే యది శాలివాహకే గతే చతుష్షష్టివిహీన షోడశే। శరచ్ఛృతే గీత ఉపేంద్ర తుష్టయే శ్రీకారికా వృత్తి రకార్య సంశయా ॥౯౬౬॥ నృసింహ నామ్నైవ యథా మతీత్థం స్వ నిత్య నైమిత్తిక కర్మభిస్తు। పుంసాం భవత్యేవహి చిత్త శుద్ధి ర్జ్ఞానం చ తస్మాత్తత ఏవ ముక్తిః ॥౯౬౭॥ దురుక్తమ ప్యుక్త మనుక్త మన్యథా ప్రోక్తం యదస్యా మఖిలం విమృశ్య తత్। తుష్టాం క్రియా పిత్పృతినో ర్మహాధో త్సవా త్సమార్ద్రి యధ్వం కథితాం కృతిం మయా ॥౯౬౮॥ అస్యా వృత్తే రాదిత శ్లోక సంఖ్యా పంచ త్రింశ న్న్యూన సాహస్ర మాసీత్। గ్రంథస్యావ తాన్యచ్ఛత ద్వాశతంచపంచాశ చ్చాప్యుత్తరం సిద్ధమేవ ॥౯౬౯॥

నృసింహకారికావృత్తిస్సమాప్తా

ఇతి శ్రీపాద వేంకటరమణదైవజ్ఞవిరచితా నృసింహకారికావృత్తి భాష్యప్రకాశిఖ్యాంధ్రవివృతిస్సమాప్తా

